# సామ్రాజ్యము

# సామ్రాజ్యము

రచన:

**లూయీ ఫిషర్**

ఆంధ్రీకరణము:

పండితారాధ్యుల నాగేశ్వరరావు



ప్రకాశకులు:

కల్చరల్ బుక్స్ లిమిటెడ్

**పెరంబూరు :: మద్రాసు 11.**

సార్థకమైన, స్థిరమైన శాంతినిర్మాణం అంత సులభం కాదు. అందరికీ సంతృప్తికరంగా ఉండగల శాంతిపరిష్కారాలకు దోహదం చేయగల మనోభావాలు సంగ్రామాలనుండి ఉత్పన్నం కాలేవు. అయినా, కొన్ని ప్రత్యేక ఇబ్బందులు ఉన్నప్పటికీ, ఈదఫా వాస్తవ శాంతి లభ్యమే.

శాంతి పరిష్కారాలంటే ఇంతవరకూ ఒకవిధమైన అభిప్రాయం ప్రచారంలో ఉంది. యుద్ధంలో విజయాన్ని పొందినవారు పరాజితులకు విధించే శిక్షలు, వారిపై జరిపే చర్యలే శాంతిపరిష్కారమని సామాన్యంగా అందరూ అనుకుంటున్నారు. కాని పదికాలాలపాటు మనగల, న్యాయసమ్మతమైన శాంతిని సాధించడానికి అనుసరణీయమైన మార్గం అదిమాత్రం కాదు. ఇలాంటి శాంతిపరిష్కారాలవల్ల సుస్థిరశాంతి లభ్యంకాదు.

ఇంట గెలిచి రచ్చ గెలవాలి. ముందు మన ఇల్లు చక్కబెట్టుకుంటే ఆపైన ప్రపంచాన్ని చక్కబెట్టవచ్చు. శాంతిస్థాపనవిషయంలోనూ ఇదే పద్ధతి. ముందు ఏ దేశానికాదేశం అంతశ్శాంతిని సాధించుకుంటే ప్రపంచ శాంతిసాధన తేలిక అవుతుంది.

అసలు మనం ఒక ముఖ్యవిషయాన్ని గుర్తించాలి. ఎప్పుడూకూడా కర్తలనుబట్టే సృష్టి ఉంటుంది. శిల్పులనుబట్టే శిల్పం ఉంటుంది. శాంతి నిర్మాణవిషయమూ అంతే, శాంతికర్తలకంటే వారు ఏర్పాటుచేసే శాంతి

మెరుగ్గాగాని, నాణ్యంగాగాని ఎలా ఉంటుంది? శాంతినిర్మాతలు ఎలాంటి వారైతే వారు నిర్మించే శాంతికూడా అలాగే ఉంటుంది. వారు ఎంత సమర్థులూ, సహృదయులూ అయితే శాంతికూడా అంత సమర్థత కలదీ, నవ్యమైనదీ అవుతుంది. కాని ప్రభుత్వాలు సామాన్యంగా తమ ఆకారాలను అనుసరించే శాంతిని ఏర్పాటుచేస్తవి.

ఈ నాడు ప్రపంచం వ్యాధిగ్రస్తమైఉంది. నేటిసంగ్రామాలకు ఈ వ్యాధిగ్రస్తతే కారణం. ఈసంగ్రామానంతర శాంతిపరిష్కారాలు వ్యాధిని నిర్మూలనం చేసి ప్రపంచానికి స్వస్థతచేకూర్చగల శక్తిని కలిగిఉండవచ్చు. లేదూ, అసలు ప్రపంచాన్నే సమూలంగా నిర్మూలనం చేయగల విధ్వంసక శక్తులు కావచ్చు. లేక ఈ రెండు గుణాలూ అసమానపాళాలుగా కలిగిఉండవచ్చు.

అయితే ఒకటిమాత్రం ఖాయం. మనం స్థాపించే శాంతి యథార్థమైనదిగానూ, సుస్థిరమైనదిగానూ ఉండాలంటే ఈ ప్రపంచాన్ని పీడిస్తున్న వ్యాధులు పూర్తిగా నిశ్శేషం కావాలి. ప్రపంచం పరిపూర్ణస్వస్థతను పొందాలి.

మనం అక్షరాజ్యాలను జయించడమేగాక, వాటిని జయించినతరువాత ఆ రాజ్యాల నావహించిన వ్యాధులకు తగిన చికిత్స చేయాలి. ఈ చికిత్సాకార్యాన్ని ప్రారంభించడానికి మరికొంతకాలం పట్టవచ్చు. ఈలోపున ఐక్యరాజ్యాలు స్వవిషయం విచారించుకోవచ్చును. తమ్ము బాధిస్తున్న వ్యాధులకు ముందు చికిత్సచేసుకోవచ్చు. ఆపైన ప్రపంచాన్ని ఆవహించిన వ్యాధులకు చికిత్సచేయవచ్చు, ఇలా చేయడంవల్ల ప్రత్యేకప్రయోజనంకూడా ఉంది. తమ రోగాలను కుదుర్చుకోవడంద్వారా ఐక్యరాజ్యాలు కొంత అనుభవాన్ని పొందుతవి. ఇతరులకు చికిత్స చేయడంలో ఈ అనుభవం బాగా ఉపయోగపడుతుంది.

ఇవి ముఖ్యమే అయినా వీటన్నింటికన్నా ప్రధానమైనవిషయం

ఒకటిఉంది. సుస్థిరశాంతిసాధన సంగ్రామ హేతువులు పూర్తిగా తొలిగి పోతేనేగాని సాధ్యంకాదు. యుద్ధాలుజరగడానికి ఎన్నోకారణాలువుంటవి. ఈ కారణా లన్నింటిలోకీ ముఖ్యమైంది సామ్రాజ్యాలు. వలసదేశాల సమస్య పూర్తిగానూ, శాశ్వతంగానూ పరిష్కారం కాకపోతే ఈ యుద్ధం తరువాత మరెన్నో యుద్ధాలు జరగవచ్చు. ఆ సమస్య అపరిష్కారంగా ఉన్నంతకాలం ఇలా యుద్ధాలు వస్తూఉండవలసిందే.

ప్రపంచజనాభా మొత్తం 200 కోట్లకు పైగా ఉంది. ఈ జనాభాలో సగానికి పైగా ఆసియాఖండంలో ఉంది. ఈ ప్రాంతంజనాభా చాలాకాలంగా ఎదుగులోనే ఉంటున్నది. గత అయిదుదశాబ్దాల్లోనూ ఆసియా జనాభా దాదాపు రెట్టింపు అయింది. నేటి ఆసియా వెనుకట్లాగా లేదు. యావత్తు ఆసియా నిద్రమేల్కొంది. ప్రజలు కళ్లు తెరిచారు.

శాంతిభద్రతలు, స్వాతంత్ర్యసౌభాగ్యాలు, పేరుప్రతిష్ఠలూ కావాలంటున్నారు. తమ స్థితితెలుసుకున్నారు. స్వశక్తిని, సామర్థ్యాన్ని గ్రహించారు. ఇతరుల మాదిరి అభివృద్ధి కావడానికి తమకూ ఎన్నో అవకాశాలు ఉన్నవని తెలుసుకున్నారు. ఆసియాబాగోగుల బాధ్యత తెల్లవారిదనీ, ఆసియాభారాన్ని యావత్తూ శ్వేతజాతులే భరిస్తున్నవనే వాదాలతో ప్రజలు విసిగిపోయారు. ఈ మార్పును, ఈ కొత్తపరిణామాన్ని అమెరికారాజకీయవేత్తలు గ్రహించారు. ఆసియాలో నవయుగోదయం అయినట్లు గుర్తించారు. కనుకనే వీరు, పదేపదే, "సామ్రాజ్యవాదం నమసిపోవా" లని హెచ్చరిస్తున్నారు. "సామ్రాజ్యాల, సామ్రాజ్యవాదుల శకం సమాప్తమైంది." అని 1942-వ సంవత్సరంలో సమ్నర్ వెల్స్ ప్రకటించాడు. అమెరికాఉపాధ్యక్షుడు హెన్రీ వాలెస్ అదేసంవత్సరం నవంబరుమాసం 8-వ తేదీన న్యూయార్క్ పౌరసభలో ప్రసంగిస్తూ ఇలా చెప్పాడు: "నవప్రజాస్వామికానికి సామ్రాజ్యతత్వం అంటే పరమ అసహ్యం.'' ఇక అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్ వెల్ట్ స్వంతమనిషిగా ప్రపంచపర్య

టనం చేసి "ఏకప్రపంచం" సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన వెండల్ విల్కీ విధీ విరామం లేకుండా సామ్రాజ్యవాదాన్ని తెగడుతూవచ్చాడు. వీరందరూ అసలువిషయాన్ని అవగాహన చేసుకున్నారు. "సామ్రాజ్యం అంటే సంగ్రామమే" అనే సంగతిని వీరు గ్రహించారు. వీరితో ఈ విషయమై ఏకీభవించేవారు అమెరికాలో చాలామంది ఉన్నారు. వీరిసంఖ్య క్రమంగా హెచ్చుతూఉంది కూడా. అమెరికాలో సామ్రాజ్య ప్రతికూలురు ఎక్కువవుతూ ఉన్నారు.



వెండల్ విల్కీ

ఈ సంగ్రామం విజయవంతంగా పరిసమాప్తమైన తరువాత శాంతి సాధనకు సామ్రాజ్యాలే ప్రబలప్రతిబంధకాలు కాగలవు. కనుక సామ్రాజ్య విరహితమైన ప్రపంచనిర్మాణానికి తగిన పథకాన్ని తయారుచేయడమే శాంతికర్తల ప్రథమ ప్రధానకర్తవ్యం. ఇలాజరగని పక్షంలో సంగ్రామానంతరప్రపంచం శాంతిశూన్యప్రపంచం అవుతుంది. యుద్ధానంతరపు శాంతిపరిష్కారాలు వలసదేశాల సమస్యను పరిష్కరింపలేకపోతే, ఆ పరిష్కారాలు వట్టి బూటకములే అవుతవి. అవి నిజమైన పరిష్కారాలు కావు. సామ్రాజ్యాల సంగతి విచారింపని శాంతిశిల్పులు వాస్తవవిషయాలను వదలి కేవలం మిథ్యాలోకంలో వ్యవహరిస్తున్నారని చెప్పవలసివస్తుంది.

ఈ యుద్ధం ఐక్యరాజ్యాలకు అనుకూలంగా అంతమౌతుంది. ఆ తరువాత ఒక అంతర్జాతీయసంస్థ ఏర్పడుతుంది. ఈ సంస్థ నిర్వహింపవలసిన విధులు, చాలా ముఖ్యమైనవి రెండు ఉన్నవి. స్వాతంత్ర్యాన్ని, స్వపరిపాలనాధికారాన్ని పొందినా వాటిని సమర్థించుకోలేని స్థితిలో ఉన్న వలస దేశాలు కొన్ని ఇప్పటికీ ఆసియాలోనూ, ఆఫ్రికాలోనూ ఉన్నవి. అలాంటి వలసలు శీఘ్రగతిని అభివృద్ధిపొందడానికి అవసరమైన, అనుకూలమైన ఏర్పాట్లు చేసి, వాటిప్రకారం ఆ వలసలు సవ్యంగా, సంతృప్తికరంగా వృద్ధి పొందుతూఉన్నవోలేదో అజమాయిషీచేస్తూఉండడం ఈ అంతర్జాతీయ సంస్థ మొదటిధర్మం. కొన్ని వలసదేశాలు అన్నివిధాలా పరిపక్వాన్ని పొంది సంపూర్ణస్వాతంత్ర్యాన్ని అనుభవించడానికీ, స్వపరిపాలనాధికారాన్ని నిర్వహించుకోవడానికీ అర్హతను సంపాదించుకొనిఉన్నవి. అలాంటి వలసలను స్వతంత్రదేశాలుగా చేసి, శాంతిసౌభాగ్యాలను సాధించేనిమిత్తం స్థాపనయగు ప్రపంచవ్యవస్థలోకి తీసుకురావాలి. ఇది రెండవ విధి.

ఈ ముఖ్యవిధిద్వయాన్ని విస్మరించి శాంతిని స్థాపింపబూనుకుంటే ఫలితం కేవలం పాతపునాదులమీద కొత్త కప్పు వేసినట్లే ఉంటుంది. ఏ కట్టడానికైనా ప్రధానం, ఏ కట్టడమైనా పదికాలాలు నిలవాలంటే, అవసరమైనది గట్టి పునాదే. నేటి ప్రపంచపునాదులు అనేక సంగ్రామాలకూ, విపరీతసంక్షోభానికీ కారణభూతమైనవి. కనుక ఆ పునాదులను అలాగే ఉంచి కప్పుమాత్రం కొత్తది వేస్తే ప్రయోజనం ఏముంటుంది ? కొత్తసౌధాన్ని ఎలా నిర్మించగలుగుతాం ? ఈ అసలు విషయాలను అలక్ష్యం చేసే శాంతికూర్పరులు అనేకదఫాలు యుద్ధాలు సాగించిన పాత ప్రపంచపునాదులపైనే కొత్త కప్పును వేసినవారవుతారు.

సామ్రాజ్యాలు శాంతికి ప్రతికూలంగా పనిచేస్తవి. ఆర్థిక అభివృద్ధికీ, ఆర్థిక స్థిరత్వానికీకూడా ఈ సామ్రాజ్యాలు వ్యతిరేకంగా పనిచేస్తవి. అసలు సామ్రాజ్యాలు చాలా దండగమారి వ్యాపారం. ఖర్చు

ఎక్కువ; ఆదాయం తక్కువ. 1812-వ సంవత్సరంలో బ్రిటిష్ విదేశాంగ కార్యదర్శి లార్డ్ కాసిల్రీ ఉత్తర అమెరికా వలసలనుగురించి చెప్పిన మాటలు గమనిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది: "ఉత్తర అమెరికా మన వలసగా ఉన్నప్పటికంటే, ఆ దేశం మన సామ్రాజ్యం నుండి విడిపోయినతరువాతనే బ్రిటన్ ఆ దేశంలో ఎక్కువగా వాణిజ్య ప్రయోజనాలను పొందగలిగింది."

ఉత్తర అమెరికా వలసలు పదమూడూ స్వాతంత్ర్యాన్ని పొందినందున బ్రిటనుకు కలిగిన లాభం ఇంతా అంతా కాదు. విపరీతంగా ధనాన్ని ఆర్జించింది. వ్యాపారాన్ని అపరిమితంగా వృద్ధిచేసుకున్నది. ఇవిగాక కష్టకాలంలో ఆదుకోగల ఒక ఆప్తమిత్రుని సంపాదించుకున్నది. ప్రథమప్రపంచసంగ్రామంలో అమెరికా బ్రిటనుకు రక్ష అయింది. ఇక ద్వితీయప్రపంచ సంగ్రామంలో 1940-43 సంవత్సరాల మధ్య—అప్పటికి అమెరికా ఇంకా కక్షిదారు కాలేదు—బ్రిటన్ అండను నిలబడింది.

"మన ప్రపంచ వ్యవహారాల నిర్వహణ ఎంత అకటావికటంగా ఉంటున్నదో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది" అని బెంజమిన్‌ఫ్రాంక్లిన్ 1785-వ సంవత్సరంలో అన్నాడు. ఆనాటి ఆయనమాటలు ఈనాటికీ యథార్థంగానే ఉన్నవి. ప్రభుత్వాలుగాని, దేశాలుగాని గతానుభవ ప్రయోజనాలను మహా అరుదుగా పొందుతూ ఉంటవి. చేసినతప్పులనే చేస్తూ ఉంటవి. 18-వ శతాబ్దంలో అమెరికాలో ఏ పొరపాట్లు చేసిందో సరిగ్గా అదే మాదిరి పొరపాట్లను బ్రిటన్ తిరిగి ఈరోజున భారతదేశంలో చేస్తూవున్నది. ఈ శతాబ్దాలు వాటి మామూలుకాలం అయిపోయినా అలాగే నిలబడి ఉంటవి. శతాబ్దాలు ముగిసినా ఆకాలపు భావాలుమాత్రం ఉండిపోతున్నవి. వాస్తవానికి ఈ ప్రపంచాన్ని వేధించుకుతింటున్న మహాపాతకాల్లో ఈ శతాబ్దాల దీర్ఘత్వం ఒకటి. ఇరవయ్యో శతాబ్దంలో మనల్ని

వేపుకుతింటానికే 18,19 శతాబ్దాలు (వాటి పోకడలు) వాటి జీవితకాలము అయిపోయినా జీవించిఉన్నవి.

సామ్రాజ్యాలు పాతకాలపు సంస్థలైనవి. సామ్రాజ్యదేశాలకు సామ్రాజ్యాలు కేవలం గుదిబండలుగా తయారైనవి. వలసదేశాలకా, అవి తలమోపులైనవి. ఈ పరిస్థితుల్లో, ఫ్రాంక్లిన్ అన్నట్లు, ఈ సామ్రాజ్యాల పోషణ సాగుతూవుండటం విపరీతంగానే కనిపిస్తుంది. ఇదే సామ్రాజ్యాల సమస్య.

అసలు సామ్రాజ్యాలే సమస్యలు. ఒకొక్కప్పుడు వలసలు అయాచితంగా, అప్రయత్నంగా సంప్రాప్తమౌతూవుంటవి. 16-వ శతాబ్దంలో ఒక పోర్చుగీసు నావికుడు బయల్దేరి ఆఫ్రికా ఖండాన్ని చుట్టి ఆసియాఖండం చేరాడు. దారిలో అతనికి దాహం అయింది. దప్పిక తీర్చుకోడానికి మంచినీళ్ళు కావలసివచ్చింది. చైనా కోస్తాన హాంగ్‌కాంగుకు సమీపంలోవున్న మాకౌరేవు చేరి తన నావకు లంగరువేశాడు. అప్పట్నుంచీ దాదాపు నాలుగువందల సంవత్సరాలు ఈ రేవు పోర్చుగీసు వారి వలసగా వుండిపోయింది.

సామ్రాజ్యాల విషయంలో ఇట్టి విధివైపరీత్యాలు అనేకం గోచరిస్తవి. భారతదేశం ఫ్రాన్సువలసగాక బ్రిటన్ వలస కావడం, గ్రీన్‌లాండ్ డచ్‌వారికిగాక డేన్స్‌కు సంక్రమించడం, జావా బ్రిటిష్ అధీనదేశంగాక డచ్ వలస కావడం—అన్నీ ఇలాంటి వైపరీత్యాలే.

నేడు వర్ధిల్లుతూవున్న సామ్రాజ్యాలు అన్నీ ఆటే ప్రయత్నంలేక, ఎక్కువగా దురాక్రమణఫలితంగా ఏర్పడినవే. సామ్రాజ్యాలు మామూలుగా ఒక దేశబలాధిక్యతవల్లా, మరోదేశ దౌర్బల్యంవల్లా ఏర్పడతవి. న్యాయం, ధర్మంమీద అవి ఏర్పాటుకావు. నిజానికి భారతదేశాన్ని పాలించడానికి బ్రిటనుకు హక్కు ఏముంది? 1936-40 సంవత్సరాల మధ్య అబిసీనియాపై అధికారం చలాయించడానికి ఇటలీ ప్రత్యేక హక్కు

ఏమిటి? మంచూరియానుగాని, బర్మానుగాని పాలించడానికి జపానుకు ఉన్న అర్హత ఏమిటి? ఏమీ లేదు.

సామ్రాజ్యాలు అశాస్త్రీయంగానూ, హఠాత్తుగానూ ఏర్పడినందు వల్లనే ప్రపంచం సురక్షితంగానూ, సుస్థిరంగానూ ఉండలేకపోతున్నది. ఇంటగానీ, బయటగానీ న్యాయశాస్త్రం ఆధారంగానే శాంతి ఏర్పడగలదు. సామ్రాజ్యవాదం న్యాయశాస్త్రానికి పూర్తిగా విరుద్ధం. "నోరుగలవాడిదే రాజ్యం" అనేసిద్ధాంతం అది.

ఏదో విధివశాత్తూ, ఒకదేశానికి ఒక వలస సంప్రాప్తిస్తుంది. వెంటనే ఆ దేశపు శత్రురాజ్యాలూ, ఆ దేశంతో పోటీపడే ఇతరదేశాలూ తమకూ అలాంటి సామ్రాజ్యం ఎప్పుడు, ఏ విధంగా లభిస్తుందా అని కలలుకంటూ ఉంటవి. అలాంటి విధికృతాలకూ, ఆకస్మికసంఘటనలకూ కలవరిస్తూ ఉంటవి. ఈ విధంగా పోటీ సామ్రాజ్యాలు ఒకదాన్ని ఒకటి సవాలుచేయడం జరుగుతుంధి. యుద్ధమే దీని ఫలితం. ప్రథమప్రపంచ సంగ్రామహేతువు ఆఫ్రికా, ఆ సంగ్రామబీజాలు అక్కడే వేళ్ళువేసినవి. ఈ ద్వితీయసంగ్రామం ఆసియా, ఆఫ్రికావలసల కారణంగా ప్రారంభమైంది.

వలసలు బలపడితే తమ వశం తప్పిపోతుందేమో అనే భయం కొద్దీ సామ్రాజ్యదేశాలు ఎంతవరకూ వలసలను దుర్బలస్థితిలోనే ఉంచుతూ ఉంటవి. కాని ఈ వలసల అసహాయస్థితి, బలహీనత సామ్రాజ్యాలనాకాంక్షించే ఇతరదేశాలలో జుగుప్సకలిగిస్తవి. "వచ్చి మా దేశాలను ఆక్రమించుకోండి" అని పిలిచినట్లు ఉంటుంది. వలసల అసంతృప్తి, ఆ దేశాల్లో ప్రజ్వరిల్లే అశాంతి ఓర్వలేని దేశాల దురాక్రమణను ప్రోత్సహిస్తవి. సామ్రాజ్యాలు సహజంగా వలసదేశాల్లో అసంతృప్తి కలిగిస్తవి. ఒకరింట్లో పరాయివా డెవరో వచ్చి పెత్తనం చేయడమే వలసపద్ధతి. ఇలా పెత్తనం చేసే పరాయివాడు "సంసారం" అంతా తానే ఈదుతూ ఉన్నానని పైకి పెద్దపెద్ద కబుర్లు చెప్తూఉంటాడు. తెల్లజాతుల జాత్యహం

కారంవల్ల పాశ్చాత్యసామ్రాజ్యతత్వం ఫాసిజానికి సన్నిహితమైంది, రెండూ ఇంచుమించు అన్నదమ్ములలాగా ఉన్నవి. అసలు సామ్రాజ్యవాదం నుంచే ఫాసిజం పుట్టుకువచ్చిఉండవచ్చునుకూడా.

పరాయివాడు వచ్చి తమ ఇంట్లో పెత్తనం చేయడం, తానే సర్వాధికారి నని అనుకోవడం, దేశీయులందరికంటే తానే చాలా గొప్పవాడని భావించుకోవడం చూచి వలసదేశీయులు అతృప్తులౌతారు. ఆ అతృప్తి జాతీయాభిమానంగా రూపొందింది, చివరకు జాతీయ ఉన్మాదంగా పరిణమిస్తుంది. ఉన్మాద జాతీయతే సామ్రాజ్యతత్వం. ఇలాంటి జాతీయతత్వం తనకే ప్రమాదం తెచ్చిపెట్టగల మరో జాతీయతత్వాన్ని తయారుచేస్తుంది.

భారతదేశమే దీనికి నిదర్శనం. వీరు, వారు అనే భేదం లేక, భారతీయులు అందరికీ బ్రిటిష్ వ్యతిరేకభావం తీవ్రంగా ఉంది. 1942-వ సంవత్సరం వేసంగిలో భారతదేశంలోని బ్రిటిష్ రాజప్రతినిధి లార్డ్ లిన్లిత్గోను కలుసుకున్నాను. భారతీయుల బ్రిటిష్ ప్రతికూలవైఖరినిగురించి ఆనాడు ఆయన నాతో ఇలా అన్నాడు:

"బ్రిటనుకు భారతదేశం ఈనాడున్నంత ప్రతికూలంగా ఎన్నడూ లేదు."

లిన్లిత్గో కార్యవర్గసభ్యుడు, భారతీయుడు అయిన సర్ ఫిరోజ్ఖాన్ నూన్ కూడా దాదాపు ఇదే అభిప్రాయాన్ని ప్రకటించాడు. 1942-వ సంవత్సరం సెప్టెంబరు 13 వ తేదీన సామ్రాజ్యనగరమైన ఢిల్లీలో పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తూ "ఈనాటి భారతప్రభుత్వపుఅండను ఎంతమంది భారతీయు లున్నారని అడిగితే ఎవ్వరూ లేరనే చెప్పాలి" అని అన్నట్లు అప్పట్లో ప్రకటితమైనది.

ఇంక అనధికార భారతీయుల అభిప్రాయం ఎలా ఉందో చూడండి. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో చదువుకుంటూవున్న విద్యార్థిని ఒకర్ని కలుసుకున్నాను, అత నౌకతరహా యువకుడు. బ్రిటిష్వారిని ఇష్టంవచ్చినట్లల్లా

మహాతీవ్రంగా విమర్శించాడు. అతని విమర్శన అంతా విని నే నిలా అడిగాను; "మీరు బ్రిటిష్‌వారిని చాలా తీవ్రంగా విమర్శించారు. బాగానే ఉంది. కాని జపాను మీ దేశాన్ని జయించాలని మీరు వాంఛిస్తున్నారా?"

కొంచెం సందేహించి అత నిలా అన్నాడు: "మాదేశాన్ని జపాన్ ఆక్రమించాలని మేము ఎన్నటికీ వాంఛించం. ఇప్పుడూ అలా కోరు కోడంలేదు. జపాన్ చేతుల్లో బ్రిటన్ తింటున్న దెబ్బలకు ఆదేశం నిజంగా తగివుంది. అయినా అలాంటి దెబ్బలను తట్టుకొని నిలబడగలశక్తి, బలం బ్రిటనుకు ఉండాలనే మేము కోరుతున్నాం. అలాంటి శక్తిని బ్రిటనుకు ప్రసాదించ వలసిందనికూడా భగవంతుని ప్రార్థిస్తున్నాం."

"బ్రిటిష్‌వారంటే మీకు ఇంత మంట, ద్వేషం ఎందుకు?" అని అతన్నీ, నేను కలుసుకున్న భారతీయులను అనేకమందినీ అడిగాను. ఎవరు చెప్పినా ఒకటే సమాధానం. "భారతీయులను బ్రిటిష్‌వారు కడజాతి వారుగా చూస్తారు. చిన్నచూపుచూస్తారు. తమకంటే తక్కువవా రనే భావం వారికి బాగా ఉంది." ఇదే వారి సమాధానాల సారాంశం. తమ్ము తక్కువగా చూస్తే ఎవరు సహిస్తారు? అందులోనూ ఎక్కడ్నుంచో వచ్చి కేవలం తమ శరీరచ్ఛాయ తెల్లగావుందనే కారణాన, ఈ దేశంకంటే తమ దేశం బలంగలదనే ధైర్యంతో అధికారాన్ని చెలాయించడమేగాక, దేశీయులను తక్కువగాచూస్తే సహిస్తారా?

ఈ వర్ణసమస్య సామ్రాజ్యసమస్యలో అంతర్భాగమే. ఈయుద్ధంలో వర్ణవివక్షత ఎంతో పనిచేసింది. పెరల్‌హార్బర్ సంఘటనానంతరం జపాన్ సేనలు బహు సునాయాసంగా, కేవలం నల్లేరుమీద బండి పోయిన మాదిరి ముందుకు సాగిపోవడానికి బాగా సహాయపడింది ఆసియాలో పరివ్యాప్తమైవున్న శ్వేతజాతి విద్వేషమే.

మన నాగరికతను పూనిన వ్యాధుల అవలక్షణాలలో ఈ వర్ణ వివక్షత ఒకటి. తగిన చికిత్స చేసి ఈ వ్యాధిని కుదర్చకపోతే తృతీయ

సంగ్రామం తప్పదు. ఈ వర్ణసమస్యలోనే ఉన్నాయి సంగ్రామ బీజాలు.

రాజకీయ వ్యవహారాలను చర్చించిన భారతీయులలో దాదాపు మూడోవంతుమంది 1904-5 సంవత్సరంనాటి రష్యా-జపాన్ యుద్ధాన్ని ప్రస్తావించేవారు. ఇది చాలా పాతగాథగా కనిపిస్తుంది. కాని రంగు జాతులకు ఈ సంఘటన చాలా ముఖ్యమైందిగా ఉంటున్నది. ఒక తెల్ల జాతిని ఒక రంగుజాతి జయించడం ఇదే మొదటిదఫా. భారతీయులు అందరూ ఈ విషయాన్నే జ్ఞాపకం ఉంచుకున్నారు. భారత జాతీయోద్యమాని కిది మంచి ఊపు, ఊతం ఇచ్చింది.

భారతదేశంనుంచి అమెరికా తిరిగివస్తూ కైరోలో దిగాను. అక్కడ బ్రిటిష్ రాజ్యాంగ తంత్రజ్ఞుడ్ని ఒకడ్ని కలుసుకున్నాను. అతను చాలాకాలం పర్షియాలో పనిచేశాడు. జపాన్ రష్యాను జయించడం గురించి భారతీయులు ఏమనుకుంటున్నదీ అతనికి చెప్పాను. విన్నాడేగాని అతన్లో ఆశ్చర్యభావం ఏమీ కనిపించలేదు. ఈ విషయమై పరిషియన్లూ అలాగే అనుకుంటున్నారని అన్నాడు.

1941 డిసెంబరులో జపాన్ యుద్ధం ప్రారంభించింది. ఆరంభ దశలో యావత్తు ప్రపంచానికీ దిగ్భ్రమకలిగించే విజయాలను సాధించింది. బ్రిటన్, అమెరికా, హాలెండ్ దేశాలు మొదట్లో జపాన్ దెబ్బకు ఉక్కిరి బిక్కిరి కావడం చూసిన ఆసియాప్రజలకు జపాన్ అంటే ఒకవిధమైన గౌరవభావం కలిగింది. రంగుజాతులలో జపాన్ప్రతిష్ఠ హెచ్చింది.

ఈ యుద్ధం పూర్తికాకపూర్వమే చైనా అగ్రరాజ్యంగా తయారవుతుంది. చైనా భారతదేశాల కొత్త రాజకీయ సంబంధాలు చాలా గాఢమైనవి. భారతదేశంలో బ్రిటిష్వా రనుసరిస్తున్న విధానాన్ని మార్పు చేయించడానికీ, కొంచెం సమాధానకరంగా ఉండేటట్టు చేయడానికీ చాంగ్ కైషేక్ అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్టుతోనూ, బ్రిటిష్ప్రధాని విన్స్టన్

చర్చిల్‌తోనూ ప్రయత్నించాడు. జపాన్ ఆసియాను ఏకంచేయలేదు. కాని ఆసియా తనకు తాను ఏకం కాగలదు.

ఆసియాపై ఆధిపత్యం ఏర్పాటుచేసుకోవడానికీ, అధికారం చెలాయించడానికీ తెల్లజాతులన్నీ ఏకమై ఒకే ప్రబలవర్గంగా ఏర్పడితే, అలాంటి ప్రయత్నాన్ని ప్రతిఘటించడానికి రంగుజాతులు అన్నీ అలాగే ఐక్యమై ఒక్కటిగా నిలబడుతవి.

బ్రిటన్, హాలెండ్, ఫ్రాన్సులపక్షాన తానూ ఒక పెద్ద సామ్రాజ్యదేశంగా అమెరికా చేరితే, ప్రాచ్యదేశాలు యావత్తూ పాశ్చాత్యదేశాలను ప్రతిఘటించడానికి ఏకమౌతవి. ప్రాక్పశ్చిమాలు రెండువర్గాలుగా ఏర్పడిపోతవి. అలా జరిగే సందర్భంలో రష్యా పాశ్చాత్యదేశాలకు ప్రతిగా ప్రాగ్దేశాలతో చేరవచ్చును. భౌగోళికంగానూ, చారిత్రికంగానూ రష్యా అటు ప్రాచ్యదేశాల్లోనూ చేరుతుంది; ఇటు పాశ్చాత్యదేశాల్లోనూ చేరుతుంది. పారిశ్రామికంగా విపరీతాభివృద్ధి పొందిన పశ్చిమదేశాలకూ, కేవలం వ్యావసాయికంగానే ఉన్న ప్రాచ్యదేశాలకూ సంఘర్షణ ప్రారంభం అయితే, ఆ సంఘర్షణ తీవ్రత, ఉగ్రత ఎలా ఉంటుందో చెప్పలేము. ఆ సంగ్రామంతో పోల్స్తే ఈ ద్వితీయ ప్రపంచసంగ్రామం కేవలం చిన్న పిల్లల ఆటగా ఉండవచ్చు.

ప్రాగ్దేశాలలో అమెరికాకు అట్టే అపేక్షలులేవు. ఏవో కొద్దిగా ఉన్నా, అవి అంత గణింపతగ్గవికావు. కనుక అమెరికా స్వప్రయోజనాపేక్ష లేక, ప్రాచ్యదేశాల స్వాతంత్ర్యంకొరకూ, ఆదేశాలకు ఇతరదేశాలతో పాటు సరిసమాన అవకాశాలు లభించునట్లుచేయడానికీ కృషిచేస్తే, అఖిల మానవకోటికీ అమెరికా గొప్పసేవ చేసిన దేశం అవుతుంది. మూడవ ప్రపంచసంగ్రామాన్ని నివారించడానికి ఎవరైనా చేయవలసిన మహత్కార్యం కూడా ఇదే.

తెల్లవారు మూటా ముల్లే కట్టుకుపోవలసిన అవసరం లేదు. స్నేహ

భావంతో బంధువులలాగా ప్రాగ్దేశాలలో ఉండవచ్చు. ఎవ్వరూ కాదనరు. కాని, అలా కాక, తాము యజమానులం అని అనుకొని, ఏదో అధికారం చేయడానికి ప్రయత్నించే ప్రేమమాత్రం సంఘర్షణ తప్పదు. అది ప్రాక్పశ్చిమ సంఘర్షణగానే పరిణమిస్తుంది.

భారతదేశంలో ఉన్న బ్రిటిష్‌సేనకు సర్వసేనానిగా ఉంటున్న సర్ ఆర్చిబాల్డ్ వేవెలును—తరువాత ఆయన భారతదేశంలో బ్రిటిష్ రాజ ప్రతినిధి లార్డ్ వేవెల్ అయినాడు—చాలాపర్యాయాలు కలుసుకున్నాను. జపాన్ యుద్ధంగురించి ఒక సందర్భంలో ఆయన నాతో ఇలా అన్నాడు: "పెరల్‌హార్బర్ పరాజయానంతరం మన మానసిక దురభిమానాలనూ, రాజకీయ సంప్రదాయాలనూ విసర్జింపగలిగివుండి, ఫిలిప్పీన్సును, డచ్చి ఈస్టుఇండీసుదీవులను ఎలాంటి ప్రతిఘటనా జరుపక వదిలి, మనం మన ఆయుధ అంగబలాలను కేంద్రీకరింపవలసివుండెను. బర్మాను నిలుపుకొని ఉంటే భారతదేశంనుంచి బర్మామీదుగా చైనా చేరి జపానుపై ఆఖరుదెబ్బ తీయడానికి వీలువుండేది."

తరువాత ప్రాచ్యయుద్ధవ్యూహాన్ని చర్చించి, క్విబెక్ సమావేశంలో లార్డ్ లూయీ మౌంట్‌బాటన్‌ను భారత, సింహళములకు సర్వసేనానిగా మిత్రనాయకులు నియమించారు. ఈ నియామకం వేవెల్ పరిశీలనవే రూఢిచేసింది. లార్డ్ మౌంట్‌బాటెన్, చర్చిల్ ప్రకటించినట్లు, జపానుపై త్రిముఖదండయాత్ర సాగిస్తారు. జపాన్‌చేరడానికి భారతదేశం, బర్మా, చైనాలు మిత్రసేనలకు చక్కని మెట్లు.

జపానును జయించడానికి అనేకపద్ధతులూ, ఆక్రమించడానికి అనేక మార్గాలూ ఉండవచ్చు. కాని అన్నింటిలోకీ అంత కష్టంకాని మార్గం ఇదే.

పసిఫిక్ దీవులు అసంఖ్యాకములు. దాదాపు అన్ని దీవులూ జపాను వశమైనవి. ఈ దీవులను ఒకదాని వెంట మరొకదీవిని ఆక్రమించుకుంటూ జపానుచేరడం ఒక పద్ధతి. కాని ఎంతో ధనప్రాణనష్టాన్ని భరించవలసి వస్తుంది. దీర్ఘ యుద్ధం సాగించవలసిఉంటుంది.

ఇంక విమానయుద్ధం సాగించడానికి జపానుసమీపంలో విమానాశ్రయాలు కావాలి. రష్యా తన సైబీరియా విమానాశ్రయాలను మిత్ర విమానాల ఉపయోగానికి ఇవ్వనూవచ్చు; ఇవ్వకపోనూవచ్చు. ఒకవేళ రష్యా అలాంటి సౌకర్యం కలిగించినా కేవలం విమానయుద్ధంవల్ల జపానును జయింపగలిగితేనేతప్ప భారతదేశంనుండి చైనాకు వెళ్ళే భూమార్గం అత్యవసరంగానే ఉంటుంది. విమానయుద్ధంవల్ల జపానును జయించగలిగితే ఆపే ప్రాణనష్టం ఉండదు. రాజకీయ ఇబ్బందులూ ఏర్పడవు. పాశ్చాత్యదేశాలతోబాటు సమానహక్కులకోసరం, ప్రాబల్యంకోసరం పనిచేస్తూఉన్న, ఆందోళనచేస్తూవున్న భారత, చైనాదేశములను నిర్లక్ష్యం చేయవచ్చు. కాని అలా ఎంతోకాలం చేయడానికి వీలుండదు.

చైనా, భారత సహాయసహకారాలతోగాని, లేక ఆ రెండు దేశాలనూ లెక్కచేయకుండానేగాని ఈ యుద్ధంలో మిత్రరాజ్యాలు విజయాన్ని సాధించినా, 95 కోట్ల చైనీయులనూ, భారతీయులనూ విస్మరించడానికి వీలుగాదు. విజయోత్సాహంలో, ప్రమాదం తొలగిపోయిందిగదా అనే సంతోషంలో మనం వారి విషయం మరిచిపోదామన్నా మరిచిపోనివ్వరు.

శాంతిసమయంలోవలెనే యుద్ధకాలంలోనూ నూరుకోట్ల ఆసియా ప్రజల సహకారసహాయాలను సంపాదించడమే పాశ్చాత్యప్రభుత్వాల ప్రథమకర్తవ్యం. కాని వీరిసంబంధాలు లోగడ అంత సమరసంగానూ, సంతృప్తికరంగానూ లేవు. స్వప్రయోజనార్థం శ్వేతజాతులు ఇటు వలస వచ్చారు. ఇప్పుడు స్వలాభంకోసరం, అధికారంకోసరం పీఠంవెట్టుకు కూర్చున్నారు. ఈ యుద్ధలక్ష్యాలను ఆసియావారందరూ శంకించడానికి

ముఖ్యకారణంకూడా ఇదే. పాశ్చాత్య రాజకీయవేత్తల ప్రకటనల్లో వీరికి నమ్మకం పూర్తిగాపోయింది. అగ్రరాజ్యా లన్నింటిపైనా వీరికి అనుమానాలు ఉన్నాయి. తమపక్షాన, తమ అండను ఎవ్వరూ లేరని వీరు అభిప్రాయపడుతూవున్నారు. అగ్రరాజ్యాలచేతుల్లో తాము కేవలం కీలుబొమ్మలుగా మాత్రం ఉంటున్నామని వీరు అనుకుంటున్నారు. మిత్రరాజ్యాలు ఈయుద్ధంలో నెగ్గితే చైనా, భారతదేశాల్లోనేగాక, ఆసియాలోని ఇతర ప్రాంతాల్లోనూ పాశ్చాత్యరాజ్యాల సామ్రాజ్యాధికారం బలపడి, స్థిరపడిపోతుందని వీరి భయం.

"బ్రిటిష్‌వారు హాంగ్‌కాంగ్ ఖాళీచేసిపోతారా? చైనానుండి జపాన్ దౌర్జన్యంచేసి సంపాదించుకున్న ఫార్మోజాను తిరిగి చైనాకు ఇచ్చివేస్తారా?" అని చైనావారూ, "బర్మా, భారతదేశాలు స్వాతంత్ర్యాన్ని పొంది స్వపరిపాలితరాజ్యాలు అవుతవా?" అని ఆసియాప్రజలు యావన్మందీ-ముఖ్యంగా చైనావారూ ప్రశ్నించడానికి ఈశంకలు, అనుమానాలు, భయమే కారణం.

బర్మా, భారతదేశాలు స్వతంత్రదేశాలు కావాలని చైనావారు చాలా పట్టుదలగావున్నారు. అందుకు కారణం లేకపోలేదు. ప్రాచ్యదేశాల్లో సామ్రాజ్యశక్తులు ఎక్కడున్నా చైనా సంపూర్ణస్వాతంత్ర్యాన్ని పొందలేదు-అనుభవింపలేదు.

శాంతివిషయంలో తెల్లజాతులు రంగుజాతులను ఏవిధంగా చూస్తారో, యుద్ధకాలంలో రంగుజాతులు తెల్లజాతులను ఆవిధంగానే చూస్తారు. పాశ్చాత్యుల దృక్పథానికీ, ప్రాచ్యుల దృక్పథానికీ ఏమీ తేడా లేదు.

గాంధీమహాత్మునితో 1942 వేసవిలో ఒకవారం * గడిపాను. భారతీయులు యుద్ధకార్యాల్లో ఎక్కువఉత్సాహంగా పాల్గొనాలనీ,

---

*ఈ వారం అనుభవాలను "గాంధితో ఒకవారం" అన్నపేర రచించారు ఫిషర్‌గారు. సంస్కృతి 22 వ ప్రచురణ.

యుద్ధవిజయానికి ఎక్కువగా కృషిచేయాలనీ మహాత్మునితో అంటూ ఉండేవాణ్ణి.

ఆరోజు ఎండ మండిపోతూవుంది. సూర్యుడు సరిగ్గా నెత్తిమీదకు వచ్చాడు. అప్పుడు గాంధీజీతో మాట్లాడాలని ఆయనబసకు వెళ్ళాను.


గాంధీజీ

మహాత్ముని కుటీరం మట్టిగోడలు, తాటాకులకప్పుతో అతి మామూలుగా ఉంటుంది. ఒక చాప పరిచివుంది. లోపలికెళ్ళి గాంధీజీకి అభిముఖంగా ఆ చాపమీద ఆసీనుణ్ణై అయినాను. ఆపూట గాంధీజీ నాతో ఇలా అన్నారు: "జర్మనీ, జపాన్, ఇటలీదేశాల్లో ప్రజాస్వామికాన్ని రక్షించే నిమిత్తం భారతీయులను యుద్ధంచేయమంటున్నారు. అది ఎలా సంభవం? మాకు ప్రజాస్వామ్యం లేదు. ఇతరత్రా ప్రజాస్వామ్యరక్షణకు మేము ఎలా పోరాడుతాము? రూజ్‌వెల్ట్ అధ్యక్షుడు చతుస్స్వాతంత్ర్యాలను గురించి మాట్లాడుతూవుంటాడు. కాని ఆ నాలుగుస్వాతంత్ర్యాల్లో, స్వతంత్రంగా ఉంటానికి అవసరమైన స్వాతంత్ర్యం ఉన్నదా?" ఈ ప్రశ్నకు నేను చెప్ప గలిగిన సమాధానం ఒక్కటే. "ఈ యుద్ధం ముగిసినతరువాత ప్రపంచం ఇప్పటికంటె మెరుగ్గా ఉంటుంది."

ఈ నా సమాధానం విని మహాత్ముడు నాముఖంలోకి సూటిగా చూచి "నిజంగానా? మీకు ఆ నమ్మకం ఉన్నదా?" అని ఎదురుప్రశ్న వేశారు.

"యుద్ధానంతరం ప్రపంచం ఇంతకంటే నాణెంగా ఉంటుందని ఆశిస్తున్నాను" అనిమాత్రం జవాబుచెప్పాను.

"బ్రిటన్, అమెరికాలు ఈ యుద్ధం ముగిసినతరువాత ఇంతకంటే మెరుగైన ప్రపంచాన్ని నిర్మించగలవని విశ్వసించడానికి వారిహృదయాల్లో కొంత పరివర్తన ఈనాడే నాకు గోచరించాలి" అని మహాత్మాజీ అన్నారు.

ఇతరదేశాల్లోని లక్షలప్రజలూ, యావత్తు ఆసియా అడుగుతూవున్న ప్రశ్ననే గాంధీజీ అడిగారు: "విజయానంతరం ఏమిటి?"

ఈవిధంగా సామ్రాజ్యసమస్య యుద్ధానంతరసమస్యను రేకెత్తిస్తున్నది. ఆసియా, యూరపుఖండాలు రెండూ ఒక ప్రధాన విషయాన్ని గుర్తించాయి. గతంలో మంచిదీ, ప్రయోజనకరమైనదికాందీ వర్తమాన భవిష్యాలకూ మంచిదికాదు: కాజాలదు, యూరపు, ఆసియాసంబంధాల గతచరిత్ర చాలా అసంతృప్తికరంగా ఉంది. రక్తసిక్తమై వికృతంగానూ, ఎవ్వరికీ గౌరవప్రదంకానిదిగానూ ఉంది. గత మూడుదశాబ్దాల చరిత్రను ఉన్నదివున్నట్టుగా చిత్రించి, అదేకాలంలో రెండు ప్రపంచ సంగ్రామాలు-మహాదారుణమైనవి సంభవించినవనీ, ప్రజలు పడరానిపాట్లు పడినారనీ, అనేక ఈతిబాధలను అనుభవించారనీ చెప్తే, మొత్తం మానవకోటిఅంతా అదే దుస్థితిలో ఉన్నట్లు స్పష్టమౌతుంది.

ఈ యుద్ధం ముగిసినతరువాత కూడా వెనుకటి వ్యవస్థనే తిరిగి ఏర్పాటుచేస్తామని ఐక్యజాతుల నాయకులు ప్రకటిస్తే వారి ప్రకటనలు ఆసియా, యూరపుప్రజలందరికీ ఆశాభంగాన్నే కలిగిస్తవి. భూతకాలపు పద్ధతులను విసర్జించి, పూర్తిగా భిన్నపద్ధతులను అనుసరిస్తేగాని, శాంతి కాలంలో ఇప్పటికంటే మేలైన భవిష్యత్తును నిర్మింపలేము. అసలు కీలకం ఇదే.

వెనుకటి వ్యవస్థ అంత తేలిగ్గా మారదు. పాతవ్యవస్థే కొందరికి ప్రయోజనకరంగా ఉంటుంది. అలాంటివారు ఆ వ్యవస్థ మార్పుచెందకుండా

చూస్తున్నారు. వీరికి రానున్న కాలం ఎలాంటిదో తెలియదు. అనుభవం లేదు. కనుక భవిష్యత్తు వీరికి భయంకరంగా కనిపిస్తుంది. కాని అదృష్ట వశాత్తూ వీరిసంఖ్య చాలా స్వల్పమే.

యథాస్థాయిని, పూర్వపు వ్యవస్థనూ పదిలంగా కాపాడాలనేవారితో జరిపే పోరాటమే శాంతిస్థాపనకు సాగే పోరాటం.

కొన్ని ప్రత్యేక ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులవల్ల 1914వ సంవత్సరంలో ప్రథమ ప్రపంచసంగ్రామం ప్రారంభం అయింది. 1918లో ఆయుద్ధం ముగిసింది. కాని అసలు పరిస్థితుల్లో ఆశే మార్పు జరుగలేదు. అంచేతనే 1939 వ సంవత్సరంలో రెండవ ప్రపంచసంగ్రామం ప్రారంభమైంది. ఈ యుద్ధానంతరంకూడా ఆ పరిస్థితులు మారకపోతే, అవే పరిస్థితులు తృతీయసంగ్రామానికి దారితీస్తవి.

హిట్లర్, ముస్సోలినీ, ఫ్రాంకో, జపాన్ సైనికనాయకులూ వెనుకముందులుచూచే ఈ యుద్ధాన్ని సాగించారు. వాస్తవానికి సంగ్రామాన్ని సాగించినవారు వారే అయినా, వారిని తయారుచేసింది మిగతా ప్రపంచమే.

హిట్లర్ ఉన్మాది, మూర్ఖుడు కావచ్చును. కాని అతనూ మననాగరికతనుంచే వచ్చాడు. మనమే అతన్ని అలా తయారుచేశాం. అసలు విషయం ఏమంటే మనం ఇలా ఉన్నాంకనుకనే హిట్లర్ అలా తయారైనాడు.

జర్మనీలో హిట్లర్ కొన్నితెగలను నామరూపాలు లేకుండా చేయ సంకల్పించాడు. హిట్లర్ అత్యాచారాలకు గురిఅయినవారికి మనం సహాయంచేయలేదు. ఇక అతను దురాక్రమణ సాగించాడు. దురాక్రమణపాలైన దేశాలను మనం ఆదుకోలేదు. వారిని నట్టేటవదిలాం. ఫాసిస్టు నియంతలను తృప్తిపరచడమే అప్పటి మన విధానం. హిట్లర్ ఆరోజుల్లో తయారైనాడు.

1914 వ సంవత్సరంలో ప్రారంభమైన యుద్ధంలో కెయిజరును జయించాం, తరువాత హిట్లరును తీసుకువచ్చాం. ఇవాళ హిట్లరును ఓడిస్తాం. రేపు ఇంతకంటే మూర్ఖుణ్ణి ఎవర్నో తీసుకురాగలం. ఇలాంటి దుస్సంఘటనల నివారణకు ఒక్కటే మార్గం.

హిట్లరులు, ముసోలినీలు, సైనికప్రముఖులూ పుట్టుకురావడానికి అనుకూలంకానట్టి పరిస్థితులను కలిగించాలి. యుద్ధోన్మాదులు ఉద్భవింప వీలుగానివిధంగా సాంఘికవ్యవస్థను పునర్నిర్మించాలి, హిట్లరులు జర్మనీ లోనూ, ముసోలినీలు ఇటలీలోనే అవతారం తాల్చరు. ఏదేశంలో అయినా వారూ, వారి ఫాసిజం తలెత్తవచ్చు. కనుక మనం ఈనాడు సాగించే యుద్ధం పరాయిదేశాల్లోవున్న హిట్లర్లమీదా, పరాయిదేశాల ఫాసిజంమీదనే కాదు, ప్రజాస్వామ్యాల మధ్య వుండి, యుద్ధాలు సాగించ డానికి సహాయంచేసేవారందరిపైనా చేసే యుద్ధం ఇది.

సామ్రాజ్యతత్వం, వర్ణవివక్షత, వ్యాపారనిబంధనలు, ఆర్థికశక్తులు, కార్మికసంఘ ద్వేషం, అదికసంఖ్యాకుల పౌర, రాజకీయహక్కు లంటే అల్పసంఖ్యాకవర్గాలకు గల భయం, దురాక్రమణకు దారితీసే జాత్యహం కారం మొదలైనవాటినుండే జర్మనీ, జపాన్, ఇటలీ, స్పెయిన్ మొదలైన దేశాల్లో తలెత్తిన ఫాసిజం ఉత్పన్నమైంది. ఫాసిస్టేతరదేశాలు వీటికి గురికాకుండా ఉండలేదు. ఆదేశాల్లోనూ ఇవేన్నీ కనిపిస్తున్నవి. వీటి పుట్టుకా, అభివృద్ధీ ఏఒక్క జాతికిగాని, ఏఒక్క దశాబ్దానికిగాని, ఏఒక్క ఖండానికిగాని సంబంధించివుండలేదు. ఈరోజున ఫాసిస్టు, మిలిటరిస్టు జాతులను ప్రతిఘటిస్తున్న జాతుల దేశాలనుసైతం పీడించగల వ్యాధి ఫాసిజం. కాని మనం వేటిని నిర్మూలనంచేయాలని పోరాడుతూఉన్నామో వాటికే మనం ఆహుతి అయిపోతే అంతకంటే శోచనీయమైనది, విపరీత మైనది వేరొకటి ఉండదు.

కనుక, స్వాతంత్ర్యాన్ని రక్షిస్తున్నామనేవారు ఇతరుల కాస్వాతం

త్ర్యం లేకుండాచేయరాదు. హిట్లరును ప్రతిఘటించేవారు జాతివిద్వేష కార్యాలనూ, శ్వేతసామ్రాజ్య విధానాలనూ సాగింపరాదు.

ప్రజాస్వామ్యం అంటే—అందరికీ సమానఅవకాశాలు, కావాలన్న వారికీ పేదలకూ ఉచితవిద్య, సాంఘికభద్రత. విరుద్యోగ నిర్మూలనము, సర్వజనీన వోటుహక్కు, అంతర్జాతీయ భద్రతానంఘంలో సభ్యత్వం కావచ్చును.

ప్రజాస్వామికం ప్రాణార్పణానికికూడా తగివుంటే, అది ఆచరణలో పెట్టడానికి యోగ్యమైనదికూడా అవుతుంది. మనం ఈ ప్రాథమికసూత్రాల కోసరం, సిద్ధాంతాలకోసరమే పోరాడుతూవున్నాం. ఇవే మనలను శాంతి మార్గాన తీసుకుపోగలవు.

1918 వ సంవత్సరంలో అమెరికా అధ్యక్షుడు వుడ్రో విల్సన్ అమెరికా యుద్ధలక్ష్యాలు అంటూ చతుర్దశాంశములను ప్రకటించాడు. అవి ప్రధానంగా భౌగోళిక రాజకీయ విషయకములు. అవి ఆల్ సెస్ లోరేన్ను తిరిగి ఫ్రాన్సుకు ఇచ్చివేయడం, స్వతంత్ర పోలెండును స్థాపించడానికి సంబంధించినవి. ఇంక స్వయంనిర్ణయ, స్వపరిపాలన సూత్రాలు అన్యుల ఆచరణకు ఉద్దేశింపబడినవి. ఈ విల్సన్ చతుర్దశాంశాలూ ఇతరులకు కార్యప్రణాళిక అయినవి.

నేడు మన యుద్ధలక్ష్యాలు చతుస్స్వాతంత్ర్యాలు. ఆరాధన స్వాతంత్ర్యం; వాక్స్వాతంత్ర్యం; లేమి,భయంనుండి విముక్తి. లేమినుండివిముక్తి అంటే సుఖజీవనం, సాంఘికభద్రత. భయవిముక్తి అంటే శాంతి, ఇతరులకు మాత్రం ఉద్దేశించిన కార్యక్రమం కాదు. మనం అందరంకూడా ఈ నాలుగు స్వాతంత్ర్యాల ప్రయోజనాన్ని కాంక్షిస్తూవున్నాం. దేశాలసరిహద్దులను తిరిగి ఏర్పాటుచేయడానికే జరుగుతూవున్న యుద్ధంకాదిది. ఒక దేశాన్ని పైకితెచ్చి మరొకదేశాన్ని కూలదోసి, ఒక దేశానికిచెందినకొంత భూభాగాన్ని మరోదేశంలో చేర్చడంవల్ల శాంతిని స్థాపించలేము. వైదేశిక

భూగోళానికి సంబంధించి ఎల్లల మార్పు నిమిత్తం ఈయుద్ధం జరగడం లేదు. మన వాంఛితార్థాలను సాధించుకునే నిమిత్తం చేస్తున్నాం. ఇది సాంఘికప్రాధాన్యంగల సంగ్రామం. ప్రపంచ పునర్నిర్మాణానికి సాగుతూ వున్న యుద్ధం.

ఒక ప్రత్యేక విశిష్ట దృక్పథంతో పరిశీలించి శాంతిపరిష్కారం చేయాలి. ఆర్థికసంస్కారం, ఆధ్యాత్మిక పునరుజ్జీవనం, రాజకీయమార్పు, అంతర్జాతీయసంస్థా నిర్మాణం, ప్రజలు యావన్మందీ తిరిగి వివేకవంతులూ విద్యావేత్తలూ కావడం—ఇత్యాది శాంతిపరిష్కారం సాధించవలసిన ప్రధాన ఫలితాలు. శాంతిపరిష్కారం ఈ ఫలితాలను సాధింపలేకపోతే శాంతిపరిష్కారమే విఫలమైపోతుంది.

అసలు ప్రస్తుతావసరం ఏమిటి? నేటి ప్రపంచానికి భిన్నమైన, ఇంత కంటే మేలైన నూతన ప్రపంచం.

స్తవనీయమైన కోరిక. బహుగొప్ప లక్ష్యమే. ఆవిషయంలో సందేహానికి ఆస్కారంలేదు. ఈలక్ష్యం సిద్ధించకపోతే, ఈకోరికలు ఈడేరకపోతే మరోయుద్ధం తప్పదు.

యుద్ధంలో విజయంపొందడానికి ఎంతటి త్యాగం చేయడానికైనా దేశాలు సిద్ధంగా ఉన్నాయి. సంకోచం లేక ఎంతరక్తాన్నయినా ధారపోస్తవి. నిండు యవ్వనంతోవున్న యువకులను సహస్రమానంగా రణరంగానికి పంపుతారు, వీరిలో ఎందరెందరో కానిదేశాలకు పోయి ప్రాణాలను బలియిస్తున్నారు. ప్రాణాలతో బ్రతికివచ్చినవారెందరో వికలాంగులుగా ఉన్నారు. కబోదులు, కుంటివారు, ఏపనికీ కొరగానివారుగా ఉన్నవారు అసంఖ్యాకం.

యుద్ధకాలంలో మనంచేసే త్యాగం ఇది. ఇంక మనం చేసే డబ్బు ఖర్చుకు లెక్కే లేదు. మంచినీళ్లప్రాయంగా వాడుతాం. ఇంటివద్దనేవుండి అహర్నిశలూ, విధీ విరామం ఎరుగక తమ అవసరాలకంటే దేశావసరాలే

ముఖ్యం అని భావించి, పనిచేస్తూవున్నారు. విజయసాధనకు మనంచేస్తున్న అపారత్యాగంలో చేరిందే ఇది. ఈవిధంగా కష్టపడడానికి, త్యాగంచేయ డానికి ఎన్నో దేశాలు సిద్ధంగా ఉన్నాయి.

యుద్ధంకొరకు ఇంతటి మహత్తర త్యాగం చేయడానికి తయారుగా ఉన్న దేశాలను, శాంతినిర్మాణంకొరకు, ఈత్యాగంలో వెయ్యోవంతు త్యాగాన్నైనా చేయమనికోరితే "అది చాలా పెద్దపని" అనీ, "చాలా చిక్కులతో కూడుకున్న"దనీ అంటారు. ఈ మనఃప్రవృత్తి ఎంత చిత్రంగా ఉంటుందో చూడండి! యుద్ధాన్ని గెలవడానికి కోటానుకోట్ల రూకలను, లక్షలాదిప్రజలను అర్పించగలం. కాని అలాంటి యుద్ధాలను, అంతకంటే భీకరంగా ఉండగల యుద్ధాలను నివారించడానికి రవ్వంత త్యాగం చేయ డానికైనా మనం సిద్ధంగాలేము!

శాంతిస్థాపనా సమస్యలు క్లిష్టమైనవనీ, అనేక చిక్కులతో కూడు కొని ఉన్నవనీ అనుకోవడంవల్ల తృతీయ ప్రపంచ సంగ్రామం మనకు చేరువలోకి వస్తున్నది. ఆ అభిప్రాయమే మరో సంగ్రామానికి దగ్గిరదారి.

ప్రపంచవలస లన్నింటిలోకీ పెద్ద వలస భారతదేశం. భారతసమస్య అతి జటిలమైనదనీ, సులభపరిష్కారానికి సాధ్యంకానిదనీ వింటున్నాం. వలసవిధానాన్ని రద్దుచేయడంకూడా చాలా కష్టమైందని వింటున్నాం. కాని యుద్ధంవల్ల పూర్తిగా శిథిలమైపోయిన యూరపు ఆర్థిక, రాజకీయ పున ర్నిర్మాణంకంటే కష్టమైందిమాత్రం కాదు. నిజాని కీసమస్య దేనికంటేనూ చిక్కులమారిది కాదు.

ప్రపంచ వ్యాపారసమస్యలకంటేగాని, ఈనాడు మిత్రరాజ్యాలుగా ఉన్నా ఇకమీదట ఈ దేశాలమధ్య ఏర్పడగల వాణిజ్యపోటీల సమస్య కంటేగాని జటిలమైంది కానేకాదు.

రష్యాకూ, ఇతరప్రపంచానికీ ఉండవలసిన సంబంధాలు అనేక

ఇబ్బందులతో కూడినవే అయినా అంతకంటే తేలికైనదే ఈ సమస్యా పరిష్కారం.

ఈసమస్యల క్లిష్టత కేవలం మన సంకల్పశుద్ధి, మనోధైర్యాలను బట్టి ఉంటుంది. శాంతిసమస్యల పరిష్కారానికి సాహసోపేతంగా ప్రయత్నంచేయకపోతే అసలు శాంతిఅనేదే ఉండదు.

ఈదఫా శాంతి కిందటిమాదిరిగా ఏ వర్సేల్స్‌లోనో అమాంతంగా అవతారం తాల్చదు. శాంతినిర్మాణం అప్పుడే సాగుతూవుంది. యుద్ధం పూర్తికానవసరం లేకనే శాంతిస్థాపన అనుదినం జరుగుతూవుంది. రష్యా-పోలెండ్ సరిహద్దు వివాదం, ఫ్రాన్స్‌విషయంలో బ్రిటన్ అమెరికాలు అనుసరించుతూవున్న వివేకరహిత విధానం, ముసోలినీ అనంతరం ఇటలీ వ్యవహారంలో బ్రిటన్ అమెరికాల ఆలోచనా దూరదృష్టి శూన్యమైన పంథా, చైనావిషయంలో అలక్ష్యం, భారతదేశంవిషయంలో ప్రతీకారచర్యలు, జాతీయనాయకుల నిర్బంధం ఇత్యాదికార్యాలూ, విధానాలూ రానున్న శాంతి స్వరూపాన్ని దిద్దుతూవున్నవి. రాగల శాంతి, శాంతిపరిష్కారాలపై ఆశలు పెట్టుకోడానికి ఇంతలో ఆధారాలేమీ కన్పించడంలేదు. భారత సమస్యా పరిష్కారంవిషయంలో పాశ్చాత్యదేశాలు ప్రదర్శిస్తూవున్న అసమర్థత శాంతికి సంబంధించిన ప్రధాన సమస్యాపరిష్కారంలో ప్రదర్శించే భావ శూన్యతకూ, అధైర్యానికీ చెందినదే.

శాంతి ప్రతిరోజూ నిర్మాణంకావడమే కాదు. మనం యుద్ధంలో విజయాన్ని పొందుతూ శాంతిని కోల్పోతున్నాం. కనుకనే సంగ్రామ విజయాలవల్ల కలిగే సంతోషం శాంతిస్థాపనలో పొందే పరాజయాలవల్ల కలిగే విచారంతో కలిసిపోతూవుంది. యుద్ధాన్ని గెలుస్తున్నాం అనే సంతోషం లేకుండాపోతూవుంది.

"యుద్ధం సాగనివ్వండి. శాంతిప్రస్తావన ఎందుకు? ఎందుకీ ప్రసం-

గాలు?" అనేవారు కొందరున్నారు. వీరికొక్కటే సమాధానం. రాజకీయాలను కాలగహ్వరాలలో బంధించి కట్టుదిట్టం చేయలేం.

1939 వ సంవత్సరం సెప్టెంబరు 1 వ తేదీన హిట్లర్ పోలెండుపై తన సేనావాహినులను నడిపించినా ఈయుద్ధం ఆనాడు ప్రారంభంకాలేదు. 1931 వ సంవత్సరంలో జపాన్ అసలు అంకురార్పణ చేసింది. మంచూరియాపై దండెత్తింది. అలాగే 1935 లో ముసోలినీ అబిసీనియాపై దండెత్తాడు. 1936 లో హిట్లర్ ముసోలినీలు స్పెయిను గృహావ్యవహారాల్లో జోక్యం కలిగించుకొని అంతర్యుద్ధాన్ని ప్రోత్సహించారు. ఇవి జరుగుతూవున్నప్పుడే అసలు ఈయుద్ధం ప్రారంభమైంది. ప్రపంచం శాంతి అనుభవిస్తూవుండగానే అసలు యుద్ధం ప్రారంభం అయిందనే సంగతి చాలామందికి తెలియదు. ఆ అజ్ఞానంలో పడిపోయే చాలామంది "మనం ఈ సంగ్రామంలో చిక్కుకోకుండా ఒడ్డున ఉండగలం" అని అనుకున్నారు. యుద్ధం ప్రారంభమై ప్రజ్వరిల్లుతోందని తెలుసుకోలేక తాము శాంతి అనుభవిస్తున్నామని భ్రమించారు. అది ఆఖరికి ఆత్మవంచనే అయింది.

యుద్ధానంతం శాంతి అగుతుందని చాలామంది విశ్వసిస్తున్నారు. మన మిత్రదేశాలతో యుద్ధకాలంలో చేసుకున్నఏర్పాట్లే, యుద్ధం జరుగుతూ ఉండగా శత్రురాజ్యాల భవిష్యత్తునుగురించి మనం చేసిన నిర్ణయాలే శాంతి పరిష్కారాలని హఠాత్తుగా తెలుసుకోవచ్చు మనం. శాంతి ఒడంబడికల రచన యుద్ధానంతరంగాని, అసలు శాంతినిర్మాణం ఇప్పుడే—యుద్ధం సాగుతూవుండగానే పూర్తి అవుతుంది. ఇప్పటికే ఇంచుమించు పూర్తి అయింది.

పెరల్ హార్బర్ దుస్సంఘటనను నివారించడానికి మనం మంచూరియా, అబిసీనియా, స్పెయిన్, చకస్లవేకియాల విషయం శ్రద్ధవహించి ఉండవలసింది. అలాగే తృతీయసంగ్రామాన్ని నివారించడానికి మనం

భారతదేశం, ఇతరవలసలు, చైనా, ఇతర ప్రపంచానికీ సంబంధించిన సమస్యల విషయమై శ్రద్ధవహించాలి.

శాంతి అవిభాజ్యం. చైనాకు తృప్తినివ్వగల, భారతదేశాన్ని ఆనంద పెట్టగల చర్యలు సంగ్రామవిజయాన్ని మన దాపుకు తీసుకురాగలవు. సంగ్రామానంతరం శాంతి సుస్థిరంగా ఉండేటట్లు చేయగలవు.

భారతదేశములో అక్షరాస్యులు 1921 సంవత్సరంలో బ్రిటిష్ అధికారులు తయారుచేసిన లెక్కలప్రకారమే నూటికి ఏడుగురుకంటే ఎక్కువ లేరు, తరువాత పదిసంవత్సరాలకు మళ్ళీ లెక్కలుచూస్తే నూటికి ఎనమండుగురు అక్షరాస్యులు ఉన్నట్లు తేలింది, పదేళ్లల్లో అక్షరాస్యులసంఖ్య అత్యద్భుతంగా నూటికి ఒకరువంతున పెరిగింది. తిరిగి 1941 వ సంవత్సరంలో జనాభాలెక్కలను తయారుచేశారు. ఇందుకు సంబంధించిన సెన్సస్ కమీషనర్ - ఇతడు బ్రిటిష్‌వాడే - నాతో ఇలా అన్నాడు: "1941 జనాభా లెక్కల్లో అక్షరాస్యుల అంకెలు సరియైనవి కావని తోసివేశాం. చాలామంది వోటుహక్కు లభిస్తుందనే ఆశవల్ల అబద్ధంచెప్పారు."

ఇత నిలా చెప్పిన కొంతకాలానికి లండన్‌లోని ఇండియా కార్యాలయంవారు ఒక ప్రకటన చేశారు. "1931 కీ 1941 కీ అక్షరాస్యతా నిర్ణయప్రమాణంలోనే కొంత వ్యత్యాసం ఉంది. ఆరోజుల్లో చదువనూ, వ్రాయనూ వచ్చినవార్నే అక్షరాస్యులుగా గణించారు, కాని 1941 లో మాత్రం వ్రాయడం రాకపోయినా చదవడంవస్తే వార్నందర్నీ అక్షరాస్యులుగానే లెక్కించారు." ఇండియాకార్యాలయ ప్రకటనసారాంశం ఇదే. ఈప్రకారంగా 1941 వ సంవత్సరంతో అంతమైనదశాబ్దంలో అక్షరాజ్యాల సంఖ్య నూటికి డెబ్బయివంతున పెరిగిందనికూడా ఈప్రకటన సూచించింది. సెన్సస్‌కమీషనర్ అన్నమాటలుగాక ఇండియాకార్యాలయంవారు తెలిపిన విషయాలే సరియైనవనుకుందాం. అప్పటికీ భారతీయులలో ప్రతివెయ్యి మందికీ 136 మంది మాత్రమే అక్షరాస్యులు. అక్షరాస్యత ఇంత తక్కు-

వగా ఉండటానికి విద్యావిధానం అనేకచిక్కులతో కూడివుండటమే కారణమని బ్రిటిష్‌వారు అంటారు.

రష్యాలో జార్ ప్రభుత్వాధికారులూ తమ ప్రజలవిషయమై ఇలాగే అంటూవుండేవారు. 1917 వ సంవత్సరంలో రష్యాలో అక్షరజ్ఞానం గలవారు నూటికి ఇరవైఏడుగురుకంటే ఎక్కువ లేరు. రవాణాసౌకర్యాలు లేక, అత్యల్ప ఆదాయంతో గర్భదరిద్రులుగావుంటున్న కార్మిక కర్షకులకు చదువు నేర్పడం చాలా చిక్కులతో కూడుకున్నదని జార్ ప్రభుత్వోద్యోగులు సాకులు చెప్తూవుండేవారు. ఈలక్షలప్రజ, ఆర్థికంగా అధోగతిలో ఉన్న జనం విద్యాసంస్కృతులు పొంది, విజృంభిస్తే తమ భవిష్యత్తు ఏమో అని రష్యన్‌చక్రవర్తికూడా భయపడి వుండవచ్చు.

రష్యాలో సోవియట్‌ప్రభుత్వం ఏర్పడినతరువాత, ఇరవైమూడు సంవత్సరాల్లో అక్షరాస్యుల సంఖ్య నూటికి 27 నుంచి 90 వరకూ పెరిగింది. నిరక్షరాస్యతా నిర్మూలనం అంత చిక్కులతో కూడుకున్న కార్యక్రమంగా సోవియట్‌ప్రభుత్వం భావించివుండలేదు. దేశీయుల సాంస్కృతిక ప్రమాణాన్ని వృద్ధిచేయాలన్నది బోల్షివిక్ విప్లవ లక్ష్యాలలో ముఖ్యమైంది. సోవియట్‌ప్రభుత్వ లక్ష్యంకూడా అదే.

భారతదేశంలో ఎన్నిజాతులు, ఎన్ని మతాలవారు వున్నారో రష్యాలోనూ అన్నిజాతులూ, అన్నిమతాలవారూ ఉన్నారు. జార్ పాలించుతూ ఉన్నన్ని రోజులూ వీరు ఒకరితో ఒకరు కలహిస్తూవుండేవారు. యూదుల, పోలిష్‌ప్రజల, జియార్జియాప్రజల, ఇతర అల్పసంఖ్యాక తెగల హింసకు పేరుపొందింది జార్‌కాలపు రష్యా. ఒకజాతి పొరుగుజాతితో పోరాడుతూ ఉండేది. 1917 వ సంవత్సరంలో బోల్షివిక్కులు అధికారంలోకి రాగానే వెనుకటి అధికారపత్రాలను శోధించడం ప్రారంభించారు. ఆ పరిశోధన ఫలితంగా ఈ విషయాలు తెలియవచ్చినవి. జార్ అధికారులు ఈ సంవత్సరం ఆర్మీనియన్లను హతమార్చడానికి టార్టారులకు ఆయుధాలు సప్లయి

చేసేవారు. వచ్చేసంవత్సరం టార్టారుల సంహారానికి ఆర్మీనియన్లకు ఆయుధాలు సప్లయిచేసేవారు. వీరు ఎందుకు ఇలా చేస్తూవుండేవారు అని ప్రశ్నిస్తే దానికి ఒకటే సమాధానం కనిపిస్తుంది. ఆర్మీనియన్లూ టార్టార్లూ, పోలిష్‌వారూ రష్యన్‌లూ, యుక్రేనియన్లూ యూదులూ తమలో తాము కలహించుకుంటూ ఒకర్నొకరు ద్వేషించుకుంటూవుంటే, అందర్నీ సమానంగా హింసించుతూవున్న జార్ సంగతి మరిచిపోతారు అని జార్ ప్రభుత్వ నమ్మకం. కాని సోవియట్ ప్రభుత్వం అన్నిజాతులకూ, అన్ని తెగలకూ పరిమిత రాజకీయ సాంస్కృతిక స్వాతంత్ర్యాన్ని ఇచ్చి, వారిలో ఆత్మగౌరవాన్ని కలిగించి పూర్వపు శత్రుత్వాలను పోగొట్టి స్వశక్తిలో విశ్వాసాన్నీ, వారి భవిష్యత్తులో ఆశనూ కల్పించింది. ఇలా వివిధజాతులను సంఘటితపరచి, వారికి ఆత్మవిశ్వాసం, ఆత్మ అభిమానగౌరవాలూ కలిగించినందువల్ల సోవియట్ రష్యా బలీయమైనదేశంగా తయారైంది.

భారత దేశంలోని వివిధజాతుల, వివిధమతాలవారి మధ్య వున్న విభేదాలను తొలగించి ఐక్యంచేయడానికి బ్రిటిష్‌వారు ఎలాంటి ప్రయత్నమూ చేయలేదని బ్రిటిష్‌సామ్రాజ్యచరిత్ర ప్రకటిస్తూవుంది. అంతేకాదు: బ్రిటిష్ పాలకుల శాసనాలు, బ్రిటిష్ అధికారుల చర్యలు దేశాన్ని విభజించడానికే ఉపయోగపడినవి. విభజనే వారి విధానం అనికూడా ఇందువల్ల స్పష్టమౌతున్నది. అలాంటి పరిస్థితుల్లో ఐక్యతాసాధన చాలా చిక్కులమారి పనే. పరిపాలనాధికారం పరాయివారిపరంగా ఉన్నంతకాలమూ ఐక్యతాసాధన అసలు సాధ్యమే కాకపోవచ్చు. సామ్రాజ్యప్రభుత్వం వలసదేశాన్ని ఒక పద్ధతిగాని, హద్దూ అపూగాని లేక విభజించి వేయవచ్చును. దేశమును బానిసత్వంలో ఉంచడానికి ఈవిభాజితస్థితి ఒక సాకుకూడా కావచ్చు.

భారత దేశ విస్తీర్ణంగురించి అనేకమంది అనేకవిధాల వ్రాశారు. ఆదేశంలో గాంధీజీ ప్రాపకంగురించి విలేఖరులు ఏమైనా వ్రాయవచ్చు, 1943 ఆగస్టు 8 వ తేదీన న్యూయార్క్ టైమ్స్ పత్రిక విలేఖరి హెర్బర్ట్

మాథ్యూస్ భారతదేశంగురించి ఇలా వ్రాశాడు: "గాంధీ తిరగనటువంటి ప్రాంతాలు భారతదేశంలో ఎన్నోవున్నవి. అనేకమందికి ఆయనపేరే తెలియదు." ఇతరవిలేఖరులూ ఇంచుమించు ఇదే ధోరణిలో వ్రాశారు. ఇది యథార్థమే కావచ్చును. కాని భారతదేశం స్వపరిపాలనకు పక్వమై వుందనే, స్వాతంత్ర్యానికి అర్హమైవున్నదనే విషయమై స్థూలంగా అభిప్రాయం తెలపడానికి ఈ కథనం యథార్థమే అయినా అడ్డురానవసరం లేదు. రష్యాలో సోవియట్ప్రభుత్వం ఏర్పడేనాటికి లెనిన్ పేరు ఎందరికి తెలుసు? ఆయనపేరు విన్నవారు ఎందరున్నారు? బహుశః నూటికి ఒక్కడికి కూడా తెలిసివుండదు. 1940 వ సంవత్సరంలో అమెరికా అధ్యక్షతకు పోటీచేస్తే వెండల్విల్కీకి 2,20,00,000 (2 కోట్ల 20 లక్ష) ల వోట్లు వచ్చాయి. అతనికి వోటుఇవ్వడానికి ఒకసంవత్సరం పూర్వం విల్కీ పేరు వీరిలో ఒక పదిలక్షలమందికైనా తెలుసునో తెలియదో చెప్పలేము. నాయకులకు అనుచరులు, నాయకులు జీవించివున్నారనేసంగతి వారికి తెలియకపూర్వమే ఏర్పడతారు. అనుచరుల ప్రార్థనలను నాయకుడు ఆలకిస్తాడు. వారి కోర్కెలను అతడు తీరుస్తాడు.

ఉత్తమశిల్పంవలెనే పురుషోత్తములుకూడా ఒకే ముడివస్తువునుండి తయారవుతారు. వారందరూ ఏకమార్గ జీవనమునే జీవిస్తారు. అందరి పంథాలూ ఒక్కటే. అందరి జీవితాలూ ఒకేదారిని అనుసరిస్తుంటవి. అబ్రహాం లిన్కన్ చాలా గొప్పవాడు. అతడు అమెరికా సమితికొరకు, అమెరికా ఐక్యతకొరకు కృషిచేశాడు. ఆలక్ష్యాన్ని సాధించడానికి అతడు జీవించాడు. లెనిన్ మహానుభావుడు. రష్యాను భూస్వామ్యపద్ధతి అన్న బురదగుంటలోనుంచి పైకి తీసుకురావడానికి తన జీవితాన్ని ధారపోశాడు. బ్రిటనును అగ్రరాజ్యంగా, మహత్తరదేశంగా చేయాలనే ఏకలక్ష్యంతోటే ఏపనైనా చేసేవాడు కనుక విన్స్టన్ చర్చిల్ కూడా గొప్పవాడే.

అదేవిధంగా గాంధీజీకూడా పురుషోత్తముడే. ఆయన ఏపని చేసినా,

ఏసంగతి ఆలోచించినా తన జీవితలక్ష్యం అయిన భారత స్వాతంత్ర్యమును సాధించడానికే. మహాత్ముడు అఖిలభారతావనికి ప్రతినిధికాడు. చాలామంది భారతీయులు ఆయనభావాలను తిరస్కరించారు. స్వతంత్ర భారతదేశాన్ని పాలించగలవాడు గాంధీజీ కాడు. ఆపని ఇతరులనిమిత్తం అలాగే ఉండి పోతుంది. మహాత్ముడు ప్రధానామాత్యుడు కాడు. పరిపాలనాదక్షుడూకాడు. భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందినరోజున ఆయనజీవితం పరమావధిని పొందినట్లే. నాటితో ఆయనజీవితకార్యం ముగిసినట్లే.

లక్షలాది ప్రజలను ఆకర్షించి, వారి హృదయాలను జయించి, తదేకధ్యానంలో ఉంచగల శక్తి చర్చిల్ ప్రసంగాలకు ఎక్కుఉన్నంచి వచ్చింది? మామూలు బ్రిటిష్‌పౌరుడు, ప్రతిరోజూ తనలో తాను అనుకునే భావాలనే, ఇరుగుపొరుగువారికి చెప్పే మాటలనే చర్చిల్ అతి చమత్కారంగా, ప్రతిభావంతంగా చెప్తాడు. ఆయన ప్రసంగాల్ని వింటున్న బ్రిటిష్ వారు తమ భావాల, తమ మాటల ప్రతిధ్వనినే వింటున్నాం అనుకుంటారు. కనుకనే ప్రజకు ఆయనప్రసంగాల్ని వినాలనిపిస్తుంది. ఆయన చెప్పిన ప్రకారం చేయాలనిపిస్తుంది.

మహానుభావులందరూ వారి అనుయాయుల ఉత్తమమూర్తులే. వారు వారి అనుచరుల మనోభావాలను ప్రతిధ్వనింపజేస్తారు. కనుకనే ప్రజలు నాయకుల ప్రకటనలను, ప్రసంగాలను హర్షిస్తారు; ఆమోదిస్తారు.

గాంధీమహాత్ముడుకూడా అంతే. ఆయనవాక్కు భారతవాణి. ఆయన యావత్తు భారతదేశం తరపునా మాట్లాడుతారు. ఆయనమాటలు వినివుండని భారతీయులతరపునకూడా ఆయన మాట్లాడుతారు. దీని సూక్ష్మం ఒక్కటే భారతదేశం తిరిగి భరతఖండంగా వుండాలనీ, భారతదేశ వ్యవహారాల్లో ఇతరుల ప్రమేయం లేకుండాఉండాలనీ, భారతదేశం సర్వస్వతంత్రంగా వుండాలనీ భారతీయులు యావన్మందీ వాంఛిస్తున్నారు.

ఈ వాంఛనే గాంధీజీ ప్రతిఫలింపజేస్తూవుంటారు. కనుకనే గాంధీజీవాక్కు భారతప్రజావాణి అవుతున్నది; అయింది.

1917 లో రష్యా బోల్షివిక్కు విప్లవానికి తయారై వుంది. 1932 లో నూతన ఆర్థిక వ్యవస్థా నిర్మాణానికి అమెరికా సిద్ధంగావుంది. అలాగే భారతదేశం స్వపరిపాలనకూ, స్వాతంత్ర్యానికీ సిద్ధంగావుంది. విప్లవాలను విప్లవకారులు సాగించరు. అసలు విప్లవాలను విప్లవకారుల ముందుతరం వారు తయారుచేస్తారు. రష్యా బోల్షివిక్ విప్లవాన్ని జార్ తయారుచేశాడు. అలాగే అమెరికాలో ఆర్థికవిప్లవాన్ని హెర్బర్ట్ హూవరు తయారుచేశాడు. అదేవిధంగా భారతదేశంలో బ్రిటిష్‌వారే గాంధీజీని తయారుచేశారు.

రష్యన్‌లు జార్‌ను దౌర్జన్యచర్యలు జరిపి పదభ్రష్టుని చేశారు. అధికారంనుండి తొలగించారు. అమెరికాలో హెర్బర్ట్ హూవర్ ప్రజాస్వామ్యపద్ధతిని ఎన్నికలు జరగ్గా అధికారపీఠంనుండి వెళ్ళిపోయాడు. భారతదేశంలో బ్రిటిష్‌వారి హయాం ముగిసింది కాని వారు మాత్రం ఇంకా చూరుపట్టుకు వేళ్లాడుతూనే ఉన్నారు.

స్వాతంత్ర్యాన్ని పొందడానికీ, సమర్థించుకోడానికీ భారతదేశం తగి ఉన్నదా, లేదా అన్నది కాదు అసలు ప్రశ్న. భారతస్వాతంత్ర్యానికి బ్రిటిష్ వారు సిద్ధంగా ఉన్నారా? అన్నదే ప్రశ్న. భారతదేశంమంచి ఎంచి బ్రిటిష్ వారు ఆ దేశాన్ని తమ అధీనంలో ఉంచుకోలేదు భారతదేశం తమకు లాభకరం అని కొందరు బ్రిటిషర్లు భావిస్తున్నారు. కనుక వారు భారత దేశాన్ని తమ అదుపులో ఉంచుకుంటున్నారు యథాస్థాయి నిలకడగా ఉంటం ప్రయోజనకరం కనుక కొందరు బ్రిటిష్‌వారు భారతదేశాన్ని బానిసత్వంలో ఉంచివేస్తున్నారు.

యథాస్థాయి రక్షకులు ఎప్పుడూకూడా ఆ స్థాయిలో మార్పుతీసుకు రావడం చాలా చిక్కులతో కూడుకున్నపని అని అభ్యంతరాలు తెలుపుతూ ఉంటారు. అన్ని సమస్యలూ — భారతసమస్య, సామ్రాజ్యసమస్య,

శాంతి పరిష్కారసమస్య — ఒకేవిధమైనవి. ఒకే తానుకు చెందిన ముక్కలు. ఈ సమస్యలన్నింటి పరిష్కారమూ, ప్రతిఒక్క సమస్య పరిష్కారమూ యథాస్థాయి రక్షకులను జయించడంమీదనే ఆధారపడి ఉన్నది.

రిపబ్లికన్ స్పెయినును హతమార్చిన ప్రతీపశక్తులు, హిట్లర్ ముసోలినీలను పెంచి పెద్దచేసినవారు, ఫాసిజాన్ని తృప్తిపరచడానికి పాటుపడినవారు, నిజంగా వారిచేతుల్లో ఉంటే భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని ఇవ్వరు.

**1942** వ సంవత్సరం జులై 4 వ తేదీన భారతదేశంలోని బ్రిటిష్ రాజప్రతినిధి లార్డ్ లిన్‌లిత్‌గో తన రాజమందిరంలో, అమెరికా స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో, పెద్ద విందుచేశారు. ఆ విందుకు నేనూ వెళ్లాను. భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యంనుండి విడిపోయి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందడానికి బ్రిటిష్‌వారు అనేక అభ్యంతరాలను తెలుపుతూవున్నారు, ఎన్నోవిధాల వాదిస్తూవున్నారు. ఆరోజు విందులో ఈ భిన్నవాదాలన్నింటినీ విన్నాను. "స్వతంత్రభారత దేశం తన్ను తాను రక్షించుకోగలదా?" అని ఒక బ్రిటిష్ సైనికోద్యోగి నన్ను ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు ప్రత్యుత్తరంగా నేను ఆ ఉద్యోగిని ఇలా ప్రశ్నించాను: "స్వతంత్ర ఇంగ్లండు తన్ను తాను రక్షించుకోగలదా?"

ఈ రోజుల్లో ఏదేశం అన్యుల సహాయంలేక స్వీయరక్షణ చేసుకోగలదు? బ్రిటన్‌గాని, ఫ్రాన్స్‌గాని, రష్యాగాని తన స్వాతంత్ర్యాన్ని స్వశక్తిపైనే ఆధారపడి రక్షించుకోలేదు. స్వరక్షణసామర్థ్యం, శక్తి గల

దేశాలుమాత్రమే స్వతంత్రదేశాలుగా ఉండాలీఅంటే, ఈనాడు ఎన్ని దేశాలు స్వాతంత్ర్యాన్ని అనుభవింపగలవు? ఎన్ని స్వతంత్రదేశాలు ఉంటవి?

"స్వతంత్ర భారతదేశం తన్ను తాను రక్షించుకోగలదా?" అని కాదు అసలు ఆ బ్రిటిష్‌సైనికోద్యోగి అడిగివుండవలసిన ప్రశ్న. ఈయుద్ధం ముగిసినతరువాత స్వతంత్రదేశముల దురాక్రమణనుండి సంరక్షించగల సంస్థ ఏర్పడగలదా? స్వతంత్రభారతదేశం, ఫ్రాన్స్, అమెరికా, బ్రిటన్, రష్యాలను రక్షించగల అంతర్జాతీయసంస్థ ఏర్పడగలదా? ఆ బ్రిటిష్ అధికారిప్రశ్న ఈవిధంగా ఉండవలసింది.

ఆయుధాల విధ్వంసక శక్తి రోజురోజుకూ అభివృద్ధి అవుతూ వుందికనుక ముందుముందు మన స్వాతంత్ర్యం హెచ్చుగా అంతర్జాతీయ భద్రతాచర్యలపైనే ఆధారపడవలసివుంటుంది. ఇది వైమానికయుగం. దూరం అనేదీ, దుర్భేద్యం అనేదీ లేదు. ఈయుగంలో జాతీయ స్వాతంత్ర్యం శాంతిస్థాపనకై జరిగే సహకారచర్యల నామాంతరంగానే ఉంటుంది.

ఆ విందులో నేను భారతరాజప్రతినిధిసతితో కూర్చోవలసివచ్చింది. లిన్లిత్గో సతి ముచ్చటగా ఉంటుంది. అతిలావణ్యంగా రాజీవాసపు ఠీవి ప్రదర్శిస్తూ ఉంటుంది. భారతదేశ శీతాతపాలనుగురించి ముందు సంభాషణ ప్రారంభమైంది. ఈవిషయమై ఎంతైనా మాట్లాడవచ్చు కాని ఈవిషయమై మేము ఎంతోసేపు సంభాషించలేదు. త్వరలోనే మా సంభాషణ రాజకీయాలవైపు మళ్ళింది, "భారతీయులు తమ్ముతాము పాలించుకోగలరా?" అని ఆమె నన్నడిగింది,

1776 వ సంవత్సరంలో అమెరికాప్రజలనుగురించి బ్రిటిష్‌టోరీలు సరిగ్గా ఇలాంటి ప్రశ్నే వేశారని నేను సమాధానంచెప్పాను. ఆ రోజుల్లో కొందరు అమెరికనుటోరీలు బ్రిటిష్‌టోరీలతో చేతులుకలిపారుకూడా. అదే విధంగా రానున్న పరిణామాన్ని గ్రహించిన బ్రిటిష్‌వారు కొందరు ఆమె

రికాలోని తిరుగుబాటువారులకు సహాయంచేశారు. ఉత్తరఅమెరికాలో బ్రిటిష్‌సామ్రాజ్యం అంతరిస్తే తమదేశంలో ప్రజాసత్తాకం ఏర్పడుతుందని ఈ బ్రిటిష్‌వారు గ్రహించారు. అదేవిధంగా ఈనాడు బ్రిటన్. భారతదేశ పరిస్థితులు కలిసిపోయినవి. వేరుచేయడానికి వీలుగాకుండా పెనవేసుకుపోయినవి. ఈనాడు భారతదేశంలో బ్రిటిష్‌సామ్రాజ్యం అంతరించిపోతే బ్రిటన్‌లోని కొందరు ధనవంతులు దెబ్బతింటారు. సంఘంలో వారి స్థాయి తగ్గిపోతుంది.

తాము నాగరీకులమనుకునేవారు ప్రపంచవ్యవహారాలను ఎంత కశ్మలంచేయాలో అంత కశ్మలమూ చేశారు. ఇంతకంటే పాడైపోవడానికి అవకాశంలేదు. ఇంక కొన్నాళ్ళపాటు ఈ ప్రపంచవ్యవహార నిర్వాహణ అవకాశం మనం అనాగరికదేశాలని భావించే చైనా, భారతదేశాలకు ఎందుకు ఇవ్వకూడదనిపిస్తుంది. తెల్లవారి నిర్వాహణ ఎలా ఉందీ ఆఫ్రికావారూ, ఆసియావారూ కళ్లారా చూచారు. తమ దరిద్ర్యానికీ, రెండు మారణహోమాలకూ కారకులు వీరే అనికూడా వారు తెలుసుకున్నారు. కనుక తెల్లవారు తమ్ముగురించి తాము అనుకుంటున్నట్లు ఆసియావారుగాని, ఆఫ్రికావారుగాని అనుకోరు. శ్వేతజాతులు గొప్పవనే అభిప్రాయం వారికి లేదు: ఉండదు. ఈసంగతి లిన్లిత్గోసతికి చెప్పుదా మనుకున్నాను; కాని చెప్పనేలేదు.

శీతాతపాలను అదుపులో ఉంచగల యంత్రాలను, మోటారుకార్లను, బాంబులను, మారణాస్త్రములను తయారుచేయడంలో మనం దిట్టలం. మనదే అందెవేసిన చెయ్యి. కాని ప్రపంచవ్యవహారాల నిర్వాహణంగురించి మాత్రం అలా చెప్పుకోలేం. ఒక్క పురుషాంతరంలో రెండు ప్రపంచ యుద్ధాలకు దారితీసింది మన నిర్వాహణపద్ధతులే. ఆ కారణంవల్లనే ఆఫ్రికా, ఆసియా జాతులకు మన నిర్వాహణసామర్థ్యం, శక్తి గురించి

అనేకశంక లున్నవి. ఏమైనా మనం ప్రకటించిన చతుస్స్వాతంత్ర్యాలను నమ్మి వారు తమకూ అవి కావాలని అంటున్నారు.

స్వాతంత్ర్యాన్ని వినియోగించుకోగల, సమర్థించుకోగల శక్తి, సామర్థ్యం ఎవ్వరికీ జన్మతః ఏర్పడివుండలేదు. అనుభవంద్వారానే వాటిని ఎవరుగాని పొందుతారు.

జులై 4 తేదీ విందులో భారత స్వాతంత్ర్యప్రాప్తికి బ్రిటిష్‌వారు చూపే అవరోధాన్నికూడా తెలుసుకున్నాను. హిందువులూ, ముస్లింలూ తరచు కీచులాడుకుంటూవుంటారనీ, వారి అనైక్యతవల్లనే భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందలేదనీ అంటారు.

భారతదేశంలో నూటికి 66 గురు హిందువులు. 24 గురు ముస్లింలు. వీరి వైషమ్యాలకూ, వీరి సంఘర్షణలకూ కారణం ఏమిటని విచారిస్తే ఈ విషయాలు తేలినవి. హిందువులు గోవును పూజిస్తారు; ముస్లింలు గోవును చంపి గోమాంసం తింటారు. ముస్లింల మసీదుల ముందు హిందువులూ, హిందువుల దేవాలయాల ముందు ముస్లింలూ ఒకరొకరు ఎదిరిస్తారు.

భారతదేశంలో నూటికి 90 మంది గ్రామాల్లో జీవిస్తూవున్నారు. అయినాకూడా ఆ గ్రామాల్లో ఈ మతకలహాల మాటే వినరాదు. ఈవిషయాన్ని వైస్రాయీ, ప్రభుత్వ ఉన్నతోద్యోగులూకూడా అంగీకరించారు. హిందువులూ, ముస్లింలూకూడా నా కీవిషయం చెప్పారు.

కొన్ని శతాబ్దాలక్రితం పాశ్చాత్యదేశాలనుంచి మహమ్మదీయులు ఈదేశంపై దండెత్తివచ్చారు. రాజులను జయించి దేశాన్ని ఆక్రమించారు. అప్పుడు ముస్లింలు చాలామంది భారతీయులను నిర్బంధంచేసి తమ మతంలో కలుపుకున్నారు. నేటి భారత ముస్లింలలో ముప్పాతికమంది ఇలా మతస్థులయినవారే అని ముస్లింలీగ్ అధ్యక్షుడు జిన్నాగారు నాతో అన్నారు. ప్రజావాహినిలో మహారాజు పండిట్ నెహ్రూ "నేటి భారత

ముస్లింలలో నూటికి 95 మంది వెనుక హిందువులుగా ఉన్నవారే" అని అన్నాడు. లీగ్ అధ్యక్షులు జిన్నాగారి పితామహ, ప్రపితామహులు హిందువులే అనీ, అసలు 'జిన్నా' అనే పేరే హిందూపేరనీ ఆయన అన్నాడు.



జిన్నా

రష్యా, స్విట్జర్లాండులకంటే కూడా భారతదేశం ఏకజాతి దేశం అని చెప్పవచ్చు. వాస్తవానికి హిందువులూ, ముస్లింలూకూడా ఒక్కజాతికి చెందినవారే. వంగరాష్ట్రంలో హిందువులూ,ముస్లింలూ ఒకేవిధంగా ఉంటారు. ఇద్దరూ బెంగాలీ భాషే మాట్లాడతారు. మొత్తం భారతీయులలో సగంమంది హిందీగాని, ఉర్దూగాని మాట్లాడతారు. ఈ రెండు భాషలకూ ఆటే తేడాలేదుకూడా. దేశంలో నిర్బంధ విద్యావిధానం అమలుజరిగితే కొద్దికాలంలోనే ఈ రెండుభాషలూ బాగా వ్యాప్తిచెందుతాయి. ఈనాడు భిన్నంగావున్న వివిధజాతుల పుట్టుపూర్వోత్తరాలను పరిశీలిస్తే ఎక్కువ భేదం కన్పించదు. అమాటకువస్తే అమెరికాజాతులు ఇంతకంటే చాలా భిన్నంగా ఉన్నవని చెప్పవచ్చు.

ఫిలిప్పీన్స్‌దీవుల అధ్యక్షుడు మాన్యుయల్ క్విజాను భారతదేశాన్ని తమదేశంతో పోలుస్తూ నాతో అనేకదఫాలు ఇలా అన్నాడు: "వెనకటి రోజుల్లో ఫిలిప్పీన్సునుపాలించిన అమెరికనులు మాదేశంలోని క్రైస్తవులనూ, మూరుజాతివారినీ - వీరు ముస్లింమతస్థులు - వేరుచేయడానికి

విశ్వప్రయత్నాలు చేశారు. కాని కొంతకాలానికి ఆ ప్రయత్నం నిరుపయోగమనీ, అవివేకమనీ, అమెరికా లక్ష్యమైన ఫిలిప్పీన్స్ స్వాతంత్ర్యసాధన కిది దోహదంచేయదనీ గ్రహించారు. ఆ ప్రయత్నాలను విరమించారు."

భారతదేశంలాంటి దేశములో మత విభేదాలను అల్పంచేయడం తప్పే. కాని హిందూ, ముస్లింమతాలు రెండూకూడా పరమత సహిష్ణుతను బోధిస్తున్నవి.

"కొరాన్, లేక కత్తి" అనే నినాదాన్ని ముస్లింలకు ప్రాప్తింపజేసిన ప్రతిష్ఠ అలావున్నా, మహమ్మదీయమతం యూదులా, క్రైస్తవులా యెడల ఎంతో సహనాన్ని ప్రదర్శించింది. ఇతరమతాల విషయంలోనూ ఇస్లాంమతవైఖరి ఇలాగే ఉంది.

మహమ్మదీయమతంకంటే ఎక్కువ సహిష్ణుతగల మతం హిందూమతం. హిందూమతంలో ఒక గొప్పగుణం ఉంది. ఎన్నిమతాలనైనా అది తవలో చేర్చుకోగలదు. బౌద్ధ, క్రైస్తవమతాలను జీర్ణించుకున్నది హిందూమతం. హిందూమతానికి ఒక ప్రాథమిక అంశం అంటూ ఏమీ లేదు. హిందూమత ప్రాథమికసూత్రాలు మార్పుకు అలవిగానివిగా ఉండలేదు. అవి కాలానుగుణంగా మారుతూవుండగలవు. అలా మార్పుచెందగల సూత్రాలు ప్రాథమికసూత్రాలు ఎలా అవుతవి?

హిందువులు విగ్రహారాధన చేస్తారు. విగ్రహాలను పూజిస్తూ భగవంతుని సన్నిధానంలో నృత్యంచేసే అనేకమంది హిందువులను వారి ఆరాధనగురించి అడిగాను. ఎందర్ని పూజించినా నమ్మకంమాత్రం ఒక్కరిలోనే ఉందని వారు చెప్పారు. విగ్రహాల ఆరాధనకూ, ఒకే భగవంతునిలో నమ్మకంవుంచి ప్రార్థించుటకూ, అసలు భగవంతునిలోనే నమ్మిక లేనివారికీ, ఇహమేగాని పరంలేదనే వాదానికీకూడా హిందూమతంలో స్థానం ఉంది. "నయాగరా జలపాతమే గనక భారతదేశంలో ఉండివుంటే ఆ జలపాతంకూడా భగవంతుని అవతారంగా ఆరాధనార్హమైవుండేది." అని

పండిట్ నెహ్రూ ఒకప్పుడు నాతోనే అన్నారు. భక్తులకు ఆరాధనా సామగ్రిగా, పిల్లలకు విలాసవస్తువులుగా నయాగరావిగ్రహాలు తయారై వుండేవి.

గాంధీజీ 'సనాతన' హిందువు. అంటే పూర్వాచార పరాయణుడని కాదు. ఆయన హిందూమత ధర్మాలన్నింటినీ నమ్మి పాలించుతారు. వారికి కొరాన్ క్షుణ్ణంగా తెలుసు. ఇస్లాంమతసూత్రాల నెన్నింటినో ఆయన విశ్వసిస్తారు. వర్ధాలో గాంధీజీవుండే కుటీరంలో ఒకేఒక చిత్రపటం గోడకు తగిలించివున్నది. అది "ఏసుక్రీస్తు" బొమ్మ. ఆపటంక్రింద "అతడే మన శాంతిదాత" అని వ్రాసివున్నది. ఆపటంగురించి అడగ్గా గాంధీజీ ఇలా చెప్పారు: "నేను జీసస్ అనుచరుణ్ణి"

హిందూ, ముస్లింమతాలు భిన్నమైనవే. కాని వైరుధ్యం లేదు. కొన్నివందల సంవత్సరాలు హిందువులూ, ముస్లింలూ ఇరుగుపొరుగున ఉంటూ పొరుపు అనేది ఎరుగక కాలం గడపలేదా? రాజకీయాలు వీరిని కృత్రిమంగా విభజించకపోతే కలకాలం అలాగే ఉండగలరు. వారి సామరస్యానికి భంగంకలగదు.

హిందూముస్లిం ఐక్యతా ప్రచారం సాగించేవారిలో ప్రముఖుడు. మౌలానా అబుల్‌కలాం ఆజాద్. వీరు



ఆజాద్

ముస్లింమతానికి చెందినవారే. గాంధీజీ ప్రోత్సాహం, ప్రోద్బలంవల్ల ఏర్పడిన భారతజాతీయ కాంగ్రెసుకు వీరు అధ్యక్షులు. వీరి జన్మస్థానం మక్కా. గొప్ప పండితుడు. ముస్లిం మతగ్రంథమైన కొరాన్‌కు ఈయన వ్యాఖ్యానంవ్రాశారు అది ప్రామాణికమైంది. నేడు భారతదేశంలోవున్న మున్షీ (మహమ్మదీయ పండితుడు) లందరిలోకీ అగ్రగణ్యుడు ఆజాద్. వీరిలో ప్రాచీన, నవీన సంప్రదాయాలు రెండూ చక్కగా మిళితమై వున్నవి. ప్రాచీన వైదికవిజ్ఞానం అంటే వీరికి చాలా అభిమానం. సంగీతం అంటే చెవులు కోసుకుంటారు. భారతీయ వక్తలలో ఆజాద్ ప్రముఖుడు. 1942 వ సంవత్సరంలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌తో కాంగ్రెసు తరపున రాయబారాలు చాలాభాగం వీరే జరిపారు.

ముస్లిం విద్యార్థికులు చాలామంది ఆజాద్‌భక్తులుగా ఉన్నారు. వారిలో చాలామందికి పండిట్ నెహ్రూ అంటేకూడా ఎంతో గౌరవం, అభిమానంవుంది. తరుణభారతనాయకుడు పండిట్ నెహ్రూ. కొత్తకారు ముస్లిం యువకులలో నెహ్రూ అనుయాయులు చాలామంది ఉన్నారు. ఈకాలపు యువకులమాట చెల్లే ప్రదేశాల్లో మతవిభేదాలు మచ్చుకైనా కన్పించవు. సైన్యంలో పనిచేసే యువక ముస్లిం ఉద్యోగులూ, విశ్వవిద్యాలయాల్లో చదువుకుంటూవున్న ముస్లింయువకులూ తమమాట చెల్లేతావులలో పెద్దలు పాటించే మతవివక్షత, విచక్షణ అంతరించిపోతవని చెప్పారు. విశ్వవిద్యాలయాల్లోనేమి, విహారప్రదేశాల్లోనేమి, విద్యార్థుల వసతిగృహాల్లోనేమి అన్నిమతాలవారూ, అన్నిజాతులవారూ "మమేకం"గా ఉంటారు. ఎలాంటి భేదాలనూ పాటించరు. అందరూ కలిసి ఒక పంక్తిలోనే భోజనంచేస్తారు. ఈ భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించడానికీ, భిన్నమతాలవారిని ఐక్యం చేయడానికీ కృషి జరుగుతూనేవుంది. భారతస్వాతంత్ర్యాన్ని, దేశశాంతిని, ప్రజల ఆర్థిక అభివృద్ధిని ఆకాంక్షించుచున్నవారందరూ ఐక్యతను సాధించడానికి కృషిచేస్తూవున్నారు. కాని కొందరు ఈ విభేదాలనే వృద్ధి

చేస్తున్నారు. ప్రజలు ఇలా ఉన్నందువల్ల వారికి ఎక్కువ ప్రయోజనం వుంది.

రష్యాలో ఎన్నోజాతు లున్నవి, ఒకదానికొకటి భిన్నమైనవే. కాని నాజీసేనల నెదిరించడానికి అన్నిజాతులూ ఏకజాతిగా ఏకం అయినవి. అమెరికాలో నాలుగుసంవత్సరాలు సాగిన అంతర్యుద్ధంలో ఒకేజాతికి చెందినవారు ఒకర్నొకరు హతమార్చుకొన్నారు.

ఏదేశంలో అంతర్యుద్ధాలు చెలరేగలేదు? చైనా, రష్యా, ఇంగ్లండ్, జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీదేశాలు తాము అంతర్యుద్ధాలను ఎరగమని చెప్ప గలవా? కాని భారతదేశంవిషయంలో "అంతర్యుద్ధం అనివార్యం" అని ఖచ్చితంగా చెప్పడానికి ఇంతవరకూ దాఖలాలు ఏమీ కనిపించడంలేదు. "అంతర్యుద్ధం రావచ్చు. రాగల అవకాశాలు ఉన్నాయి" అని కేవలం బజారుకబుర్లుగా మాత్రం వినవస్తున్నవి. స్వప్రయోజనార్థం పరాయివారు మతకలహాలను, ఈ ఘర్షణలను ప్రోత్సహింపకపోతే హిందువులూ, ముస్లింలూ ఘర్షణపడవలసిన అవసరమే కన్పించదు. ఏరాష్ట్రాని కారాష్ట్రం, ఏభాగాని కాభాగం జాతీయస్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ భారత సమాఖ్యలో చేరివున్నా ఇలా సంఘర్షణలు జరుగవలసిన అవసరం ఏమీ కన్పించదు. ఇలాంటి రాజ్యాంగాన్నే భారత సమస్యాపరిష్కారానికి అనేక మంది హిందువులు, ముస్లింలు, కొందరు బ్రిటిష్‌వారూ సూచిస్తున్నారు. స్వతంత్రం, స్వపరిపాలన గల రాష్ట్రాలను భారతసమాఖ్యగా ఏర్పాటు చేయడమే వీరు సూచించుతూవున్న రాజ్యాంగం. అమెరికావిషయంలో మాదిరే భారతదేశంవిషయంలోనూ రాజ్యాంగసమస్యాపరిష్కారాని కిదే సరియైన మార్గం.

అమెరికావిషయం చూడండి! అమెరికాలోని వివిధరాష్ట్రాలకు స్వాతంత్ర్యమే లేకపోతే అమెరికా సంయుక్తరాష్ట్రాలనేవే ఉండవు.

అంతేగాదు. ఈ వివిధరాష్ట్రాలూ వేటి కవి విడివిడిగా సంపూర్ణస్వాతం
త్ర్యాన్ని కలిగివున్నా అమెరికా సంయుక్తరాష్ట్రాలు అంటూ ఉండవు.

విభేదాలు, వైషమ్యాలు ఉన్నవనే భావం కలిగించడం అంత కష్టం కాదు. హిందువులనీ ముస్లింలనీ, బ్రాహ్మణులనీ బ్రాహ్మణేతరులనీ, అవర్ణులనీ సవర్ణులనీ, బ్రిటిష్ఇండియా అనీ స్వదేశసంస్థానాలు అనీ— ఇలా ఎన్నో భేదాలు ఉన్నవనీ, ఎన్నో జాతులు, ఎన్నో తెగలు ఉన్నవనీ ప్రజలు ఎన్నోభాషలు మాట్లాడుతూవుంటారనీ చెప్పడం. అలాగని ధృవ పరచడం తేలికే. ఉన్న గోరంతవిభేదాలను కొండంతలుచేయడం, అలాగే ఇందర్నీ ఐక్యంచేయగల శక్తులను పూర్తిగా విస్మరించడంకూడా తేలికే. కేవలం విభేదాలనే పెద్దవిగా చేయడం అయితే అమెరికానుగురించీ ఈవిధంగానే ఎంతైనా, ఎన్నిసంగతులైనా చెప్పవచ్చును. తెల్లవారికీ-నీగ్రోలకూ పడదనీ, కాథలిక్కులకూ-ప్రొటెస్టెంట్లకూపడదనీ, కార్మికులకూ ధనికులకూకాదనీ, సి. ఐ. ఒ. (కాంగ్రెస్ఆఫ్ఇండస్ట్రియల్ ఆర్గనైజేషన్) అనే ఒక కార్మికసంస్థకూ ఎ. యఫ్. యల్. (అమెరికన్ ఫెడరేషన్ఆఫ్ లేబర్) అనే మరొక కార్మికసంస్థకూ నిత్యసంఘర్షణలేననీ, ఉత్తర-దక్షిణ ప్రాంతాలకు పొత్తు కుదరదనీ, పార్క్-ఎవెన్యూ (అమెరికాలో ధనికు లుండే ప్రాంతం)లో ఉండేవారికీ-మురికిగూడెములలో ఉండే పేదవారికీ ఒక్కక్షణంకూడాపడదనీ ఎంతైనా చెప్పవచ్చు; అమెరికా అనైక్యతనే చెప్పాలంటే ఈవిభేదాలను నివేదిస్తేచాలు అమెరికానుగురించిన ఇతర విషయాలు తెలియనివారు ఈ సంగతులనుమాత్రం విన్నచో వారు అమె రికాస్థితినిగురించి ఏమనుకుంటారు? అమెరికా చిందరవందర కాబోతూ ఉందనీ, ఇవాళకాకపోతే రేపైనా ఆ దేశం కూలిపోతుందనీ, నామరూ పాలు లేకుండా అయిపోతుందనీ అనుకుంటారు. నాజీజర్మనీప్రచారకశాఖ మంత్రి డాక్టర్ గోబెల్సూ, ఇతరఫాసిస్టుప్రచారకులూ సరిగ్గా ఇదే ప్రచారం చేస్తూఉండేవారు. ఇతరదేశాల్లో ఉన్నట్టే భారతదేశంలోనూ విభేదాలు

ఉన్నాయి రాజకీయపు ఎత్తులవల్లా. దేశీయులను కొందర్ని చేరదీసి వారిని పోషించడంవల్లా ఈ విభేదాలను పెంచవచ్చు. కాని అలా విభేదాలను వృద్ధిచేసేవాడు శాంతియెడల మహాపచారం చేస్తున్నాడు; సామ్రాజ్య విచ్ఛిత్తిని ప్రతిఘటిస్తున్నాడు; నిప్పుతో చెలగాటమాడుతూ ఉన్నాడు.

ఇన్ని విభేదా లున్నందువల్ల భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి వీలుగాదని బ్రిటిష్‌వారు అనవచ్చు. అయితే బర్మాసంగతి చూడండి. ఆ దేశంలో హిందూ-ముస్లింతగాదాలు లేవు. ఎలాంటి విభేదాలూ లేవు. అలాగే ఆ దేశానికి "గాంధీ" అనేవాడుకూడా లేడు. అయినా బ్రిటిష్‌వారు ఆ దేశానికి స్వాతంత్ర్యాన్ని నిరాకరించారు.

చైనా ఏకజాతే, ఒకేదేశమే అయినా పాశ్చాత్యరాజ్యాలు చైనాను ఇంచుమించు ఒక వలసదేశంగానే చూస్తున్నారు. ఎందుకూ కొరగాని, లెక్కలోకిరాని దేశంగానే పరిగణిస్తున్నారు. సామ్రాజ్యతత్వప్రదర్శనలు హేతువాదబద్ధమైనవీ కావు; నీతిసమ్మతమైనవీ కావు. సామ్రాజ్యతత్వం ఒక సిద్ధాంతం, ఒకసూత్రంమీదకాక కేవలం అధికారంమీద ఆధారపడి ఉన్నది. దౌర్జన్యచర్యలను నీతిసమ్మతమైనవిగా ప్రదర్శించుటకూ, ధ్రువపరచుటకూ జరిగిన ప్రయత్నాలు అన్నీ విఫలమైనవి.

భారతదేశంగురించి బ్రిటిష్‌వారు అత్యుక్తిగా చెప్పే మరొకవిభేదం స్వదేశసంస్థానాలకు సంబంధించింది. భారతసంస్థానాలకూ, బ్రిటిష్ భారత భాగానికీ ఎంతో తేడావుందని చెప్తూవుంటారు. భారతదేశంలో స్వదేశ సంస్థానాలు అయిదువందలకు పైగా ఉన్నాయి. ఏఒక్కమూలాగాక దేశమంతటా విస్తరించివున్నాయి. ఈ సంస్థానాల్లో చాలా చిన్నవి-సుమారు మూడునాలుగువేల జనాభామాత్రం కలిగినవీ ఉన్నవి. చాలా పెద్దవీ ఉన్నవి. హైదరాబాదులాంటి సంస్థానాల్లో (1,70,00,000) 170 లక్షల ప్రజలు ఉంటున్నారు. భారతదేశంజనాభా మొత్తంలో దాదాపు పాతికమంది - పదికోట్ల ప్రజలు - ఈ సంస్థానాల్లోనే ఉన్నారు.

బ్రిటిష్ ఇండియాను బ్రిటిష్‌వారే పాలించుతూవున్నారు. వారే శాసనాలుచేస్తారు. ఆ శాసనాలను వారే అమలుచేస్తారు. భారత సంస్థానాలను అంత ప్రత్యక్షంగా గాక, ప్రచ్ఛన్నంగాసంస్థానాధీశ్వరులద్వారా పాలించుతూఉంటారు. ఈ సంస్థానాధీశ్వరులు బ్రిటిష్‌సామ్రాజ్య అపేక్షలకూ, ప్రయోజనాలకూ భంగకరంగా ప్రవర్తింపనంతకాలం బ్రిటిష్‌వారు వారి జోలికి పోరు. సంస్థానాధీశ్వరులు సంస్థానాల ఎల్లలలో ఇష్టంవచ్చినట్లు నిరంకుశరీగా ప్రవర్తింపవచ్చు.

ఈ సంస్థానాలకూ ఒక సంఘంవుంది. దాన్నే 'నరేంద్రమండలి' అంటారు. 1942 జూన్‌మాసంలో నేను బికనీర్ మహారాజును బొంబాయిలో కలుసుకున్నాను. అప్పు డాయన ఈ నరేంద్రమండలికి అధ్యక్షుడుగా ఉన్నాడు. "నేను సర్వాధికారిని" అని ఆయన నాతో అన్నాడు. తరవాత కొంతకాలానికి గొంతులో పుండుపుట్టి ఆయన చనిపోయాడు. ఆయనది భలే విగ్రహం. ఆయన్ను చూస్తూవుంటే ప్రాచీనహైందవయోధుల గాథలు స్ఫురణకు వస్తవి. ఆజానుబాహువు. వక్షస్థలం ఎంతో విశాలంగా ఉంది. చాలా పొడుగ్గా ఉండేవాడు. ఆ పొడుక్కు తగ్గ లావు. మీసాలు చెవులవరకూ వచ్చి ఉంగరాలు తిరిగివుండేవి. మృగరాజు శిరస్సు. నల్లని జుట్టు తెల్లనౌతూ, రంగులపూతవల్ల రాగివర్ణం తేలింది. చక్కని ఆంగ్ల భాష మాట్లాడేవాడు.

1818 వ సంవత్సరంలో బ్రిటిష్‌వారితో బికనీర్ మహారాజు సూరత్‌సింగ్ రాజీచేసుకున్నాడు. బికనీర్ మహారాజు అప్పటి ఆ సంధి పత్రాన్ని నాకు చూపించారు. బికనీర్ సంస్థానపు సరిహద్దుల్లో ఈయనకు సర్వాధికారాన్ని ప్రసాదించింది ఆ పత్రం. సంస్థానప్రజలతో తన ఇష్ట ప్రకారం వ్యవహారం చేయవచ్చు. కాని బ్రిటిష్‌వారికీ, సంస్థానాధీశ్వరులకూ ఉండే సంబంధం యజమానీ, సేవకుల సంబంధం ఉన్నట్లు ఉంటుంది. సంస్థానాధీశులు బ్రిటిష్‌వారికి సహకారం చేయడం సేవకుడు

యజమానితో సహకారంచేసినట్లే ఉంటుంది. సంస్థానాధీశ్వరుడు ఈ సేవక విధులను నిర్వర్తించినందుకు బ్రిటిష్‌వారు ఆ సంస్థానాన్ని సంరక్షించడానికి ఒప్పందమైనారు. ఈ సర్వాధికారి - ఈ నియంత సింహాసనంపై పదిలంగా కూర్చోవడానికి బ్రిటిష్‌సామ్రాజ్యం యావత్తూ సహాయం చేస్తుంది.

పాతపద్ధతులకూ, సనాతన సంప్రదాయాలకూ ఈ సంస్థానాలు పట్టుగొమ్మలు. ఏ సంస్థానాధీశ్వరుడైనా సంప్రదాయవిరుద్ధంగా సంచరిస్తే సంస్థానాన్ని వదులుకుపోవలసివస్తుంది. ఇందూరుమహారాజుగారు తన సంస్థానంలో ప్రజాస్వామికపద్ధతులను ప్రవేశపెట్టడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్న ఫలితం ఇందూరు ప్రజాస్వామికం కావడంకాదు. సంస్థానాధీశ్వరుడు కాలిఫోర్నియాపోయి కాలంగడుపుకోవలసివచ్చింది.

భారతదేశంలో బ్రిటిష్‌సామ్రాజ్యం వర్ధిల్లడానికీ, వృద్ధికావడానికీ ఈనరేంద్రులు చేసిన సహాయాన్ని బ్రిటిష్‌వారు మరిచిపోలేదు. ఎప్పటికప్పుడు గుర్తిస్తూనే ఉన్నారు.

రిష్‌బ్రూక్ విలియమ్స్ - ఈయన భారతసంస్థానాల వ్యవహారాలను బాగా అవగాహన చేసుకున్నాడు - 'ఈవినింగ్ స్టాండర్డ్' పత్రిక 19.0వ సంవత్సరం మే 28వ తేదీ సంచికలో ఈ సంస్థానాలనుగురించి ఇలా వ్రాశారు: "భారతదేశం అన్నిమూలలా శీతాకోకచిలుకల్లా ఉన్నాయి యీ సంస్థానాలు. ఈపాలిగాపుసంస్థానాలు బ్రిటిష్‌సామ్రాజ్యానికి గొప్ప రక్షలనే చెప్పవచ్చు. అంతా అస్థిరంగా ఉన్న దేశంలో అక్కడక్కడ సైనికదుర్గాలను ఏర్పాటుచేసుకుంటే ఎంతటి తిరుగుబాటునైనాసరే అణచివేయవచ్చును. భారతదేశంలో సంస్థానాలు బ్రిటిష్‌వారికి పెట్టని కోటల్లాగా ఉన్నవి. దేశంఅంతటా అల్లుకొని, బలంగా ఈ సంస్థానాలు ఉన్నందున బ్రిటిష్‌వారిని నిశ్శేషంగా ఊడ్చివేయడం సాధ్యంగాదు. ఈ సంస్థానాలు

నిరంకుశమైనకొద్దీ ఈ కోటలను పట్టుకోవడం ఈకోటల్లోవున్న జాతీయ శక్తులకు అంత కష్టమౌతుంది.

స్వదేశసంస్థానాలను కదల్చక అలాగే ఉంచివేయడానికి గల రాజకీయకారణాలను బ్రిటిష్‌రాజప్రతినిధి లార్డ్ కానింగ్ చాలా చక్కగా, స్పష్టంగా వివరించారు. "భారతదేశాన్ని జిల్లాలుగా విభజిస్తే మన సామ్రాజ్యం అయిదుదశాబ్దాలైనా నిలవదని సర్ జాన్ మాల్కలం చెప్పి ఎంతో కాలం కాలేదు. అలాకాక భారతదేశంలో అక్కడక్కడ రాజకీయాధికారం లేని స్వదేశసంస్థానాలను కేవలం సార్వభౌముని సాధనాలుగా ఉంచితే భారతదేశంలో మన సామ్రాజ్యం, మన నౌకాబలాధిక్యత ఎంతకాలం ఉంటుందో అంతకాలం వర్ధిల్లుతుంది అనికూడా ఆనాడాయన ప్రకటించాడు. ఈప్రకటన యథార్థంగురించి నాకు ఎలాంటిసందేహమూ లేదు. ఈవిషయాన్ని మనం శ్రద్ధగా విచారించాలనీ, అలాచేయడం అవసరం అనీ ఇటీవలి సంఘటనలు స్పష్టంచేస్తున్నవి" సామ్రాజ్యవాద పు వ్యూహంలో ఈ భారతసంస్థానాలు మహా చక్కని ఎత్తు.

బ్రిటిష్‌వారికీ, ఈ సంస్థానాధీశ్వరులకూ జరిగిన ఒడంబడికల పత్రాలను అనేకం నేను చూచాను. కేవలం స్వలాభంకొరకు, స్వప్రయోజనంకొరకు దౌర్జన్యంగా బ్రిటిష్‌వారు ఏర్పాటుచేసుకొన్నవే ఇవన్నీకూడా. యుద్ధంలో పరాజయం పొందినతరువాత కొన్ని సంవత్సరాలకు బ్రిటిష్‌వారు సంస్థానాధీశ్వరులతో ఈ ఒడంబడికలను వ్రాసుకున్నారు. సంస్థానాధీశ్వరుల రక్షణకు బ్రిటిష్‌వారు పూచీపడ్డారు. ఆ కారణంగా ఈ రక్షకత్వ బాధ్యతలను గాలికివదిలివేసి తాము భారతదేశంనుండి వెళ్ళిపోలేమని బ్రిటిష్‌వారు అంటున్నారు. భారతదేశంలో ఉండిపోవడానికి వీటిని సాకులుగా చూపుతున్నారు.

బ్రిటిష్‌వారు తమకుచేస్తున్న సహాయాన్ని సంస్థానాధీశ్వరులు గుర్తించారు. బ్రిటిష్‌వారే లేకపోతే తమ దర్జాలూ, దర్బారులూ సాగవనీ,

తమ వస్తువాహనాలు పోతవనీ, అసలు సింహాసనమే ఆపదపాలవుతుం దనీ ఎరుగుదురు. భారతదేశంలోనూ, ఆసియాఅంతటా పరిస్థితులు మారి పోతూవున్నవనీ, కొత్తగాలి వీస్తూవుందనీ సంస్థానాధీశ్వరులు చాలామంది గ్రహించారు. కొందరు సంస్థానాధీశ్వరులు దూరదృష్టి కలిగి, వివేకంగా కాంగ్రెస్‌నాయకులతోటే సంబంధాలు ఏర్పాటుచేసుకున్నారు. భారత సంస్థానాలు ఐర్లెండులోని అల్‌స్టర్‌లాగా తయారుకావని నరేంద్రమండలి ఉద్యోగి ఒకడు నాకు చెప్పాడు. దీని తాత్పర్యం ఏమంటే, సంస్థానా ధీశ్వరులు భారతదేశవిభజనను కోరరు అనే; అలాంటి ప్రయత్నం చేయరు అనే.

కాని, నరేంద్రులు అంటూ అలా ఉండనేవున్నారు; తమ హక్కు లను, సౌకర్యాలను వదులుకోడానికి వారు సమ్మతించడంలేదు. అయిష్టం గానే ఉన్నారు. బ్రిటిష్‌వారంటే ప్రత్యేకఅభిమానం లేకపోయినా, వారంటే కొంత ప్రతికూలభావం వున్నప్పటికీ అందరూ బ్రిటిష్‌వారు భారతదేశంలో ఉండాలనే అంటారు. కాని ఇక బ్రిటిష్‌వారు వెళ్ళక తప్పనిసరి అయితే, అప్పటి కొత్త పరిస్థితులకు తగినట్టు వ్యవహరించడానికీ, నవ్యభారత దేశంలో సర్దుకోవడానికీ ప్రయత్నిస్తారు.

తాత్కాలిక భారతజాతీయ సంకీర్ణప్రభుత్వం అంటూ ఏర్పడితే ఆ ప్రభుత్వంలో హిందువుల, ముస్లింల, నరేంద్రుల ప్రతినిధులు ఉంటా రని గాంధీజీ నాతో అన్నాడు. గాంధీజీ ఇలా అన్నట్లు నేను బికనీర్ మహారాజుకు నివేదించాను. ఆమాట విని ఆయన ఇలా అన్నాడు: "బ్రిటిష్ వారు ఈనాడు మాకు ఏమి సహాయంచేస్తున్నారో, ఈ కొత్త ప్రభుత్వం కూడా మాకు అలాంటి సహాయమే చేస్తుందని మేము ఆశిస్తున్నాము." స్వతంత్రభారతప్రభుత్వం తొలిదశలో ఈ సంస్థానా లన్నింటినీ రద్దుచేసి వేయగల స్థితిలో ఉండదు. సంస్థానాలు క్రమంగా అంతరించిపోవాలి, భారతదేశాన్ని ప్రస్తుత దౌర్భాగ్యస్థితినుండి ఉచ్చస్థితికి తీసుకువచ్చేపనిలో,

ఆ కార్యక్రమంలో ఈ "బ్రిటిష్‌కోటలు" వాటికవి రద్దుఅవుతూ ఉండవల సిందే. పదహారవ శతాబ్దం ఎన్నాళ్ళుంటుంది? చిరకాలం ఉండగలదా? ఇప్పటికీ ఆ శతాబ్ది సంప్రదాయాలు, వ్యవస్థలు 20 వ శతాబ్దంతో ఘర్షణ పడుతున్నవి.

సామ్రాజ్యాలు అంతర్ధానమైతే ప్రపంచ వలసదేశాల అభివృద్ధి సత్వరంగా, వేగంగా జరగడానికి వీలుంది. వర్తమానపరిస్థితులను అనుస రించి తమ దేశాన్ని జీవింపనివ్వవలసిందనే భారతస్వాతంత్ర్యోద్యమం కోరుతూవుంది. భూతకాలంనుండి వర్తమానానికి మారడం అంత తేలిగ్గా కన్పించదు, అవరోధాలు అసంఖ్యాకములు; గతాన్ని కాపాడేవారికి ఆయుధ బలం, అర్థబలం బాగా ఉంది. భారతస్వాతంత్ర్యాన్ని ప్రతిఘటించేవారు ఈ ప్రతిబంధకాలు తొలగవలసినవనీ, అవరోధాలు అధిగమింపవలసినవనీ చెప్పరు, అ ఊసే ఎత్తుకోరు. భారత దేశానికి స్వాతంత్ర్యాన్ని ఇవ్వకపోవ డానికి కారణాలుగానూ, ఇవ్వకుండావుండటానికిసాకులుగానూ పేర్కొంటూ ఉంటారు. ఈ వాదాలు, ఈ సాకులు నేటివి కావు. సామ్రాజ్యాలతోపాటే ఇవీ వచ్చినవి దురాక్రమణ సాగించేవారి అహంభావంతోటే వచ్చినవి.

భారతదేశం ఎందుకు స్వతంత్రదేశం కావాలో, భారతీయులకు స్వపరిపాలనాధికారం ఎందుకుఇవ్వాలో, అందుకుసంబంధించిన కారణాలను ఒక్క బ్రిటిషర్ నోటివెంట అయినా నేను వినలేదు. కాని భారతదేశం ఎందుకు స్వతంత్రదేశం కాకూడదో అనేకమంది బ్రిటిష్‌వారు కారణాలు వివరించిచెప్పుతూఉండటం విన్నాను. కనుకనే భారతీయులు ఎవ్వరూ కూడా తమ దేశం ఇప్పటి బ్రిటిష్‌పాలకులనుండి స్వాతంత్ర్యంపొందుతుందని నమ్మడంలేదు బ్రిటిష్‌వారి వాగ్దానాల్లో భారతీయులకు ఏమాత్రం విశ్వాసమూ లేదు.

ఫిలిప్పీన్సుదీవులకు స్వాతంత్ర్యాన్ని ఇచ్చివేయాలని ఆదేశిస్తూ రూజ్‌వెల్ట్ అధ్యక్షుడు 1943 అక్టోబరు 6 వ తేదీన అమెరికా శాసనసభ



రూజ్‌వెల్ట్

లకు ఇలా ఒక సందేశం పంపించాడు: "ఫిలిప్పీన్స్ ప్రజలకు అమెరికా ప్రభుత్వం చేసిన వాగ్దానాలు అన్నింటినీ మనం పాలించాం. స్వతంత్రులుగానూ, స్వేచ్ఛాజీవులుగానూ వ్యవహరించుటకు ఫిలిప్పీన్సుప్రజలు అర్హతను, హక్కునూ సంపాదించుకున్నారని అమెరికాప్రజలు యావన్మందీ భావిస్తున్నా రనే నా దృఢ విశ్వాసం."

బ్రిటిష్‌ప్రధాని చర్చిల్ నుండి గాని, అమెరికాలోని బ్రిటిష్ రాయబారి లార్డ్ హాలిఫాక్స్ నోటి వెంటగాని, బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఆంథోనీ ఈడెన్, లేక భారతదేశంలోని బ్రిటిష్‌రాజప్రతినిధి లార్డ్ లిన్లిత్గో ముఖతః గాని భారతదేశంవిషయంలో ఇలాంటి ప్రకటనను మనం వినగలిగామా? విన్నామా? ఇండియా కార్యదర్శి అమెరీ అయినా మన అధ్యక్షుని ఫిలిప్పీన్స్ ప్రకటనతో సరితూగగల "భారతదేశ ప్రకటన" అంటూ ఏమైనా చేశాడా?

మామూలువిషయాల్లో ఫిలిప్పీన్స్‌కూ, భారతదేశానికీ ఏమీ సామ్యం లేదు. ఏదేశాని కదే. ప్రజల ఆచారవ్యవహారాల్లోగాని, జీవితవిధానంలో గాని ఏమీపోలికేలేదు. కాని నైతికంగా రెండుదేశాల సమస్యలూ ఒకటే,

అమెరికా అధ్యక్షుని అక్టోబరుసందేశం విని "అద్భుతంగా ఉంది" అని ఫిలిప్పీన్సుఅధ్యక్షుడు క్విజాన్ అన్నాడు. క్రిప్స్ ప్రతిపాదనలను గురించి అలాంటి అభిప్రాయాన్ని భారతీయులు ఎవ్వరూ వెలిబుచ్చి ఉండలేదు. "క్రిప్స్ ప్రతిపాదనలు అద్భుతంగా ఉన్నాయి" అనే మాట ఒక్క భారతీయుని నోటి నుండైనా వినలేదు.



క్విజాన్

భారతదేశపరిస్థితి అంతా మామూలుగానే ఉందనీ, ఆదేశంలో అంతా శాంతంగానే ఉందనీ బయటిప్రపంచం అనుకునేటట్లు చేయడానికి బ్రిటిష్‌వారు చేస్తూవచ్చిన తంత్రాలు చూస్తే వింతగావుంటుంది. బ్రిటిష్‌ప్రభుత్వ ప్రతినిధిగా, మంత్రిహోదాలో సర్ స్టాఫర్డ్ క్రిప్సు 1942 వ సంవత్సరం మార్చిలో భారతదేశం వెళ్ళాడు. "భారతీయులకు స్వాతంత్ర్యం ఇస్తాను. ఇస్తున్నాను" అని అప్పుడు క్రిప్సు ప్రకటించాడు. అలాజరిగిఉంటే బ్రిటిష్

సామ్రాజ్యం విచ్ఛిన్నమై పోయి ఉండేది. కాని 1942-వ సంవత్సరం నవంబరులో ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ ఇలా ఉద్ఘాటించాడు: "ఈనాడు మాకు ఉన్నవాటిని (వలస, బానిసదేశాలను) మేము వదులుకోము. బ్రిటిష్‌సామ్రాజ్య విచ్ఛిత్తికి అధ్వర్యం వహించడానికి నేను సార్వభౌముని ప్రధానామాత్యుణ్ణి కాలేదు." దాపరికంలేకుండా, ఉన్న



సర్ స్టాఫర్డ్ క్రిప్సు

సంగతిని ఉన్నట్లు చర్చిల్ ఇలా చెప్పివేయడంవల్ల ఆయనతాబేదారులు, అనుయాయులు కొంచెం ఇరకాటంలో పడ్డారు. వీరు "కామన్వెల్తు" అనే మాటతో సామ్రాజ్యవిచ్ఛిత్తిని సాధిద్దామని ప్రయత్నించారు. పదభేదంతో పదార్థభేదం సాధ్యమా? "సామ్రాజ్యాన్ని" కేవలం "కామన్వెల్తు"అని నామకరణం చేసినంతమాత్రాన భారతదేశస్థాయిలో మార్పు ఏమీ రాదు. బ్రిటిష్ కామన్వెల్తులో కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, దక్షిణాఫ్రికాదేశాలు స్వతంత్ర అధినివేశాలుగా ఉన్నవి. యథార్థమేకాని భారతదేశస్థితి వేరు. అది చాలా పేదదేశం, పరాయివారు దేశాన్ని పీడించి, పీల్చి పిప్పిచేసి వేశారు. సామ్రాజ్యభారంతో అది క్రుంగిపోయింది. కామన్వెల్తు అని వ్యవహరించినంతమాత్రాన ఈ దుస్థితి తొలగదు.

మాతృదేశం అయిన బ్రిటనుకూ, శ్వేత అధినివేశాలకూ ఉన్న సంయోగం ఈ ద్వితీయసంగ్రామంవల్ల బాగా స్పష్టమైంది. అలాగే బ్రిటన్ భారతదేశాలు ఒకదానికొకటి ఎంతదూరంగా ఉందీ, రెంటికీమధ్య ఎంతటి అగాధం ఉన్నదీకూడా ఈ యుద్ధంవల్ల వెల్లడైంది. భారతజాతీయ కాంగ్రెసూ, అఖిలభారత ముస్లింలీగూ కూడా బ్రిటిష్‌వారి యుద్ధకృషికి

తోడ్పడమని అసందిగ్ధంగా, విస్పష్టంగా ప్రకటించినవి. అలాగని అధికార పూర్వకంగా తీర్మానాలు చేసినవి. "ముందు స్వాతంత్ర్యం. తిండిసంగతి చెప్పండి. తరువాత యుద్ధంసంగతి విచారిద్దాం" అని ప్రజలంటున్నారు. సైన్యంలో చేరినందువల్ల దాదాపు 20,00,000 మంది భారతీయులకు జీవనోపాధి కలిగింది. "భారతీయులు ముఖ్యంగా డబ్బుకోసరం, ప్రతిష్ఠ కోసరం యుద్ధంలో చేరుతూ వున్నారు." అని సైనికులను చేర్చడంలో నిమగ్నుడై వున్న ఒక బ్రిటిష్ సైనికోద్యోగే అన్నాడు. చాలామంది అనువంశిక సైనికులు. ఇది వారికి ఇంచుమించు కులవృత్తి అయింది. ఆకారణంగా కొందరూ, పొట్టపోసుకోవాలిగనుక ఎక్కువమందీ సైన్యంలో చేరుతూ ఉన్నారు. సైన్యంలోని భారతీయులసంఖ్యనుబట్టి, భారతదేశములో బ్రిటిష్ పాలన ప్రజామోదాన్ని పొందింది అని మాత్రం అనుకోవడానికి వీలులేదు. వేళ కింత అన్నంపెట్టి, వొళ్లు దాచుకోవడాని కింత బట్టయిస్తే సైనికులుగా రావడానికి ఆకలిగొన్న, క్షుదార్తులుగా ఉన్న భారతీయులు కనీసం యాభై లక్షలమంది అయినా సిద్ధమౌతారు. కాని "భారతజాతి" మాత్రం ఈ యుద్ధంలో బ్రిటనుకు ఏమీ సహాయంచేయడంలేదు. బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని రక్షించడానికి భారతజాతి యుద్ధంచేయదు. భారతప్రజలు స్వాతంత్ర్యం కొరకై తేనే యుద్ధంచేస్తారు. భారతీయుల ప్రవృత్తి, వారి మనోనిశ్చయం సంగతి బ్రిటిష్‌వారికి ముందుగానే తెలుసును. కనుకనే భారతదేశం కక్షదారు అయినట్లు ఆదేశంతరపున బ్రిటిష్‌వారే ప్రకటనచేశారు. అధినివేశ రాజ్యాలు బ్రిటన్‌వెంట తాము యుద్ధానికి దిగామని తీర్మానాలుచేసినవి. కాని భారతదేశంవిషయం అలాకాదు. భారతదేశంతో సంప్రతించక, ఆ దేశసమ్మతిని పొందక బ్రిటిష్‌వారే భారతనిర్ణయాన్ని ప్రకటించారు. భారత దేశం బ్రిటిష్ కామన్వెల్తులో స్వపరిపాలననుగాని, ప్రజాస్వామ్యాన్నిగాని అనుభవించడంలేదని ఈ ఒక్క విషయంవల్ల విస్పష్టమౌతున్నది. భారత దేశానికి స్వపరిపాలన ఇద్దామనే సంకల్ప మయినా బ్రిటిష్‌వారికి ఉన్నట్లు

భారతీయులు అంగీకరించరు. బ్రిటిష్ సంకల్పాలనుకూడా వారు శంకిస్తున్నారు.

క్రిప్స్ భారతదేశానికి స్వాతంత్ర్యం ఇస్తానన్నాడు కాని దాన్ని మంజూరుచేయ చర్చిల్ నిరాకరిస్తున్నాడు. క్రిప్స్ ప్రతిపాదనలు ద్విజాతి సిద్ధాంతాన్ని గుర్తించినవి. పాకిస్తాన్‌సూత్రాన్ని అంగీకరించినవి. తత్ఫలితంగా భారతదేశం విభక్తమయ్యేది. భారతదేశం ఐక్యజాతి కాదు. కనుక ఆ దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వలేమంటారు బ్రిటిష్‌వారు. కాని "భారతదేశం ఏకజాతి" అని ఇండియా కార్యదర్శి అమెరీ అంటాడు. 1940 వ సంవత్సరం అగస్టు 16 వ తేదీన బ్రిటిష్ కామన్సుసభలో ఈయన అత్యంత ప్రధానమైన ప్రకటన ఒకటి చేశాడు: "భారతదేశం స్వయంసమృద్ధమై స్వయంపోషకమై ఒక ప్రత్యేకవిశిష్టత గల దేశం. భారతదేశ నాగరికత అతి ప్రాచీనమైనది. భారతీయులు యావన్మందికీ సంబంధించి ఒక దీర్ఘ చరిత్రకూడా ఉంది. భారతీయులు ఇందుకు గర్వింపవచ్చు. గర్విస్తున్నారు. ఈ రెంటినీ చూచుకొని 'నేను భారతీయుడను' అని సగర్వంగా చెప్పుకోని భారతీయు డెవరైనా ఉన్నాడా?"

అయితే అసలు ఈ భిన్నప్రకటనలలో ఏది నిజం? అసలు విషయం ఏమిటి? భారతదేశం ఏకరాజ్యం అనే అమెరీమాట నమ్మడమా? లేక విభక్తమై ఉన్న దేశం అని ఇతర బ్రిటిష్‌ఉద్యోగులు చెప్పే కబుర్లు నమ్మడమా? భారతదేశ ఐక్యతను, ఏకత్వాన్ని బ్రిటిష్‌వారు అంగీకరించి ఉంటే ఈ దేశవిభజనకు దారితీసే పాకిస్తాన్ సూత్రాన్ని ఎందుకు అంగీకరించారు? ఐక్య భారతదేశాన్ని ఎందుకు విభజింప సంకల్పించారు?

అనేకమంది ముస్లింలే పాకిస్తానుకు ప్రతికూలంగా ఉన్నారు. పాకిస్తాన్ స్థాపనే సంభవమైతే బెంగాల్‌రాష్ట్రం బహుశః అందులోనే ఉంటుంది. కాని ఆరాష్ట్రప్రధాని ఫజ్లుల్‌హక్ తాను పాకిస్తాన్ వ్యతిరేకుణ్ణి అని నాతో చెప్పాడు. సింధుకూడా వంగరాష్ట్రంవలె ముస్లింరాష్ట్రమే.

ఆ రాష్ట్ర ప్రధాని అల్లాబక్ష్ కూడా పాకిస్తానుకు సుముఖంగా లేడు. ఫజ్లుల్ హక్ చెప్పినట్లే అల్లాబక్ష్ ఈవిషయం నాకు చెప్పాడు. ఇతర ముస్లింలు కూడా కొందరు ఇదే అభిప్రాయాన్ని ప్రకటించారు. పాకిస్తాన్ వాదులకు బ్రిటిష్‌వారి ప్రోత్సాహమే లేకుంటే పాకిస్తాన్ ప్రతికూలురసంఖ్య ఇంకా ఎక్కువగా ఉండేది. ముస్లింల వైఖరి ఇలావుంది, ఇక హిందువుల విషయం చెప్పనే అక్కర్లేదు. భౌగోళికంగాను, జాతివిషయంగానూ అవిభక్తమైన భారతదేశాన్ని విభజించడానికి వారు అసలు సమ్మతించరు. క్రిప్స్‌ప్రతిపాదనలు అంతఃకలహాలను ప్రోత్సహించడానికే ఉపకరించినవి. కలహకారణాలు ఎక్కువైనవి.

సర్ స్టాఫర్డ్ క్రిప్స్ శల్యరాయబారం జరిపాడు. ఒక చేత్తో భారత దేశానికి స్వాతంత్ర్యాన్ని ఇచ్చి రెండోచేత్తో భారతీయులు ఆ స్వాతంత్ర్యాన్ని పొందడానికి వీలుగాని అవరోధాలను కల్పించాడు. యుద్ధానంతరం భారతదేశానికి సంపూర్ణస్వాతంత్ర్యాన్ని కామన్వెల్తునుండి విడిపోయే హక్కుతోసహా ఇచ్చిన క్రిప్స్‌సూచనలు సమితిరాజ్యాంగం ఏరాష్ట్రానికైనా తృప్తికరంగా లేకపోతే, ఆరాష్ట్రం సమితినుండి విడిపోయి వేరుగా ఉండవచ్చుననికూడా తెల్పినవి. ఈ ప్రతిపాదనలలో మొత్తంమీద అటు భారతదేశానికి సంపూర్ణస్వాతంత్ర్యాన్ని ఇచ్చివేసే సూచనా ఉంది; ఇటు చిరకాలం బానిసత్వంలో ఉంచివేయడానికి ఏర్పాటూ ఉంది.

క్రిప్స్ రాయబారవైఫల్యం భారతీయులకు విపరీత మనఃపరితాపం కలిగించింది. సర్ స్టాఫర్డ్ క్రిప్సు అంటే భారతీయులకు పరమ అసహ్యం కలిగింది. కాని, పాపం, క్రిప్స్ అంతటిద్వేషానికి నిజంగా తగివుండలేదు.

1942 వ సంవత్సరం ఆరంభదశలో బ్రిటిష్‌వారు జపాన్‌చేతుల్లో భలే దెబ్బలు తిన్నారు. సింగపూరురేవులో ఉన్న బ్రహ్మాండమైన యుద్ధ నౌకలు 'రిపల్స్', 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్'లు జపాన్ విమానదాడికి ఆహుతియై ఎందుకూ పనికిరాకుండా పోయినవి. హాంగ్‌కాంగ్, మలయా, సింగపూ

రులు వరసగా సునాయాసంగా జపాన్‌వశమైనవి. ఆ పరిస్థితుల్లో బ్రిటిష్ ప్రభుత్వం సర్ స్టాఫర్డ్ క్రిప్పును భారతదేశం పంపించింది. అప్పటికే భారత దేశంలో బ్రిటిష్‌ప్రతిష్ఠ పూర్తిగా దెబ్బతినిపోయింది. పోయిన ప్రతిష్ఠను తిరిగి సంపాదింపవమనే బ్రిటిష్‌ప్రభుత్వం సర్ స్టాఫర్డ్ క్రిప్పును పంపించింది. క్రిప్స్‌రాయబారానికి అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ ప్రోద్బలంకూడా కొంత ఉంది. బ్రిటిష్ పరాజయాలవల్ల, జపాన్ విజృంభణవల్ల భారత ప్రజలు దిగ్భ్రాంతులైనారు. బ్రిటిష్‌నౌకలుగాని, ఇతర బ్రిటిష్ సైనిక దళాలుగాని తమదేశాన్ని జపాన్‌దురాక్రమణనుండి కాపాడలేవనే భావం భారతీయులందరికీ ఏర్పడిపోయింది.

క్రిప్స్ రాయబారం విఫలంకావడంతో పరిస్థితులు పూర్తిగా విష మించాయి. ఈ పరిణామం సహజమే. క్రిప్స్ ఏదో చేయాలనే పట్టుదలతో సత్సంకల్పంతోటే ప్రయత్నంచేశాడనీ, కాని ఆయన సఫలుడు కావడం, తద్వారా గొప్పవాడు కావడం గిట్టని కొందరు మధ్యలో ఆటంకాలు కలిగించారనీ భారతనాయకుల నమ్మకం. ఇది కేవలం గుడ్డినమ్మకం అని తోసివేయడానికి వీలులేదు. భారతనాయకు లీవిధంగా అభిప్రాయపడడానికి వారివద్ద కొన్ని దాఖలాలు ఉన్నవి. అలాంటి ఆధారాలు విదేశీపరిశీలకులు కొందరివద్దకూడా ఉన్నవి. 1942 దౌత్యం ఫలించివుంటే భారతదేశం స్వతంత్రదేశం అయ్యేది. క్రిప్స్ బ్రిటిష్‌ప్రధానమంత్రి అయ్యేవాడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు ఇది గిట్టదు. 1942 భారత రాయబారానంతరం క్రిప్స మాటే వినిపించలేదు. అజ్ఞాతవాసంలోకి వెళ్లిపోయాడు. ఈపర్యవసానం బ్రిటిష్ ప్రతీపశక్తులకు సంతోషకారణమైంది.

క్రిప్సుప్రతిపాదనలవల్ల భారతదేశానికి అద్యతనభావిలో సంప్రాప్తం కాగల ప్రయోజనాలు ఏమీలేవు. యుద్ధం సాగుతూఉన్నంతకాలం భారత దేశంలో ఎలాంటి మార్పులూ జరగవు. కాని యుద్ధం ముగిసిన తరువాత ఏదో ఒరిగిస్తామనే ఆశనుమాత్రం బ్రిటిష్‌వారు వాటిద్వారా కల్పింప

గలిగారు. ఆ భవిష్యత్తు స్వాతంత్ర్యం అయినా నిర్నిబంధమైనది కాదు. దాని కెన్నో పరిమితులు ఉన్నాయి. అయినా అప్పటికి అవే ఎక్కువని బ్రిటిష్ దైహార్దులు (టోరీలు) అభిప్రాయపడ్డారు.

క్రిప్స్‌రాయబారం విఫలం కావడంవల్ల భారతదేశంలో పరివ్యాప్తమైన నిస్పృహాభావంతోనూ, అసలు ఆయన సహజధోరణితోనూ "బ్రిటిష్ వారు భారతదేశంనుండి వైదొలగాలి" అని గాంధీజీ ప్రకటించారు. బ్రిటిష్ వారు తక్షణం భారతదేశంనుంచి వెళ్లిపోవాలనే గాంధీజీ అభిప్రాయం. తన అభిప్రాయాలను ప్రకటించడంలోగాని, ఒకరితో మాట్లాడుతూ ఉన్నప్పుడుగాని గాంధీజీ ఒక వరుసనుగాని, ఒక క్రమాన్నిగాని, ఒకపద్ధతిని గాని అనుసరింపరు. ఆక్షణంలో ఏది ఎలాతోస్తే అలా చెప్పివేస్తారు. ఆతరవాత తాను అన్న మాటలను ఆలోచిస్తారు. ఆలోచించినమీదట తాను అన్నది తప్పనిగాని, పొరపాటనిగాని భావిస్తే తక్షణం, తడవుకోకుండా నిర్భయంగా బాహాటంగా తాను పొరపడ్డానని, తప్పుచేశానని ప్రకటిస్తారు. "బ్రిటిష్‌వారు తక్షణం వెళ్లిపోవాలి" అనే కేకను ప్రజలకు అందజేసి ఎంతోకాలం కాకపూర్వమే తిరిగి తన అభిప్రాయాన్ని మార్చుకున్నారు. "యుద్ధం సాగుతూవుండగా బ్రిటిషువారిని ఈదేశంనుండి వెళ్లిపొమ్మని అనలేను" అని గాంధీజీ నాతోనే అన్నారు. తరువాత అనేకపర్యాయాలు అదే అభిప్రాయాన్ని వెల్లడించారు, "బ్రిటిష్‌వారిని తక్షణం పొమ్మనడం అక్షరాజ్యాలను ఆహ్వానించినట్లవుతుంది" అనికూడా మహాత్మాజీ ప్రకటించారు.

యుద్ధం పూర్తికాందే బ్రిటిష్‌వారు భారతదేశంనుండి వెళ్ళిపోవాలని గాంధీజీగాని, ఇతర భారతనాయకులుగాని కోరలేదు. యుద్ధం సాగుతూఉండగా భారతదేశానికి స్వాతంత్ర్యం లభించగలదని గాంధీజీగాని, ఆయనవర్గీయులుగాని ఆశించడం లేదు. అయితే వీరు కోరుతూఉన్నది ఏమిటి? అనే ప్రశ్న ఉదయించడం సహజమే. తక్షణం భారత కేంద్ర

జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయ మనే వీరు అడుగుతున్నారు. యుద్ధ వ్యూహంతోగాని, సైనికసంచలనంతోగాని ఈ ప్రభుత్వానికి ప్రమేయం ఉండనవసరంలేదనికూడా వీరు అన్నారు. ఈ ప్రభుత్వం వెంటనే చేసేపని ఏమంటే, "అక్షరాజ్యాలను ప్రతిఘటించడానికి జరుగుతూ ఉన్న ఈ యుద్ధంలో తక్షణవిజయాన్ని సాధించడానికి ఇతర మిత్రరాజ్యాలతో ఒడంబడికలు చేసుకోవడమే" అని గాంధీజీ తెలియజేశారు. ఆ విషయాన్ని అసందిగ్ధంగా ప్రకటించారు. యావత్తు ప్రపంచాన్నీ ఉద్దేశించే గాంధీజీ ఈ ప్రకటనను బహిరంగంగా చేశారు. ఈ విషయాన్ని స్వయంగా రాజప్రతినిధికి నివేదింప సంకల్పించారు. అందునిమిత్తం రాజప్రతినిధి దర్శనాన్ని అర్థించారు. కాని భారతదేశంలోని బ్రిటిష్ రాజప్రతినిధి గాంధీజీని చూడ నిరాకరించాడు.



పండిట్ నెహ్రూ

శాంతికాముకుఁ గనుక గాంధీజీ యుద్ధంచేయకపోవచ్చును. రాష్ట్రపతి మౌలానా ఆజాద్, పండిట్ జవహరలాల్ నెహ్రూ, సి. రాజగోపాలాచారి ప్రభృతులు సమరసన్నద్ధులే అనే విషయం గాంధీజీకి తెలుసును. "కరమున కరవాలంబూని జపాన్ సేనలను ఎదిరిస్తాను" అని పండిట్ నెహ్రూ బొంబైలో జరిగిన ఒక బ్రహ్మాండమైనసభలో ప్రకటించారు. ఆసభకు నేనూ హాజరైనాను. పండిట్

నెహూర్రి ఇంకా ఇలా అన్నారు: "కత్తి పట్టుకొని శత్రుసేనల నెదుర్కోవడం అనేది నేను సర్వస్వతంత్రుడనుగా ఉంటేనే చేయగలను."

1943 వ సంవత్సరం సెప్టెంబరులో ఫిలిప్పీన్స్ అధ్యక్షుడు మాన్యుల్ క్విజాన్ న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రికా విలేఖరికి చెప్పిన మాటలు పండిట్ నెహూర్రి ప్రకటనను జ్ఞాపకంచేసినవి: "నా ఫిలిప్పీన్సుదేశం స్వతంత్రంకానిపక్షంలో ఈ జపాన్‌యుద్ధంతో నాకు నిమిత్తమే లేదు" అన్నాడు. తమ స్వాతంత్ర్యాన్ని అమూల్యంగా భావించి, దాని సంపాదనకు, సంరక్షణకు పోరాడ ఆసియావారందరూ సిద్ధంగా ఉన్నారు. భారతీయులూ అవిధంగానే ప్రవర్తిస్తున్నారు. బ్రిటిషువారుకనుక ఈ ప్రధానవిషయాన్ని గుర్తిస్తే బ్రిటన్, భారతదేశం కలిసి పనిచేయడానికి వీలుంటుంది. ఒక దారి కనిపిస్తుంది.

యుద్ధం జరుగుతూ ఉన్నా, తక్షణం, పరిమితాధికారాలకోసనే కానివ్వండి, కేంద్రంలో జాతీయప్రభుత్వం ఏర్పాటుచేసి, యుద్ధం ముగిసిన తరువాత సంపూర్ణస్వాతంత్ర్యం ఇస్తామని అసందిగ్ధంగా, నమ్మకం కలిగేటట్లు 1942 లో బ్రిటన్ ఒక ప్రకటన చేసివుంటే ఆ సంవత్సరం వేసవిలో భారతదేశంతో సమాధానం కుదిరిఉండేది. గాంధీజీ, పండిట్ నెహూర్రికూడా రాజీకి ఆత్రంగానే ఉన్నారు. కాని బ్రిటిషువారు భారత జాతీయోద్యమాన్ని అణచివేయడానికి ఇదొక అవకాశంగా తీసుకున్నారు.

"గాంధీతత్వాన్ని ఈనాడు కాకపోతే రేపైనా మనం ఎదుర్కొని సమూలంగా నాశనంచేయాలి" అని 1935 వ సంవత్సరంలో విన్‌స్టన్ చర్చిల్ హెచ్చరించాడు. ఆపని సాధించడానికి ఇన్నాళ్లకు చర్చిలుకు అవకాశం లభించింది. గాంధీతత్వం భారత స్వాతంత్ర్యసాధనాకృషికి చిహ్నం. ఇప్పుడు చర్చిల్ ఆకృషినే ప్రతిఘటిస్తున్నాడు.

భారతీయులు స్వాతంత్ర్యాన్ని సమర్థించుకోగలరా లేదా అన్నది కాదు ప్రస్తుతప్రశ్న. భారతీయులు స్వాతంత్ర్యాన్ని భేషుగ్గా నిర్వహించుకో

గలరు; సమర్థించుకోనూగలరు. భారతదేశాన్ని స్వతంత్రరాజ్యంగా చేయ డానికి బ్రిటిషువారు తయారుగా ఉన్నారా? అన్నదే అసలు ప్రశ్న. భారత దేశం కేవలం బ్రిటనుకు సంబంధించినదట. భారతసమస్య కేవలం బ్రిటిషు సమస్యేనట. అందుచేతనే బ్రిటిషువారు భారతసమస్యను భారతదేశ ప్రయోజన దృష్ట్యాగాక బ్రిటిష్‌సామ్రాజ్యదృష్ట్యా పరిశీలిస్తున్నారు.

"ఫ్రీ వరల్డ్" (స్వేచ్ఛా ప్రపంచం) అనే మాసపత్రిక 1943 ఆగస్టు సంచికలో లార్డ్ లిట్టన్ భారతదేశ పరిస్థితులను అభివర్ణిస్తూ ఇలా వ్రాశారు: "భారతరాష్ట్రములు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నవి. రాష్ట్ర స్వపరిపాలనను అనుభవిస్తూన్నవి" ఇది పచ్చిఅబద్ధం. ప్రతిరాష్ట్రా నికీ అధిపతిగా ఒక బ్రిటిష్ గవర్నరు ఉన్నాడు. ఆయన సర్వాధికారి. మంత్రులను నియమింపవచ్చు; బర్తరపుచేయవచ్చు. ఇలా చేశా వేమని అడిగేవారు లేరు. 1942-వ సంవత్సరంలో సింధుగవర్నర్ ప్రవర్తనే ఇందుకు నిదర్శనం. సింధురాష్ట్రప్రధాని అల్లా బక్ష్. ఆయన ముస్లిం. రాష్ట్ర శాసనసభలో అధికసంఖ్యాకులు ఆయనపక్షాన ఉన్నారు. వారికి ఆయనలో పూర్తివిశ్వాసం ఉంది. అయినా సింధుగవర్నర్ ఆయన్ను బర్తరఫ్ చేశాడు. గవర్నర్ ఇలా ఎందుకు ప్రవర్తించాడు? సింధుప్రధాని చేసిన మహాపరాధం ఏమిటి? బ్రిటిష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ భారత దేశాన్నిగురించి చేసిన అమర్యాదకర ప్రకటనకు అసమ్మతిసూచకంగా అల్లాబక్ష్ తనకు లోగడ బ్రిటిష్‌వారు ప్రసాదించిన బిరుదులను వాపసు చేశాడు. సింధుగవర్నర్ విపరీతచర్యకు కారణం ఏమైనా ఉంటే ఇంతకు మించి ఏమీ లేదు. అల్లాబక్షును బర్తరపుచేస్తూ సింధుగవర్నరు జారీచేసిన ప్రకటన ఇలా ఉంది: "సింధుగవర్నరు సర్ హ్యూడౌకు ఇంక మార్గాంతరం లేదు. అల్లాబక్ష్ గవర్నరువిశ్వాసానికి ఇంకమీదట పాత్రుడుకాడు. కనుక ఇక ఆయన అధికారంలో ఉండటానికి తగడు. వీలునుగాదు." రాష్ట్రప్రధా నులకు శాసనసభల విశ్వాసంకంటే గవర్నరుల విశ్వాసమే చాలా ముఖ్యం.

బెంగాల్ గవర్నరు సర్ జాన్ హెర్బర్ట్ కూడా ఫజ్లుల్ హక్ విషయంలో ఇలాగే ప్రవర్తించాడు. 1943 మార్చి 29-వ తేదీన ప్రధానామాత్య పదవికి రాజీనామా ఇవ్వవలసిందిగా ఫజ్లుల్ హక్‌ను కోరాడు. ఫజ్లుల్ హక్ ఆ ప్రకారం ప్రధానామాత్యపదవికి రాజీనామా ఇచ్చాడు. రాజీనామా ఇవ్వడానికి పూర్వం ప్రధానమంత్రిగా తనకూ, గవర్నరు సర్ జాన్ హెర్బర్టుకూ 1943 జూలైలో జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలను ఫజ్లుల్ హక్ రాష్ట్ర శాసనసభలో వెల్లడించాడు. రాష్ట్ర గవర్నరుపై చాలా తీవ్రమైన ఆరోపణలు చేశాడు. గవర్నరుకు వ్రాసిన ఒక జాబులో ఫజ్లుల్ హక్ ఇలా ప్రకటించాడు: "మీరు మీ మంత్రులు లేనట్టే, స్వయం రాజా స్వయం మంత్రిలాగా వ్యవహరిస్తున్నారు. ప్రతివిషయంలోనూ మీరు కలుగజేసుకుంటున్నారు. భారత దేశపరిపాలన 1935-వ సంవత్సరపు ఇండియా చట్టాన్ని అనుసరించి జరుగుతూఉంది. ఆ చట్టప్రకారం రాష్ట్రమంత్రులకు గల అధికారాలు చాలా పరిమితములు. ఆ పరిమితాధికారాలను వినియోగించడానికైనా వీలుగాకుండా మీరు అడుగడుక్కూ అడ్డుతగులుతూ ఉన్నారు. ఇందువల్ల మంత్రులకు ఎంత చిరాకుగా ఉంటున్నదో కాస్త విచారిస్తే మీకే బోధపడుతుంది." తాను గవర్నరుకు వ్రాసిన మరొక జాబులోని మరికొన్ని విషయాలనుకూడా ఫజ్లుల్ హక్ ప్రకటించాడు: "ఈ పని పూర్తిగా చట్టవిరుద్ధం. రాష్ట్ర స్వపరిపాలనను మీరు సక్రమంగా సాగనివ్వాలి. అంతేగాని కేవలం నిరంకుశాధికారాలను కప్పిపుచ్చేందుకు రాష్ట్ర స్వపరిపాలనను ఒక తెరమాత్రంగా వినియోగించరాదు."

భారత ప్రజానీకం ఎన్నుకున్నట్టి ఒక రాష్ట్రప్రధాని బ్రిటిష్‌వారు నియమించిన ఒక గవర్నరుకు లొంగిపోవలసివచ్చింది.

హిందూ ముస్లింసఖ్యతలో విశ్వాసం కలిగి తమతమ రాష్ట్రాలలో సంకీర్ణమంత్రివర్గాలను ఏర్పాటుచేసి పాకిస్తానును, జిన్నాగారి ముస్లిం

లీగునూ ప్రతిఘటించడానికి తలపడిన ముస్లింప్రధానులను ఇద్దర్నీ బ్రిటిష్ గవర్నరులు ఇలా బర్తరఫు చేయడం గమనింప తగ్గ విషయం.

భారత దేశంలోని రాష్ట్రాలకు బ్రిటిష్‌వారు నామమాత్రపు స్వపరిపాలననే ఇచ్చారు. అసలు ఉన్న అధికారమే కొద్ది. ఆ కొద్ది అధికారం కూడా చాలా పరిమితం. లార్డ్ లిట్టన్ గొప్పగా చెప్పిన రాష్ట్ర స్వపరిపాలన ఏ కోశానా కనిపించదు. కేంద్రంలో ఈ నామమాత్రపు స్వపరిపాలన అయినా లేదు.

తమ్ము తాము పాలించుకోవడానికి భారతీయులు తగివున్నారని సాధికారంగా బ్రిటిష్‌వారు అంగీకరించారు. 1939-వ సంవత్సరం అక్టోబరు 26-వ తేదీన బ్రిటిష్ కామన్సుసభలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ భారతదేశం విషయమై ఇలా చెప్పాడు: "కేవలం న్యాయధర్మాలనూ, సూత్ర సిద్ధాంతాలనూ బట్టి అయితే ఈ నాడు భారతదేశం స్వపరిపాలనకు అర్హత కలిగి ఉండలేదని ఎవ్వరూ అనలేరు. భారతీయులు తమ్ముతాము పరిపాలించుకోవడానికి అన్నివిధాలా తగివున్నారనీ, అలా పరిపాలించుకోగలరనీ అంగీకరించినతరువాత భారతీయులు ఆ స్వపరిపాలనను అడుగుతూఉంటే మనం చెప్పగల సమాధానం ఏమిటి? ఆ సమాధానం ఒక్కటే—న్యాయధర్మాలనూ, సూత్రసిద్ధాంతాలనూ నిర్లక్ష్యంచేసి కేవలం స్వప్రయోజనం కొరకు భారతదేశాన్ని మన సామ్రాజ్య భాగంగా ఉంచుకోదలచాం. అదే మన సమాధానం.

భారతదేశంలో బ్రిటిష్‌వారు ఈమధ్య అనుసరిస్తూఉన్న విధానాన్నీ, తీసుకుంటూ ఉన్న చర్యలను పరిశీలిస్తేమాత్రం బ్రిటిష్‌వారు భారతదేశం నుండి వెళ్లిపోతారని అనుకోవడానికి ఎలాంటి అవకాశమూ కనిపించదు. కాంగ్రెస్ జాతీయోద్యమాన్ని అణచివేసి, ప్రతిపక్షశక్తిగా తయారైన ముస్లింలీగును బ్రిటిష్‌వారు బలపరుస్తూవున్నారు. బ్రిటిష్‌వారు తమ సామ్రాజ్యాన్ని వదులుకోవడానికి సిద్ధంగాలేరని ఇందువల్ల స్పష్టమవుతూ ఉన్నది.

బ్రిటిష్‌వారు భారతదేశంలో తమ అధికారాన్ని వదులుకోరని భారతీయులు అందరూ అభిప్రాయపడుతున్నారు. క్రిప్సుప్రతిపాదనలుకూడా ఈ అభిప్రాయమే సరిఅయిందని రూఢిచేసినవి. క్రిప్సు ప్రతిపాదనలవల్ల భారతీయులకు మధ్యస్థకాలంలో కలుగగల ప్రయోజనం ఏమీ లేదు. ఎటొచ్చీ భారతదేశానికి క్రిప్సుప్రతిపాదనలవల్ల వచ్చేదేమిటీ అంటే— యుద్ధం ముగిసినతరువాత భారతదేశం ఒక రాజ్యాంగవిధానాన్ని తయారు చేసుకొని బ్రిటిష్ అధినివేశరాజ్యంగా ఉండవచ్చు. కాని రాజ్యాంగ రచనా సంఘసభ్యుల్లో కనీసం నాల్గోవంతుమంది అయినా సంస్థానాధీశ్వరులు నియమించినవారౌతారు. రాజ్యాంగపరిషత్తుకార్యక్రమం అవిఘ్నంగా, సాఫీగా సాగకుండా చేయడానికి ఈ సభ్యులు సాధనాలుగా ఉంటారని భారత జాతీయవాదుల అభిప్రాయం. ఈ రాజ్యాంగ పరిషత్తు తయారుచేసే రాజ్యాంగం తమకు తృప్తికరంగా లేకపోతే సంస్థానాధీశ్వరులు భారత సమితిలో చేరకుండా విడిగా ఉండిపోవచ్చును. బ్రిటిష్‌ప్రభుత్వంతో సరాసరి వ్యవహారం చేసుకోవచ్చు. బ్రిటిష్‌వారి రక్షణను పొందుతూ ఉండవచ్చును. ముస్లిములుకూడా అదే విధంగా భారతసమితితో సంబంధం లేనట్టి ఒక ప్రత్యేకరాజ్యాన్ని ఏర్పాటుచేసుకోవచ్చును. ఈ రెంటివల్లా క్రిప్స్‌ప్రతిపాదనలో భారతజాతీయ స్వాతంత్ర్యానికి సంబంధించిన అంశాలు ఉపయోగంలేవి వైపోయినవి.

యుద్ధానంతరం భారతదేశంలో తన ప్రతిపాదనలవల్ల రాగల మార్పును వివరిస్తూ సర్ స్టాఫర్డ్ క్రిప్స్ అధికారరీత్యానే ఇలా ప్రకటించాడు: "ఈ ప్రతిపాదనలను అనుసరించి యుద్ధానంతరం భారతదేశం బ్రిటిష్ అధినివేశరాజ్యంగా తయారైతే, అలా తయారైన భారతసమితి ప్రప్రథమంగానే బ్రిటిష్‌సామ్రాజ్యంనుండి వైదొలగుతూ తీర్మానం చేసుకోవచ్చు." కాని 1943 మే 6 వ తేదీన భారతకార్యదర్శి లియోపాల్డ్ అమెరీ అమెరికా నారీమణుల సభలో ప్రసంగిస్తూ ఇదేవిషయంమీద ఇలా తన

అభిప్రాయాన్ని వెల్లడించాడు: "యుద్ధానంతరం భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందినా ఆ దేశం స్వశక్తిపై, తన కాళ్ళమీద తాను నిలబడేందుకు కొంత వ్యవధి కావలసివస్తుంది. అంతవరకూ భారతదేశం బ్రిటిష్ కామన్వెల్తులో ఉండిపోకతప్పదు."

కొందరు బ్రిటిష్‌వారు భారతదేశంసంగతి వచ్చేసరికి ఖచ్చితంగా ఏమీ చెప్పరు. సర్ స్టాఫర్డ్ క్రిప్సు భారతదేశం తక్షణం అధినివేశ ప్రతిపత్తిని పొందుతుందనేమో అంటాడు. ఆ అధినివేశ ప్రతిపత్తినికూడా భారతదేశం క్రమంగా పొందుతుందని లియోపాల్డ్ అమెరీ అంటాడు. కాని బ్రిటిష్‌ప్రధాని వీరిద్దర్నీ కాదంటున్నాడు. బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని విన్‌స్టన్ చర్చిల్ విచ్ఛిన్నం కానివ్వడు. 1935 వ సంవత్సరం జనవరి 30 వ తేదీన భారతదేశాన్నిగురించి చర్చిల్ ఇలా వ్రాసివున్నాడు: "నేడు కెనడా, ఆస్ట్రేలియాలు అనుభవిస్తున్న అధినివేశ ప్రతిపత్తి భారతదేశం విషయంలో మన చూపు ఆనినంతలో ఏదో కన్పించీ కన్పించని అంతిమ లక్ష్యంగా మాత్రమే గోచరిస్తున్నది."

భారతదేశానికి రాజకీయస్వాతంత్ర్యం ఇచ్చేవిషయంలో బ్రిటిష్‌వారి సంకల్పాలను, ఉద్దేశాలను రాజకీయ చైతన్యం పొందిన భారతీయులు ఎవ్వరూ ఎందుకు నమ్మరో, నమ్మడంలేదో తెలుసుకోవడం తేలికే. రోజు రోజుకూ భారతదేశంలో నిస్పృహ, నిరాశ ఎక్కువైపోవడానికి కారణాలను గ్రహించడంకూడా అంత కష్టమైన పనిగాదు.

అసలు భారతదేశ అవసరం ఒక్క బ్రిటనుకేకాదు. ఐక్యరాజ్యాలన్నింటికీ భారతదేశ అవసరం ఉంది. అమెరికను పత్రిక "న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్" 1943 జూన్ 9 వ తేదీన ఈ విషయమై ఈవిధంగా సంపాదకీయవ్యాసంలో ప్రకటించింది: "జపాన్ సైనికబలాన్ని పూర్తిగా విధ్వంసంచేయడానికి మనంచేసే ప్రయత్నాలు ఫలించడం చాలావరకు భారతదేశ రాజప్రతినిధి తన రాజ్యంలో శాంతిభద్రతలను నెలకొల్పి భారత

ప్రజల సహకారాన్ని ఎంతవరకు పొందగలుగుతాడో దానిపై ఆధారపడి ఉంటుంది."

పైపైన శాంతిని ఏర్పాటుచేయడం అంగ, ఆయుధబలంవల్ల సాధ్యమే. కాని ప్రజల సహకారాన్ని పొందడం రాజకీయచతురతవల్లనే సాధ్యం.

స్వేచ్ఛ, మానవత్వం, న్యాయం, ధర్మం మొదలైనవాటిల్లో నమ్మకం గలవారందరూ బ్రిటిష్‌ప్రభుత్వ భారతవిధానాన్ని తీవ్రంగా విమర్శి స్తున్నారు. మామూలురోజుల్లో అధికారులు తమ చర్యలనూ, విధానాలనూ సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తూవుంటారు. యుద్ధకాలంలో నిందను ఇతరులపై వేసి "పంచమాంగదళం" అని కేకలువేస్తారు.

బ్రిటిష్‌ప్రభుత్వ ప్రచారకశాఖామంత్రి బ్రెండన్‌బ్రాకెన్ 1943 లో చర్చిలుతోబాటు క్విబెక్ సమావేశానికి హాజరైనాడు. అక్కణ్నుంచి న్యూయార్క్ వచ్చి బ్రిటిష్‌ప్రభుత్వ భారతవిధానాన్ని విమర్శించేవారికి సమాధానం ఇవ్వడానికి ప్రయత్నించాడు. బ్రిటిష్‌ప్రభుత్వ భారతవిధానాన్ని విమర్శించేవారు ఐక్యజాతుల ఉద్యమానికి మహాపచారం చేస్తున్నారని ప్రకటించాడు. ఎలాంటి విమర్శలకైనా ఇలాంటి సమాధానాలు ఇవ్వడానికి యుద్ధం మహా అనుకూలంగా ఉంటుంది. కాని ఈ సమాధానాలు ఏమాత్రం నమ్మదగ్గవిగా ఉండవు.

కోట్లాదిప్రజలు భారతస్వాతంత్ర్య ఉద్యమగతిని శ్రద్ధాళువులై పరిశీలిస్తూ ఉండగా బ్రిటిష్ అధికారులు గాంధీజీని, పండిట్‌నెహ్రూని ప్రభృతులను, ఇతర కాంగ్రెస్‌నాయకులను నిర్బంధించారు. నేరారోపణ

జరుగలేదు. విచారణ అనేది లేదు. కారాగారవాసానికి కాలపరిమితికూడా లేదు. ఈవిధంగా చేయడం వాస్తవంగా ఐక్యజాతుల ఉద్యమానికి తీరని అపచారం చేసినట్లే.

స్వాతంత్ర్యంకొరకు, స్వేచ్ఛగా జీవించే హక్కుకొరకు తహతహ లాడుతూ ఉన్న భారతీయులను కొరడాలతో కొట్టడం, తుపాకులతో కాల్చి వేయడం ఏవిధంగానూ ఐక్యజాతులకు మేలుచేసినట్లు కాదు; కానేరదు. భారతగ్రామాలపై బ్రిటిష్ విమానాలు దాడిచేసినవని, భారతప్రజను బ్రిటిష్ వారు విమానాలనుంచి మరఫిరంగులతో కాల్చివేశారని కామన్సుసభలో ప్రకటిస్తే ఆమోదసూచకంగా బ్రిటిష్‌టోరీలు హర్షధ్వానాలు చేశారు. ప్రపంచం అటు మరఫిరంగుల మార్మోతలనూ విన్నది; ఇటు ఆమోదార్థకమైన హర్షధ్వనులనూ విన్నది. ఈసంఘటన ఐక్యజాతులకు మేలు చేసిందా ?

బ్రిటిష్‌వారు గాంధీమహాత్ముని, ఆయనఅనుచరులను, వేలాది కాంగ్రెస్‌వారిని బందీచేసి మాసాలు గడిచిపోయినవి. భారత ఫెడరల్ కోర్టు ప్రధానన్యాయమూర్తి సర్ మారిస్ గ్వియర్ నాయకుల నిర్బంధం శాసనసమ్మతం కాదనీ, చట్టవిరుద్ధం అనీ తీర్పుచెప్పాడు. ఆతీర్పు ననుసరించి బ్రిటిషు రాజప్రతినిధి నిర్బంధితులను కారాగారవిముక్తులను చేశాడా? లేదు. శాసనసమ్మతం కాని తనచర్య శాసనసమ్మతం కాగలందులకు మరోచట్టంచేశాడు. 1942 ఆగస్టు అల్లరులను చట్టబద్ధంచేస్తూ 1943 ఏప్రిల్ 28 వ తేదీన ఒక కొత్త ఆర్డినెన్సు చేశాడు. చేస్తూవున్న యుద్ధం ప్రజాస్వామ్య రక్షణకని అంటూ భారతదేశంలో ఈవిధంగా చేయడం ఐక్యజాతుల ఉద్యమానికి సహాయం చేయడమవుతుందా?

కనుకనే రోజురోజుకు చర్చిల్ ఋజువర్తనానికి, నైజానికి ఎక్కువ అధికారం సంక్రమిస్తూ ఉంది. అనవసరంగా లేనిపోని ఆరోపణలు చేయడానికి ఆయన దిగడు. భారతదేశం స్వతంత్రం కావాలనేవారు పంచ

మాంగదళంవారవిగాని, జర్మనీ ప్రచారకశాఖమంత్రి డాక్టర్ గోబెల్స్ మిత్రులనిగాని ఆయన నిందించడు. గాంధీజీ జపాన్ పక్షపాతేమో అనే అనుమానంమీద ఆయన గాంధీప్రతికూలుడు కాలేదు. మహాత్ముడు భారత స్వాతంత్ర్యాన్ని కోరుతూవున్నాడు గనుక చర్చిలుకు ఆయనంటే పడదు.

సంగతిసందర్భాలు ఎరుగని అమాయకప్రజల నిమిత్తం గాంధీజీ జపాన్ పక్షపాతి అని ప్రచారం జరిగింది. అంతేగాని అందులో సత్యం ఏమీ లేదు. గాంధీజీ జపాన్‌పక్షపాతి అనేది పచ్చి అబద్ధం. గాంధీజీ నిజంగా జపాన్ పక్షపాతే అయితే జపానుతో దశాబ్దంగా యుద్ధంచేస్తూవున్న చాంగ్‌కై షేక్ భారతదేశానికి స్వాతంత్ర్యం ఇమ్మని మిత్రరాజ్యాలను కోరడు. గాంధీజీకి పక్షపాతం అంటూ వుంటే, అది బ్రిటిష్ పక్షపాతమే. గాంధీజీ బ్రిటనుకు అనుకూలుడు. అమెరికాకు అనుకూలుడు. బ్రిటన్ అమెరికా ప్రజాస్వామికస్వాతంత్ర్య సారస్వతంలో మహాత్ముడు మునిగి తేలారు. అసలు యథార్థం ఏమంటే ఆయన భారతపక్షపాతి. అంతటి పక్షపాతం తగదేమో అని నాకు అనిపించింది. నేను గాంధీజీఅతిథిగా ఒక వారంరోజులు ఉన్నాను. ఆసమయంలో ఆయననిత్యకృత్యాలను, వ్యవహారనిర్వహణవిధానాన్ని శ్రద్ధగా పరిశీలించాను. ఆయన రేడియో విన్నట్టుగాని, పత్రికలు చదివినట్టుగాని నేను చూడలేదు. అసలు ఆయన ఉంటున్న ఆ పల్లెటిదిక్కులో రేడియోయే లేదు. అప్పుడప్పుడు దినపత్రికల వార్తాశీర్షికలనుమాత్రం చూస్తూవుంటారు, ఆయనఅపేక్షలు ప్రధానంగా భారతదేశానికి మాత్రమే సంబంధించివున్నవి. జాతీయత్వంలేని ప్రజలు తీవ్ర జాతీయవాదులౌతారు. భారతీయనాయకులు చాలామంది కేవలం తమదేశంవిషయమే ఆలోచించుకుంటూ ఉన్నారు. ప్రత్యక్షంగా చూచానుకూడా. వారి మనస్సు భారతస్వాతంత్ర్యంమీదనే లగ్నమైఉంది. వారి దృష్టి ఆ స్వాతంత్ర్యప్రాప్తికి దోహదంచేయగల సాధనలమీదనే కేంద్రీకృతమైంది. ఇతరవిషయాలు వీరికి అవసరంలేదు. ఎవరు ఎలా

పోయినా వీరికి బాధలేదు. వీరందరిదీ ఒకపద్ధతి; పండిట్ నెహ్రూది వేరొకపద్ధతి. వీరివలె భావించేవారు, వీరిని అనుసరించేవారు అభినవ భారతదేశములో చాలామంది ఉన్నారు. దేశపు ఎల్లలను దాటి చూడగల దృష్టి ఉన్నది. అంతర్జాతీయవాది, కార్యవాది. తీవ్ర ఫాసిస్టువ్యతిరేకి. ఉన్నత ప్రపంచంలో మహోన్నత భారతదేశాన్ని స్థాపించాలని ఆయన వాంఛిస్తున్నాడు. ఉన్నతప్రపంచం లేని మహోన్నత భారతదేశంగాని, ఉన్నత భారతదేశంలేని ఉన్నతప్రపంచంగాని సాధ్యంగాదని నెహ్రూ గుర్తించాడు.

మహాత్ముని లక్ష్యం భారతస్వాతంత్ర్యం, పండిట్ నెహ్రూ లక్ష్యం ఇంతకు మించివుంది. మహాత్ముడు సిసలైన హిందువు. శాంతికాముకుడు. జపానువారు అనుసరించే సైనికపద్ధతి, జరిపే దౌర్జన్యచర్యలు, చేసే అమానుషకృత్యాలు గాంధీజీకి జపాన్ అంటే ఒకవిధమైన సరిపడని భావం కలిగించినవి. చర్చిల్ నాజీపక్షపాతి అంటే ఎంత సబబుగా ఉంటుందో గాంధీజీని జపాన్‌పక్షపాతి అన్నా అంత సబబుగానేవుంటుంది. చర్చిలును జెయిల్లోవుంచి, ఆయనపై వేసే నిందలకు సమాధానం ఇచ్చే అవకాశం లేకుండాచేసి ఇలా నిర్విరామంగా ప్రచారం సాగిస్తే కొందరు చర్చిల్ నిజంగా నాజీపక్షపాతే కాబోలు అని అనుకోవచ్చు. కొంతవరకు ఈ ప్రచారాన్ని విశ్వసింపనూవచ్చు.

అమెరికావారి నిర్లిప్తవాదమూ, బ్రిటిష్‌వారి సామ్రాజ్యవాదమూ కూడా పోయి నిజమైన ప్రపంచ సహకారం ఏర్పడితేగాని అమెరికా వారికిగాని, బ్రిటిష్‌వారికిగాని, తమకుగాని మోక్షంలేదని చైనాఅధినేత జనరలిస్సిమో చాంగ్ కై షేక్ విస్పష్టంగా ప్రకటించాడు. అలా ఆయన అన్నాడు గనుక చాంగ్ కై షేక్ జపాన్‌పక్షపాతి అయితే గాంధీజీని కూడా జపాన్‌పక్షపాతి అని అనవచ్చును. గాంధీజీ స్వానుభవంమీద తీవ్ర సామ్రాజ్య వ్యతిరేకి అయినాడు. వీరివిషయం ఇలా ఉంచండి.


చాంగ్‌కైషేక్

ప్రస్తుతం ఇండియా కార్యదర్శిగా చర్చిల్ మంత్రివర్గంలో ఉన్న లియోపాల్డ్ అమెరీ మంచూరియామీద జపాన్ జరిపిన దురాక్రమణను సమర్థించాడు. 1933-వ సంవత్సరంలో కామన్సుసభలో ఉపన్యాసం చేస్తూ ఇలా చెప్పాడు: "మంచూరియాపై జపాన్ దండెత్తవలసింది కాదనీ, చైనా జాతీయ విజృంభణనుండి రక్షణ పొందుటకు జపాన్ ఇలా చేసిఉండవలసిందికాదనీ అనగలవారు మనలో ఎవరున్నారు? జపాన్‌చర్యను మనం ఖండిస్తే, భారతదేశంలోనూ, ఈజిప్టులోనూ మనం జరుపుతూ ఉన్న చర్యలు, అనుసరిస్తూన్న విధానం ఖండనార్హం కాదా? అదీ విమర్శింప తగేఉన్నది."

చైనా జాతీయ విజృంభణను జపాన్ ప్రతిఘటించడాన్ని భారతదేశ, ఈజిప్టుదేశాల జాతీయతత్వంవిషయమై బ్రిటను అనుసరిస్తూన్న విధానంతో పోల్చడంవల్ల బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఊహాపోహలు, భావాలు, ఆలోచనలు ఎలా ఉన్నవో, ఉంటవో తెలిసిపోయింది. బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు తమ పాత్రకు తగ్గట్టుగానే జపాన్ సామ్రాజ్య తత్వాన్ని, తమ అపేక్షలకు భంగంకలుగదనే ధైర్యం, నమ్మకం ఉన్నంతవరకూ సమ

ర్థిస్తూ, బలపరుస్తూ వచ్చారు. కాని రెండు సామ్రాజ్యతత్వాలు విజృంభిస్తూఉంటే ఒకదాని విజృంభణ రెండవదానికి ప్రమాదకరంగానే ఉంటుంది. ఘర్షణ అనివార్యం. ఆ సంఘర్షణే ద్వితీయ ప్రపంచ సంగ్రామం. దురాక్రమణకు దుమికే సామ్రాజ్య శక్తిగాక, తన్నుతాను రక్షించుకొనడానికి ప్రయత్నించే సామ్రాజ్యశక్తి కూడా అంతర్జాతీయ సంఘర్షణలకు దారితీస్తుంది. ఈ రెండూ మహాపాతకాలే. మనలను రక్షించడానికి రణరంగంలో రక్తాన్ని ధారపోసి ప్రాణాలను కోల్పోయిన మన సైనికులు యావన్మందీ ఈ పాతకద్వయాన్ని తీవ్రంగా నిరసిస్తూ వచ్చారు. ఇప్పటికీ నిరసిస్తూనే ఉన్నారు.

భారతదేశంలో అమెరికాపదాతిదళం, వైమానికదళంకూడా ఉంది. వేలాది అమెరికాసైనికులు ఈ దేశంలో ఉన్నారు, చైనాసైనికులు కూడా చాలామంది ఉన్నారు. జపానుపై దండయాత్ర సాగించడానికి భారతదేశం మిత్రసైనికులకు మంచి మాటుగా ఉంది. అలాంటి భారతదేశం యుద్ధనిర్వహణంలో సహకరించకపోతే ఈ యుద్ధం చాలాకాలం సాగవచ్చు. దీర్ఘయుద్ధ ఫలితాలను అమెరికా, చైనా, ఫ్రాన్స్, బ్రిటన్ దేశాలు అన్నీ అనుభవింపవలసి వస్తుంది. ఆ కారణంగానే భారత సమస్యతో బ్రిటనుకు ఎంత సంబంధం ఉందో, ఫ్రాన్స్, చైనా, అమెరికాలకూ అంత సంబంధం ఉన్నది. ఒక్కమాటలో భారత సమస్య ప్రపంచ సమస్య. ఇదే విషయాన్ని చాలా విస్పష్టంగా, ఖచ్చితంగా, గట్టిగాకూడా ప్రముఖ బ్రిటిష్‌పత్రికా రచయిత హెచ్. యన్. బ్రెయిల్స్‌ఫర్డ్ ఈ విధంగా ప్రకటించాడు: "భారతసమస్య ఒక్క బ్రిటనుకేగాక, ఐక్యరాజ్యా లన్నింటికీ సంబంధించిన దని నేను అనుకుంటున్నాను. భారతదేశ భవిష్యత్తు విషయమై అమెరికా, చైనాకూడా కొంత పనిచేయవచ్చును."

భారతదేశ సంఘటనలు భవిష్యచ్ఛాంతి యాపును దిద్దవచ్చు. లేదా అసలు శాంతినే పూర్తిగా నిర్మూలింపవచ్చు. కనుకనే రూజ్‌వెల్ట్, చాంగ్

కై షేక్, ఫిలిప్పీన్స్ అధ్యక్షుడు మాన్యుయల్ క్విజాన్, అమెరికా రాజ్యాంగ వేత్తలు కార్డెల్‌హల్, సమ్నర్ వెల్స్, హెన్రీ వాలెస్, వెండెల్ విల్కీ, లూయీ జాన్సన్, విలియం ఫిలిప్స్ ప్రభృతులు యావన్మందీ భారతదేశ పరిస్థితులనుగురించి ఆందోళన చెందుతూఉన్నారు. ఎందు నిమిత్తం ఈ యుద్ధం జరుగుతూఉందో, శాంతి నిర్మూలనం ఎంత సులభమో గ్రహించినవారు బ్రిటిష్ ప్రభుత్వ భారత విధానాన్ని విమర్శిస్తూ ఉన్నారు.



కార్డెల్‌హల్

ఈ యుద్ధంలో బ్రిటిష్ సైనికులు నిరుపమానమైన ధైర్యసాహసాలను ప్రదర్శించారు. నిజానికి బ్రిటిష్ వారు దేనికైనా తగుదురు. ఎంతటి నిశితవిమర్శలనైనా మందహాసం చేసి స్వీకరిస్తారు. కార్యవాదులు. వారికి ఆ శక్తి మొదట్నుంచీ ఉంది. తమ తప్పులను తాము తెలుసుకోగలరు బ్రిటిష్‌వారు. విమర్శలను సహించగలరు. వారి నాగరికతా విశిష్టత అదే. యూరపియన్ జాతులు కొన్నింటిలో ఈ సద్గుణం, మంచిలక్షణం లోపించింది. బ్రిటిష్‌వారు ఈ యుద్ధంలో పరాజయాన్ని పొందరనే అందరూ ఆశిస్తున్నారు. స్వేచ్ఛగా విమర్శన చేయగల హక్కులకోసరంకూడ మనం ఈయుద్ధం సాగిస్తున్నాం. నియంతృత్వంలో ప్రభుత్వాన్ని ఎవ్వరూ

విమర్శించరు. విమర్శించినా మొదటివిమర్శతోనే ఆఖరు. బ్రిటిష్ తాత్వికు లలో, రాజకీయవేత్తలలో ప్రభుత్వవిధానాన్ని విమర్శించేవారు పలువు రున్నారు. బ్రెయిల్స్ ఫర్డ్, హెరాల్డ్ లాస్కీ, ఆరిన్ బెవాన్, లార్డ్ స్ట్రబోల్గి ప్రభృతులు బ్రిటిష్ప్రభుత్వ భారతవిధానాన్ని చాలా తీవ్రంగా విమర్శిస్తూ ఉంటారు. అంతమాత్రాన వారు బ్రిటిష్ వ్యతిరేకులు కారు. అదేవిధంగా అమెరికావారూ. నామటుకు నేను బ్రిటిష్వ్యతిరేకుణ్ణి కాను. నేను అమె రికా అధ్యక్షుడు రూజ్ వెల్ట్ విధానాన్ని విమర్శించవచ్చు. కాని, అలా విమ ర్శించినందువల్ల అమెరికా ప్రతికూలుడనా? కాదు. నాకు టోరీలు అంటే గిట్టదు. సామ్రాజ్యవ్యతిరేకిని నేను, ఈ యుద్ధం ఇంకా తీవ్రంగా, సత్వర విజయానికి దోహదం చేయగలవిధంగా సాగాలనే నా ఆందోళన; నా తాప త్రయం. అవే నా విమర్శలలో కనిపిస్తూ ఉంటవి. సక్రమయుద్ధనిర్వహ ణకు, సత్వర విజయసాధనకు బ్రిటిష్వారు భారతదేశంలో అనుసరిస్తూ ఉన్న విధానం ప్రతిబంధకంగా ఉంది. అవరోధాలను కల్పిస్తున్నది. కను కనే మన యుద్ధలక్ష్యాలనుగురించి ఐక్యరాజ్య ప్రతినిధులు చేసిన ప్రకటన లను ప్రపంచప్రజలు యావన్మందీ శంకిస్తున్నారు. ఈ సంగ్రామఫలితంగా సంప్రాప్తంకాగల ప్రయోజనాలను భారతీయులూ, వారితోబాటు లక్షలాది ఇతరప్రజలూ అనుమానంతో చూస్తున్నారు.

సామ్రాజ్యవిచ్ఛిత్తిని సహించనన్న చర్చిల్ప్రకటన కర్ణకఠోరంగా ఉన్నా, ఆప్రకటనలో ఒక్క సుగుణం ఉంది. దాపరికం లేకుండా, కుండ బద్దలుకొట్టినట్టు ఉన్న సంగతిని అసందిగ్ధంగా, స్పష్టంగా చెప్పివేస్తాడు చర్చిల్. అక్షరాజ్యాలను హతమార్చి భారతదేశాన్నిమాత్రం అట్టే ఉంచు కోవాలని చర్చిల్ అనుకుంటున్నాడు. ఈ రెండూ పరస్పర విరుద్ధ మైనవని, రెండూ సాధ్యంకానివని ఆయన అనుకోవడం లేదు. అదొక దృక్పథం. ఇందుకు భిన్నమైన ఇతర దృక్పథాలూ ఉండవచ్చు.

మనస్ఫూర్తిగా, త్రికరణశుద్ధిగా, వళ్లుదాచుకోక అహర్నిశలూ తమ

దేశానికి సేవచేస్తూన్న బ్రిటిష్‌వారిని భారతదేశంలో చాలామందిని చూచాను. భారతదేశానికి చాలాకాలంగా మేలుచేస్తున్నామని వీరి విశ్వాసం. వీరిలో ప్రముఖులుగా ఎన్నదగినవారు బహు కొద్దిమందే. కాని యావన్మందీ తమదేశం అంటే ప్రాణాలు అర్పించడానికి సిద్ధంగా ఉన్నారు, అందరూ ప్రభుభక్తిపరాయణులే. రాజప్రతినిధిమటుకు రాజప్రతినిధి, పాపం, ఆఖరుకు ఒక్క మంచిమాటైనా దక్కలేదుగాని, అనేకసంవత్సరాలు గంటలకొద్దీ నిర్విరామంగా పనిచేస్తూవచ్చాడు. తాను పాలించిన దేశం దారుణమైన క్షామాన్ని ఎదుర్కొనుచున్న సమయాన, లక్షలాది ప్రజలు క్షుధార్తులై మరణిస్తూవున్న రోజుల్లో వెళ్లిపోవలసిరావడం ఆయనకు కష్టంగానే ఉంటుంది.

భారతదేశంలోని బ్రిటిషు అధికారులు ఎంతటి త్యాగాన్నిచేశారో - యుద్ధంలో విజయాన్ని సాధించడానికి - ఒక్క నిదర్శనం వివరిస్తాను. భారతదేశంలోని బ్రిటిష్ రాజప్రతినిధి ఆంతరంగిక కార్యదర్శి సర్ గిల్బర్ట్ లైత్ వైట్, రాజప్రతినిధికి ఇంచుమించు కుడిభుజమైన మేజర్ జనరల్ మోల్స్‌వర్త్-వీరుభయులకూ వాస్తవానికి తక్కువేమీ లేదు. కాని యుద్ధకార్యాలకు అత్యవసరమైన "గాసొలైన్"ను యుద్ధంకొరకు నిలవచేద్దామని ఇద్దరూ మండుటెండల్లో బైసికిళ్ళమీద ఆఫీసులకు పోయివస్తూవుండేవారు. నాకే ఆశ్చర్యం వేసింది వీరి త్యాగం చూస్తే. తమసుఖమే ప్రధానంగా ఎంచితే, స్వంతకార్లున్నవి. నడిపేవారున్నారు. ఇతరులకు లభించకపోయినా వీరికి ధారాళంగా దొరుకుతుంది "గాసొలైను." కాని, వీరికి బ్రిటన్‌విజయమే పరమలక్ష్యం,

బ్రిటిష్ సంప్రదాయ విధానాలకు కట్టుబడి, బ్రిటిష్‌సామ్రాజ్యాపేక్షల రక్షణకు బద్ధులైన నిజాయితీ గల బ్రిటిష్‌వారు కొన్ని పురుషాంతరాలు భారతదేశాన్ని పరిపాలించారు. వారు నోచుకొన్నంతగా వారికి భారతీయుల సహకారం లభించలేదు. తమపై అధికారం చలాయిస్తున్న పరదేశి

ప్రక్కను నిలబడేందుకు భారతీయులు సందేహిస్తున్నారు. కాని బ్రిటిష్ అధికారులు ఎంతటి సహకారాన్ని ఆశించారో అంతటి సహకారం వారికి లభించింది.

భారతదేశం పరుల పాలనకిందనే ఉండకతప్పనిసరి అయితే బ్రిటిష్‌పాలనకింద ఉండటమే మంచిది. నేను ప్రత్యేకంగా కొందరు పాలకులనుగాని, ఒకజాతినిగాని విమర్శించడం లేదు. జాతీయతత్వదృక్పథంతో నేను ఈ సమస్యలను విచారించను; విమర్శింపను. నాకు స్పెయిన్ అంటే అభిమానం లేదు. కాని స్పానిష్ లాయలిస్టులు అంటే నాకు చాలా అభిమానం ఉంది. కావడానికి జనరల్ ఫ్రాంకోకూడా స్పెయిన్ దేశస్థుడే. కాని ఆయనంటే నాకు గిట్టదు. నేను పూర్తిగా ఫ్రాంకో వ్యతిరేకిని. నేను ఇంతవరకూ విమర్శిస్తూఉన్నది బ్రిటనును కానేకాదు. భారతదేశాన్ని బానిసత్వంలో ఉంచిన, ఉంచుతూ ఉన్న బ్రిటిష్ విధానాన్నే నేను విమర్శించాను; విమర్శిస్తూన్నాను. ఆ విధానానికి బాధ్యులైనవారిని కూడా విమర్శిస్తున్నాను.

సామ్రాజ్యం లేకుండా జీవించడానికి బ్రిటిష్‌వారు జంకుతూఉన్నారు.

తమ భవిష్యత్తును గురించి వారు భయపడుతూ ఉన్నారు. ఆ భవిష్యత్తు ఎలా ఉంటుందో తెలియదు; ఊహించుకో లేకుండా ఉన్నారు. అందుచేతనే వారు భారతదేశాన్ని సామ్రాజ్యాన్ని వదులుకోవడానికి సందేహిస్తున్నారు. సామ్రాజ్యం పోతే తమ ఆర్థిక ఆధిపత్యం, అధికారం అంతరించి పోతుందేమో అని, ప్రపంచ వ్యవహారాల్లో తమ పెద్దరికం

వెల్లదేమో అని వీరిభయం. ఇక్కడా తిరిగీ భారతసమస్య. సామ్రాజ్య సమస్య యుద్ధానంతర పరిష్కారంతో ముడిపడి ఉంది.

1930-వ సంవత్సరం డిసెంబరు 12 న విన్‌స్టన్ చర్చిల్ ఇలా ప్రకటించాడు: "భారతదేశం చెయిజారిపోతే బ్రిటిష్ సామ్రాజ్యపతనం ఆరంభమైనట్లే. తీరిపోయినట్లే కూడా. బ్రిటిష్‌సామ్రాజ్య పతనానికి అవే ఆద్యంతాలు. ఒక్కదెబ్బతో ఆ ప్రముఖ సంస్థ బ్రిటిష్‌సామ్రాజ్యం జీవిత రంగంనుంచి చరిత్రలోకి వెళ్ళిపోతుంది. అలాంటి అధఃపతనంనుంచి బ్రిటన్ తిరిగీ కోలుకోవడం అనేది ఉండదు." మరుసంవత్సరం మార్చి మాసంలో మళ్ళా ఇలా చెప్పాడు: "భారతదేశం పోవడం మనకు ఆఖరు దెబ్బ; అదే చావుదెబ్బకూడా. మనలను అనామక రాజ్యంగా చేయడానికి జరిగే పనిలో ఇది ఒక భాగం కాకుండా ఉండదు.'' కనుకనే భారతదేశం స్వతంత్రం కాలేదు.

బాంక్ ఆఫ్ ఇంగ్లండ్ డైరెక్టరు, ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త లార్డ్ కీన్సు యుద్ధానంతరం జరుగవలసిన పనులను ముచ్చటిస్తూ 1942-వ సంవత్సరంలో ఇలా అన్నాడు: "యుద్ధం ముగిసినతరువాత బ్రిటన్ 1938 నాటి ఎగుమతివ్యాపారాన్ని సగానికి సగం అయినా వృద్ధిచేసుకో వాలి. దీనికి అయితే గియితేలు లేవు. అలా నూటికి యాభైవంతు పెరిగి తీరాలి. లేకపోతే ఇంగ్లండుపని అయిపోయినట్లే" భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్య భాగంగా ఉన్నందువల్ల బ్రిటన్ ఎగుమతివ్యాపారంలో దాదాపు మూడోవంతు భారతదేశంతో సాగించుకొన వీలైంది. బ్రిటన్ ఎగుమతి చేసే సరుకులో భారతదేశం నూటికి 30.5 వంతున కొంటున్నది. అలాగే భారతదేశం ఎగుమతిచేసే సరుకులో నూటికి 34.3 వంతు బ్రిటనుకే పంపుతూ ఉంది. ఈలెక్కలు సరిగ్గా యుద్ధంప్రారంభంకావడానికి ముందు సంవత్సరానివి. ఈ పరిస్థితుల్లో బ్రిటన్ భారతదేశాన్ని ఎలా వదులుకుం టుంది? బ్రిటన్ తలెత్తుకు నిలబడాలంటే ఎగుమతి వ్యాపారం ఎక్కువగా

సాగించవలసి ఉండగా తన సరుకును ఎక్కువగా కొనే భారతదేశంపై అధికారాన్ని ఎలా వదులుకుంటుంది? 1938-39 సంవత్సరంలో భారతదేశపు ఎగుమతి వ్యాపారంలో నూటికి 55.7 వంతులు బ్రిటన్‌తోనూ, బ్రిటిషు సామ్రాజ్యంలోని ఇతరదేశాలతోనూ ఉండేది.

అసలు యథార్థపరిస్థితులను పరిశీలిస్తే బ్రిటన్ ఎగుమతివ్యాపారం ఎక్కువగా అమెరికా, అర్జెంటీనాలతోనే ఉంది. మరి ఈరెండూ బ్రిటన్ వలసదేశాలు కావే. వ్యాపార విస్తరణకు వలసలు తప్పనిసరికావు. విధిగా ఉండవలసిన అవసరంలేదు. కాని వ్యాపార విస్తరణకు, అభివృద్ధికి వలసలు ఒకవిధమైన సాధనలుగా ఉపయోగపడతవి. ప్రపంచ వ్యవహారాల్లో బ్రిటన్ స్థాయి ఏమిటో తెలియదు. బ్రిటిషువారు అది తెలియక తికమక పడుతూ ఉన్నారు. అందుచేత ఈ అనిర్ణయావస్థలో, సందిగ్ధస్థితిలో భారత దేశాన్ని వదులుకొనడానికి బ్రిటిషు కన్సర్వేటివులకు ఇష్టంలేదు.

డెన్మార్క్, స్వీడన్, స్విట్జర్లాండ్ ఎంత దేశాలు? వాటి కెన్ని వలసలు ఉన్నవి? అయినా ఆ దేశప్రజల జీవితప్రమాణం చాలా ఎక్కువ గానే ఉన్నది. ఆదేశాల ప్రజలు సుఖంగా, హాయిగా ఉన్నారు. మానవులు ప్రయత్నించడానికీ సాధించడానికీ తగిన లక్ష్యాలే అవి. కాని స్వీడన్, డెన్మార్క్, స్విట్జర్లాండులమాదిరి కావడానికి బ్రిటన్ సిద్ధంగా లేదు. తనూ ఆ దేశాలమాదిరి అయిపోతే తన ప్రజల జీవితప్రమాణం తగ్గిపోతుందేమో అని భయం. బ్రిటిషుప్రజలు సిరిసంపదలతో తులతూగడానికి, బ్రిటన్ మంచి శక్తివంతమైన రాజ్యంగా ఉండటానికి తమదేశం వలసగానూ, తాము బానిసలుగానూ ఎందుకు ఉండాలో భారతీయులకు తెలియదు. ఆ విషయం అలా ఉండనివ్వండి. భారతదేశం స్వతంత్రమైతే బ్రిటన్ ఇప్పటికంటే తక్కువ సంపదగల దేశం అవుతుందనేది నిర్ధారణకాలేదు అసలు. భౌతికంగానూ, అధునికసూత్రాలను అనుసరించీ బ్రిటన్ ఇప్పటికంటే కొంచెం బలహీనమైన దేశం కావచ్చు, ఇప్పటిలాగా బ్రహ్మాండ

మైన నౌకాదళం, కోట్లాది వలసప్రజలు, లక్షలాది వలససైనికులు, సువిశాలమైన ఆసియా ఆఫ్రికా భూభాగాలూ అప్పుడు ఉండకపోవచ్చును. కాని కొన్ని ప్రత్యేకపరిస్థితుల్లో భారతదేశం తన బానిసగా ఉన్నప్పటి కంటే స్వతంత్రంగా ఉంటేనే బ్రిటన్ ఆర్థికస్థితి మెరుగ్గా ఉండవచ్చును. ఇందుకు ఉత్తర అమెరికాయే తార్కాణం. "ఉత్తర అమెరికా బ్రిటన్ వలసదేశంగా ఉన్నప్పటికంటే ఆ దేశం స్వతంత్రమైన తరువాతనే బ్రిటన్ అక్కడ ఎక్కువ వాణిజ్య ప్రయోజనాలను పొందింది" అని 1812 వ సంవత్సరంలో బ్రిటిషు వైదేశిక కార్యదర్శి లార్డ్ కాసిల్రీ అన్నాడు. ఇది ముమ్మాటికీ నిజం. ఇందులో పెద్ద రహస్యం ఏమీ లేదు. బ్రిటిషుసామ్రాజ్యం విచ్ఛిన్నంకావడంతో అమెరికా ధనికదేశం అయింది. తత్ఫలితంగా ఆ దేశపు కొనుగోలుశక్తి హెచ్చింది. అందుచేత బ్రిటన్ ఎక్కువవ్యాపారంచేయగలిగింది. పర్యవసానం - బ్రిటన్‌కూడా ధనికదేశం అయింది. అదేవిధంగా భారతదేశంలో బ్రిటిషుసామ్రాజ్యం విచ్ఛిన్నమైపోతే, ఏదో కొందరు ఇంగ్లీషువారు భాగ్యవంతులుకావడం ఆగిపోయినా బ్రిటన్‌దేశం భాగ్యవంతమౌతుంది. కొందరు బ్రిటిషువారు ఆర్థికంగా, సాంఘికంగా దెబ్బతింటే, వారి అపేక్షలకు ప్రమాదం ఏర్పడితే బ్రిటిషుజాతి యావత్తూ దెబ్బతింటుందనీ, జాతి అపేక్షలకు ప్రమాదం ఏర్పడుతుందనే భ్రమలో పడిపోయింది బ్రిటిష్‌జాతి అంతా. స్వప్రయోజనార్థం కొందరు ఇలాంటి భ్రమను జాతికి కలిగించారు. పాలకవర్గ అపేక్షలూ, జాతిఅపేక్షలూ ఒకటే ననే భ్రమను జాతికి కలిగించడమే పాలకులు చేయగలా, సాధించగలా పని. అప్పటికి వారు కృతకృత్యులౌతారు.

ఈస్టిండియా కంపెనీవారు సాగించిన వ్యాపార వ్యవహారాల నుండి ఉత్పన్నమైంది భారతదేశపు వలసస్థాయి. ఆ వ్యాపారసంస్థ లక్ష్యం వీలైనంత ఎక్కువగా డబ్బుచేయడమే. ఇప్పటికీ ఆ లక్ష్యం ధనార్జనగానే కనిపిస్తుంది. అమెరికాలో విప్లవాన్ని ప్రోత్సహించినవి ఇలాంటి

వ్యాపార పద్ధతులే. అమెరికా విప్లవంగురించి "ఫార్ట్యూన్" పత్రికా సంపాదకుడు లెస్లీ బెల్ ఇలా వ్రాశాడు: "సామ్రాజ్య దేశవ్యాపారపద్ధతుల పైనా, నౌకావ్యాపారం చక్కెర స్టాంపు శాసనాలపైనా జరిగిన తిరుగుబాటే అమెరికా విప్లవం. వ్యాపారాన్ని వృద్ధి చేసుకొనడానికి, వస్తువులను తయారు చేసుకొనడానికి చివరకు తమ కిది ప్రయోజనకరం కాదని అభిప్రాయపడితే భూమిని సాగుచేసుకోవడానికి కూడా వలసప్రజలకు వీలు గాకుండా చేస్తూవచ్చారు బ్రిటిష్‌పాలకులు. తమకు ప్రయోజనకరంగా ఉంటే దేశీయుల కది ప్రమాదకరమైనాసరే ఆ వ్యాపకాన్ని పోత్సహిస్తారు సామ్రాజ్యవాదులు. దేశీయులకు ప్రయోజనకరంగా ఉండి, తమకు ప్రమాదకరం కాకపోయినా, ప్రయోజనకరం కాదనుకుంటే అట్టిపనులకు ఆటంకాలు కలిగిస్తారు. అమెరికాప్రజలు తమ ఆర్థికాభివృద్ధికి ఇలాంటి అవరోధాలను కలిగించే బ్రిటిష్‌పాలకులను సహించలేక పోయారు. సహించలేదు. అలాంటిపద్ధతులను, ఆచారాలను, కార్యక్రమాన్ని భారతీయులూ సహించడం లేదు.

19-వ శతాబ్దంలో అమెరికా వలస ప్రాంతాలను పీడించి పీల్చుకుతిన్నట్టే ఈ నాడు భారతదేశాన్ని పీడించుకు తింటున్నది బ్రిటన్. అలాగని అంటే అది బ్రిటనును ఖండించినట్లుకాదు. వలసదేశాలను పీడించుకుతినడమే సామ్రాజ్యాల ఉద్దేశం. సామ్రాజ్యాలు ఆ విధంగా చేయక పోతే వలసలు అంటూ ఉండటంలో అర్థంలేదు; అగత్యం కూడా లేదు.

భారతదేశంలో 40 కోట్ల ప్రజలు ఉన్నారు. కాని వీరిలో కాస్త ఎన్నదగిన పరిశ్రమల్లో పనిచేసేవారు 1937 లో ప్రభుత్వంవారు తయారు చేసిన లెక్కలనుబట్టి 1,940, 477 మంది కంటే ఎక్కువలేరు. వీరిలో 916, 575 మంది ఒక్క వస్త్ర, నూలుపరిశ్రమలోనే పనిచేస్తూఉన్నారు. పోతే భారీపరిశ్రమలనదగిన ఉక్కు, ఇనుము, ఇతరఖనిజ లోహ పరిశ్రమలలో పనిచేసేవారు 57, 433 మంది మాత్రమే.

భారతదేశ ఆర్థికాభివృద్ధికి బ్రిటిష్‌వారు అడ్డుతగులుతూ ఉన్నారనే నాకు కనిపించిన ప్రతి భారతీయుడూ చెప్పాడు. వీటికి ఆధారా లేమైనా ఉన్నవా అవి అందర్నీ అడిగాను. భారతీయులు చాలా దాఖలాలు చూపించారు. బ్రిటిష్‌వారివల్లా కొన్ని తెలిసినవి.

1857 లో సిపాయిలవిప్లవం జరిగింది. ఆ తరువాత భారతీయులను ఆయుధాలు తయారుచేయ నివ్వలేదనీ, అలా వారు తయారుచేసే ఆయుధాలను తమపై ప్రయోగిస్తారనే భయమే ఇందుకు కారణ మనీ ఒక బ్రిటిష్‌ఉన్నతోద్యోగి చెప్పాడు. ఋజువుకేవస్తే కావలసినన్ని అధికారపత్రాలే ఉన్నవి. భారతపరిశ్రమల అభివృద్ధిని అరికట్టడంలో బ్రిటిష్‌వారు సైనిక రాజకీయ విషయాలను మనస్సులో పెట్టుకు ప్రవర్తించారు.

సాధారణంగా బ్రిటిష్‌వారి భారత పరిశ్రమాభివృద్ధి నిరోధక విధానానికి రాజకీయ, ఆర్థిక హేతువులు ఉంటూవుంటవి.

1942 జులై 6 వ తేదీన భారతప్రభుత్వ "భూగర్భ పరిశోధకశాఖ" అధిపతి సిరిల్ యస్. ఫాక్స్ ఒక ఉపన్యాసం చేశాడు. ఈయన బ్రిటిష్‌వాడు. ఈయనఉపన్యాసం వినటానికి రావలసిందని పత్రికావిలేఖరులందర్నీ పిలిచారు. ఉపన్యాసం పూర్తి అయిన తరువాత ఆ ప్రసంగం ప్రతిని ఇమ్మని కోరాను. ఏమీ అనుకోక వెంటనే జేబులోనుంచి తీసి నాకు ఇచ్చాడు. భారతదేశ అపార ప్రకృతిసంపదనుగురించి దీర్ఘంగా సంభాషించాడు. భారతదేశంలో 1897-1902 సంవత్సరాలమధ్య ఖనిజముల కోసరం బ్రహ్మాండమైన పరిశోధనలు జరిగినట్లు ఆయన ఆసందర్భంలో చెప్పాడు. భూగర్భ పరిశోధన కార్యక్రమానికి ఏవిధంగా అవాంతరాలు ఏర్పడిందీ ఈయన వివరంగా చెప్పాడు: "1897-1902 సంవత్సరముల మధ్యకాలంలో భారతప్రభుత్వంవారు అనేకమంది భూగర్భపరిశోధక ప్రవీణులను నియమించారు. కెనడా పద్ధతిని ఒక ప్రత్యేక భూగర్భ పరిశోధకశాఖను ఏర్పాటుచేయడం అవసర మని భారత ప్రభుత్వం

గ్రహించినట్లు తోచింది. కాని పనిమాత్రం అందుకు అనుకూలంగా జరుగలేదు. పరిశోధనలను సాగించడానికి బదులు ఒక గనుల సంస్థను ఏర్పాటుచేయమని వీరిని ఆదేశించారు. భారత ఖనిజసంపదభివృద్ధికి అవసరమైనట్టి ఈ భూగర్భ పరిశోధన కార్యక్రమానికి అంతరాయాలు, విఘాతాలు ఏర్పడినవి. 1914-18 యుద్ధకాలంలో ఈ భూగర్భ పరిశోధక శాఖను ఖనిజముల పరిశోధనకుగాక, కేవలం ఒక సలహా సంఘంగా మాత్రం ప్రభుత్వంవారు ఉపయోగించుకున్నారు. ఇందువల్ల భారత పరిశ్రమలు వృద్ధికావడానికి బదులు ఈదేశంనుంచి ప్రధాన ముడిపదార్థాలు ఎక్కువగా ఎగుమతికావడం జరిగింది."

జులై 6 వ తేదీ ఉపన్యాసంలో డాక్టర్ ఫాక్స్ ఇంకా ఇలాకూడా చెప్పారు: "1918 యుద్ధం జయప్రదంగా ముగిసింది. భారతప్రభుత్వంవారు లండన్‌లోని తమ హైకమీషనరు కార్యాలయానికి ఒక ఖనిజశాస్త్ర సలహాదారుణ్ని పంపించారు. ఈయనపని భారత దేశమునుండి ఖనిజముల ఎగుమతి వృద్ధికావడానికి మార్గాలు అన్వేషించడమే."

బ్రిటిష్ పరిశ్రమల కవసరమైన ముడిపదార్థాలు సమృద్ధిగా సప్లయి కాగలందులకే భారతపరిశ్రమల అభివృద్ధిని అరికట్టినారని ఈ అధికార వచనములవల్లనే స్పష్టమౌతున్నది. బ్రిటన్‌లోని పరిశ్రమలతో పోటీపడగల పరిశ్రమల స్థాపనను, వృద్ధిని భారతదేశంలోనూ, ఇతరసామ్రాజ్య భాగాల్లోనూ నిరుత్సాహపరచడమే బ్రిటిష్ విధానం.

భారతదేశంలోని భూస్వాములు, వ్యాపారస్థులు బాగా డబ్బు గణించారు. చాలా నిలవ ధనం ఉంది. వీరు తమ ధనాన్ని కొన్ని పరిశ్రమల మీద - ముఖ్యంగా వస్త్రపరిశ్రమమీద వెచ్చించారు. బ్రిటిష్‌వారు ఈ పరిణామాన్ని నివారింపలేకపోయారు. కాని తమకు సాధ్యమైనప్పుడల్లా మాత్రం భారతదేశంలో కొత్త పరిశ్రమలు ప్రారంభంకాకుండా చూస్తూ వచ్చారు బ్రిటిష్ అధికారులు. తమదేశంలో పరిశ్రమలను నెలకొల్పుకొను

టుకు, తమదేశం పారిశ్రామికంగా వృద్ధిచేసుకొనడానికి భారతీయులు చేస్తున్న ప్రయత్నాలకు విఘాతాలు కలిగించే బ్రిటిష్ విధానాన్ని లండన్ "ఇకనమిస్టు" పత్రిక తీవ్రంగా విమర్శించింది. 1942 అక్టోబరు 10 వ తేదీన ఈ విషయమై ఆ పత్రిక ప్రకటించిన ప్రధాన వ్యాసంలో ఇలా ఉంది: "నౌకా నిర్మాణం, విమానములూ మోటారులు తయారుచేయడం మొదలైన పరిశ్రమల స్థాపనకు భారతదేశంలో జరిగిన ప్రయత్నాలను అలక్ష్యంచేసి నిరుత్సాహపరచింది."

భారతీయ పరిశ్రమలను బ్రిటిష్‌వారు ఏవిధంగా నిరుత్సాహపరుస్తూ వచ్చిందీ తెలియజేసే పత్రాలు కొన్ని నాకంట బడినవి. ఇందులో కొన్ని అధికారపత్రాలే. మరికొన్ని ఇప్పటివరకూ అప్రకటితములే. 1936 వ సంవత్సరంలో మోటారుకారులు, ట్రక్కులు తయారుచేయడానికై వాల్చంద్ హీరాచంద్ అధ్వర్యాన ఒక బ్రహ్మాండమైన కంపెనీ ఏర్పడింది. లోగడ ఫోర్డుకంపెనీ సోవియట్ ప్రభుత్వంతోచేసుకొన్న మాదిరి ఒడంబడిక నొకదాన్ని చేసుకోవాలని వాల్చంద్ హీరాచంద్ స్వయంగా డిట్రాయట్ వెళ్ళాడు. క్రిస్లర్, ఫోర్డుకంపెనీలవారితో అన్ని వివరాలూ మాట్లాడారు. దాదాపు అన్ని ఏర్పాట్లూ పూర్తి అయినవి. అప్పుడు వాల్చంద్ కంపెనీతరఫున సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు కొన్ని సూచనలుచేస్తూ భారతదేశంలోని బ్రిటిష్ రాజప్రతినిధికి ఒకజాబు వ్రాశారు. ఈ పరిశ్రమకు ఆరంభదశలో కొంత ప్రోత్సాహంగా ఉండగలందులకు బ్రిటిష్ ప్రభుత్వంవారు మోటారుకారులమీదా, వాటి ముఖ్యభాగాలమీదా విధిస్తున్న 37.59 ఎగుమతి సుంకాలను ఒక పది సంవత్సరాలు అలాగే ఉంచవలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరవలసిందిగా సూచించారు. బ్రిటిష్ సైనికశాఖ, ప్రభుత్వం నిర్ణయించిన ప్రమాణానికి తగివుంటే తమకంపెనీ తయారుచేసే మోటారుకారులనూ, ట్రక్కులనూ బ్రిటన్‌నుండి దిగుమతి చేసుకొనేవాటికి బదులుగా కొనవలసిందనికూడా

విశ్వేశ్వరయ్యగారు విజ్ఞాపించారు. కాని రాజప్రతినిధి ఈ రెండు కోర్కెలనూ తిరస్కరించాడు. ఈ విషయమై 1936 నుండి 1942 వరకూ ఉభయపక్షాలమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే ఉన్నవి. ఈ ఉత్తరాల దస్త్రరం నేనూ చూచాను. భారతదేశంలో మోటారులూ ట్రక్కులూ తయారు చేయడానికి ఏవిధమైన సహాయమూ చేయ నిరాకరించింది బ్రిటిష్ ప్రభుత్వం. ఆనాటి బ్రిటిష్ సహాయనిరాకరణ ఫలితాలను ఈనాడు, ఈ యుద్ధంలో మనం అనుభవిస్తూ వున్నాం. మోటారుకార్లూ, ట్రక్కులూ భారతదేశానికి డిట్రాయిట్ నుంచల్లా పడవలమీద రావాలి.



సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు

నౌకానిర్మాణంగురించికూడా బ్రిటిష్‌వారు ఇదే వైఖరిని అవలంబించారు. ఈ విధానాన్ని బ్రిటిష్‌వారు అనుసరించడానికి గల కారణాలను భారతప్రభుత్వ వాణిజ్యశాఖా కార్యదర్శి సర్ ఛార్లెస్ ఇన్స్ 1926 వ సంవత్సరం మార్చి 19 వ తేదీన స్పష్టంగా వివరించారు. కోస్తా వ్యాపారంలో కొంతభాగాన్ని భారతీయ నౌకాకంపెనీలకు కేటాయించవలసిందని కోరగా సర్ ఛార్లెస్ ఇన్స్ ఇలా సమాధానం చెప్పారు: "ఇతర రాజ్యాలు, ఇతర జాతులు తమదేశపు కోస్తా వ్యాపారాన్ని ప్రత్యేకం తమకే ఎందుకు అట్టే వుంచుకున్నారు ? ముందుముందు ఇలాంటి ఏర్పాటు తమదేశరక్షణకు

ప్రయోజనకరంగా ఉంటుందనే అలా చేసుకున్నారు. యుద్ధకాలంలో తమ ప్రజలకు ఆహారపదార్థాలు సప్లయిచేయడానికీ, తమదేశ రక్షణకు ఈనౌకాదళం ద్వితీయరక్షణశ్రేణిగా ఉపయోగపడుతుందనే ఉద్దేశంతో వారలా చేసుకొన్నారు; చేసుకోవలసివచ్చింది. అదృష్టవశాత్తూ ఈదేశానికి అలాంటి అగత్యం ఏమీ ఏర్పడదు. ఇదే నేను ఇప్పుడు చెప్పవలసింది అంతా. ఈదేశానికి అలాంటి అవసరంకూడా కలగదు. భారతదేశపు కోస్తా యావత్తూ బ్రిటిష్ నౌకాదళమే రక్షిస్తూ ఉంది. కాపాడుతూ ఉంది." కనుక భారతదేశానికి వ్యాపార నౌకాదళం ఉండవలసిన అవసరం లేదు! కాని బ్రిటిష్‌ప్రభుత్వం భారత కోస్తావ్యాపారాన్ని చేస్తూ ఉన్న బ్రిటిష్ కంపెనీలకు పుష్కలంగా ధనసహాయం చేస్తూవుంది. అధికారపత్రాలనుంచే నే నీ వివరాలను సేకరించాను. "బ్రిటిష్ నౌకా పరిశ్రమ పెంపొందుటకు భారత నౌకాపరిశ్రమ జీర్ణమైపోవాలి" అని ఎంతో హృదయావేదనతో గాంధీజీ అన్నారు. 1938 వ సంవత్సరంలో భారతకోస్తా వ్యాపారానికి సంబంధించిన లెక్కలను పరిశీలించాను. మొత్తం వ్యాపారంలో నూటికి 21 భాగాలుమాత్రం భారతనౌకలు చేస్తూ ఉంటే నూటికి 79 భాగాలు బ్రిటిష్‌నౌకలు చేస్తూవున్నవి.

అయితే బ్రిటిష్‌వారు ఈవిధంగా భారతపరిశ్రమల అభివృద్ధికి అవరోధాలు కలిగించడానికి గల ముఖ్యకారణాలు ఏమిటి? భారతీయ పారిశ్రామికులందరూ తీవ్ర జాతీయవాదులు. వీరు గాంధీజీ సాగించే స్వాతంత్ర్యోద్యమానికి ధారాళంగా ధనసహాయం చేస్తూవున్నారు. పండిట్ నెహ్రూకూడా జాతీయవాదే గనుక, ఆయన అభ్యుదయ ఆర్థిక, సాంఘిక ధోరణి దృక్పథంతో వీరు సమాధానపడ్డారు. వీరు తనతో కలసి పని చేయడానికి సిద్ధపడ్డారు గనుక నెహ్రూకూడా వారితో కలసి పని చేస్తున్నాడు.

భారతదేశ అభివృద్ధికి బ్రిటిష్‌వారు ఎంత తక్కువగా సహాయ

పడుతూవచ్చిందీ భారతీయులు సహేతుకంగా వివరిస్తుంటారు. తాము భారతదేశాని కెంతో మేలుచేశామని బ్రిటిష్‌వారు అంటుంటారు. "రైళ్లు వేయించాం; సాగు సౌకర్యాలు కల్పించాం; విద్యుచ్ఛక్తిని తెచ్చిపెట్టాం." అని బ్రిటిష్‌వారు ఏకరువుపెడుతూ ఉంటారు. అసలు తగాదాలు ఈ లెక్కలకు సంబంధించినవి కావు. ఎవరు ఏంచేసిందీ తెలుసుకోవడానికి అధికారపత్రాలు ఉండనేవున్నవి. వున్న పేచీఅంతా విధానాలకూ, దృక్పథాలకూ సంబంధించే. "మేము ప్రశంసాపాత్రులం కావడానికి మేంచేసిన సత్కార్యాలు చాలు" అని బ్రిటిష్‌వా రంటారు. "వారుచేసింది ఎంత అత్యల్పమో చూడండి. అదే చాలు వారిని తీవ్ర, నిశిత విమర్శలకు గురి చేయడానికి" అంటారు భారతీయులు.

"బ్రిటిష్‌వారు భారతదేశంలో దాదాపు 150 సంవత్సరాలున్నారు. ఆ ఒకటిన్నర శతాబ్దంలో అమెరికా, బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ దేశాలు పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి అయినవి." అనికూడా భారతీయులు చెప్తారు. నూరుసంవత్సరాల ఈలోపున జపాన్ పూర్తిగా మారిపోయింది. పారిశ్రామికాభివృద్ధికి అవకాశాలు లభించేసరికి ఇట్టే అగ్రరాజ్యంగా తయారైంది జపాను. భారతీయులు ఇదే తరుచు ప్రస్తావిస్తూ వుంటారు. జపాన్ అంతపని చేయగలిగితే భారతదేశంమాత్రం ఎందుకు చేయలేదని ప్రశ్నిస్తారు. జపాన్ స్వతంత్రదేశం కావడమూ, భారతదేశము వలసరాజ్యం కావడమూ ఇదేనా ఈస్థితికి కారణం? తమశక్తిని గురించి కొంచెం ఎక్కువగా చెప్పడం, చెప్పుకోవడం మానవసహజం. అందుచేతనే భారతీయులు ఇలా ప్రశ్నిస్తారు. ఈకారణంగానే బ్రిటిష్‌పాలన యెడల అతృప్తి మరీ ఎక్కువవుతుంది.

సామ్రాజ్యదేశం ఎప్పుడూ విషాదావస్థలోనే ఉంటుంది. వలసరాజ్యం వికాసాన్నిపొందక, బాగా వెనకబడి ఉంటే సామ్రాజ్యదేశం ఏంచేసినా ఏమీ అనుకోదు. సామ్రాజ్యదేశంపై ఎవరికీ ఎలాంటి ఫిర్యాదూ

చేయదు. అభివృద్ధికావడం ఆరంభమైతే, ఆ అభివృద్ధి తగినంత వేగంగా జరగడంలేదు అనీ, ఇంకా ఎక్కువ అవకాశాలు కల్పించాలనీ అంటారు వలస ప్రజలు. దేశాభ్యుదయానికి, అభివృద్ధికి కృత్రిమమైన అవరోధాలు కలిగిస్తూ ఉంటేకూడా వలసదేశాలవారు చిరాకుపడుతూ ఉంటారు. 'గతిలేనమ్మకు గంజే పానకం' అని వున్నదానితోటే తృప్తిపడమంటే వలసదేశం ఎన్నటికీ తృప్తిపడదు. ప్రజాస్వామ్య ప్రయోజనాలను బ్రిటిష్ ప్రభుత్వం భారతీయ విద్యార్థులకు బోధించింది. అలాంటి ప్రయోజనకర మైన ప్రజాస్వామ్యం తమకు కావాలని భారతీయులు బ్రిటిష్‌వారిని కోరుతూవున్నారు. తమపై ఆధిపత్యంవహించిన సామ్రాజ్యదేశం తమ అభివృద్ధికి సహాయపడలేదని ఈజిప్టు, ఆల్జీరియా, సిరియా, పాలస్తీనా, జావా, భారతదేశాలు సణగడంలేదు; ఫిర్యాదుచేయడంలేదు. తగినంతగా అభివృద్ధిచెందడానికి అవకాశాలు కల్పించలేదనే వారి ఆక్షేపణ. సామ్రాజ్య దేశాలు కావాలని వలసదేశాల పారిశ్రామిక అభివృద్ధికి అంతరాయాలు కలిగించడం కళ్ళారా చూస్తూ ఉండేసరికి వలసప్రజల అసంతృప్తి అధికమవుతుంది; తీవ్రమౌతుంది.

తగినన్ని యంత్రాలయాలు లేనందువల్ల భారతదేశ వ్యవసాయం కూడా దెబ్బతినిపోతున్నది. వ్యవసాయపు పనిముట్లు రైతులకు చాలా తక్కువగా లభ్యమౌతూ వుంటవి. గ్రామాల్లో పనిలేకవున్న రైతులు పట్నవాసాలకు పోలేరు. అక్కడదొరికే కూలీ చాలా కొద్ది. అసలు పని అంటూ దొరకడంకూడా అంతంతమాత్రమే. పైగా తలదాచుకోవ డానికి సరైన కొంపలుకూడా దొరకవు. అథవా దొరికినా మురికికూపా లవి. ఈవిధంగా పట్నాలకు పోలేక, పల్లెల్లో పనిలేక వున్న జనాభా చాలా వుంది. భారతదేశగ్రామాలు కానరాని నిర్వ్యాపారులతో పొంగిపొరలుతూ వున్నవి. ఈవిధమైన నిరుద్యోగులు లక్షలసంఖ్యలో ఉన్నారు. గ్రామ సీమలో అదనపు జనాభా ఉన్నందువల్ల సగటున మనిషికి లభించే

ఆహారపదార్థాల మొత్తంకూడా తగ్గిపోయింది. అలాగే మనిషికి వ్యక్తిగతంగా లభించగల సాగుభూమి విస్తీర్ణమూ తగ్గిపోయింది.

తన వలసదేశాలలోను, ఆఖరుకు అధినివేశాల్లోనూకూడా పరిశ్రమల అభివృద్ధిని అరికట్టే బ్రిటిష్‌విధానాన్ని క్షమాదృష్టితోగాక, మరొక విధంగా చూస్తే అర్థంచేసుకోవడం సాధ్యంగాదు. పాతకాలపు వ్యాపార పద్ధతుల ననుసరించి స్వేచ్ఛావాణిజ్యానికి స్వదేశంలో వీలుందిగాని వలసలపోటీకి అసలు అవకాశమేలేదు. పరిశ్రమలసంగతి అలావుంచండి. భారతదేశంలో దాదాపు నూటికి తొంభై మందికి వ్యవసాయమే జీవనోపాధి కదా? అలాంటప్పుడు ఆ వ్యవసాయాభివృద్ధికైనా బ్రిటన్ దోహదం చేయదు ఎందుచేత? భారత వ్యవసాయం వృద్ధి అయి, రైతుల రాబడి హెచ్చితే భారతరైతాంగం బ్రిటిష్ వస్తువులకు మంచి విక్రయశాల కావడమేగాక బ్రిటన్‌ప్రజల కవసరమైన ఆహారపదార్థాలు, పరిశ్రమల కవసరమైన ముడిపదార్థాలూకూడా సమృద్ధిగా దొరుకుతవే!

ఇలాంటి ప్రశ్నలకు వచ్చే ప్రత్యుత్తరాలు సామ్రాజ్యవాదంలోవి దుర్గుణాలను, చెడులక్షణాలను బయటపెడతవి. భారత వ్యవసాయం అంత అధోగతిలో వుండటానికి ముఖ్యకారణం పాతకాలపు భూమిఅమరకపు విధానమూ, వారసత్వపు శాసనాలూ, వీటివల్ల కమతాలు క్రమంగా పీలికలైపోతున్నవి. భారత వ్యవసాయ దౌర్భాగ్యస్థితికి మరొకకారణం ప్రజల గోపూజ. వీరి కది పవిత్రమయిన ఆరాధనవస్తువు. ఇవి భారత సంప్రదాయాల్లోనూ, మూఢాచారాల్లోనూ పాతుకుపోయినవి. వీటిని మార్పు చేయడం బ్రిటిష్‌ప్రభుత్వానికీ తరంకాదు; ఏ పరప్రభుత్వానికీ సాధ్యంగాదు. అసలు మార్చడానికే సాహసింపలేదు. స్వతంత్ర భారతప్రభుత్వం ఒక్కటే వీటిని సంస్కరించడానికి ప్రయత్నమంటూ చేయగలదు. ఈ రహస్యాన్ని గ్రహించే చాలామంది భూఖామందులు, ధనస్వాములు భారత స్వాతంత్ర్యోద్యమానికి ప్రతికూలంగా పనిచేస్తూ ఉన్నారు.

అధ్యక్షుడు జిన్నాగారివి మినహాయిస్తే ముస్లింలీగులో ఉన్న వారందరూ పెద్దపెద్ద జమీందారులు. భారతదేశానికి స్వాతంత్ర్యంవస్తే గ్రామాల్లో తమ ప్రాపకం, తమహోదా దెబ్బతినిపోతవని వీరందరూ భయపడుతూ వున్నారు. భారత సంస్థానాధీశ్వరులూ ఇదేరకం. ఇప్పటి అమరకపు పద్ధతి మారడంగాని, రాజ్యాంగవ్యవస్థ కొత్తది ఏర్పడడంగాని వీరికి ఇష్టంలేదు. యథాస్థాయికి భంగం కలుగరాదు. కనుకనే ఇప్పటి స్థాయిని సంరక్షింప సమకట్టినవారందరూ ఏకమై ఒకవర్గంగా తయారైనారు. బ్రిటన్‌లో యథాస్థాయివాదులకు భారతదేశంతో మిత్రులు, ప్రతినిధులు ఉన్నారు.

ముస్లిం ప్రజాబాహుళ్యాన్ని ఆకర్షించడానికి, తమపక్కన చేర్చుకోవడానికి ముస్లింలీగువారు "ప్రత్యేక ముస్లింరాజ్యం" అనే జాతీయ ప్రపూరిత నినాదాన్ని వాడుతూ వున్నారు. క్రిప్సుప్రతిపాదనలు సూత్రప్రాయంగా అంగీకరించి ప్రసాదించిన 'పాకిస్తాన్' రైతును జమీందారు బానిసగానూ, తత్పర్యవసానంగా భారతదేశాన్ని బ్రిటన్‌బానిసగానూ చేయడానికి వుపయోగపడింది.

హిందూ సంస్థానాధీశ్వరుడు, ముస్లిం భూస్వామీ తమ రైతులను బాధించినట్లే హిందూ పారిశ్రామికుడూ తన కార్మికులను కాల్చుకుతింటాడు. అక్కడ మతాభిమానం ఏమీ పనిచేయదు. స్వార్థమే పరమార్థం. ఆ స్వార్థంతోటే భారత పారిశ్రామికులు జాతీయోద్యమాన్ని బలపరుస్తారు. బ్రిటిష్‌ప్రభుత్వం పోయి ఇప్పుడున్న అవరోధాలు తొలగిపోతే తమ పరిశ్రమలు బాగా వృద్ధిఅవుతవి, విశేషంగా ధనాన్ని ఆర్జించవచ్చు. అదే స్వార్థంతో భూస్వాములూ, సంస్థానాధీశ్వరులూ జాతీయోద్యమాన్ని ప్రతిఘటిస్తారు. బ్రిటిష్‌వారుంటే ఇప్పటిహోదాకు, స్థాయికి భంగం కలుగదు.

వ్యక్తిగతంగా ఉభయులూ ప్రతిపక్షస్థులే. కాని బ్రిటిష్‌వారు భారత

దేశంనుండి వెళ్ళిపోవడం తన అభివృద్ధికి అవసరం గనుక భారత పారి శ్రామికుడు జాతీయోద్యమపు బంటుగా, ఏజంటుగా ఉంటున్నాడు. అభ్యు దాయ వాదిగా ఉంటున్నాడు. భారతీయ పారిశ్రామికులు జాతీయోద్యమం అండను ఉంటే భూస్వాములు బ్రిటిష్‌వారిపక్షాన ఉంటారు.

భారత వ్యవసాయంవిషయములో బ్రిటిష్‌వారు ఇలాంటి ఉపేక్ష వహించడానికి కారణం మరొకటికూడా ఉంది. భారతదేశ జనాభాలో అత్యధికసంఖ్యాకులు రైతులు. వారు కాస్త పచ్చగావుండి, ఆర్థికభారం వల్ల క్రుంగిపోక, ఈతిబాధ లెరుగక సుఖంగావుంటే బ్రిటిష్‌వారిని వెళ్ల గొట్టడానికి ఏకమౌతారు. సామ్రాజ్యశకాన్ని అంతమొందించడానికి ఐక్య ప్రతిఘటన సాగించగలరు. అందుచేత సామ్రాజ్యదేశం ఎప్పుడూకూడా వలసదేశాన్ని అజ్ఞానంలోనూ, దుర్భర దారిద్ర్యంలోనూ ఉంచి, దేశాన్ని వీలైనంతవరకు ముక్కలు ముక్కలుచేసి ఐక్యతకు అవకాశంలేకుండా చేస్తుంది. వలసదేశం ఈవిధంగా ఉండటం సామ్రాజ్యదేశానికి ఒకవిధంగా లాభకరం కూడా. సామ్రాజ్యదేశంచేసేఘోరాల్లో, దురన్యాయాల్లో దారుణ మైంది ఇది. ఏ సామ్రాజ్యదేశ విధానం తీసుకున్నా ఇది ఇంతే.

సామ్రాజ్యవాదం ప్రపంచాన్ని మహా దారిద్ర్యస్థితికి తీసుకువచ్చింది.

భారతదేశానికి సంబంధించిన విషయాలు - ప్రధానమైనవి మూడు ఉన్నాయి. ఈ ముఖ్య విషయత్రయాన్ని తెలుసుకోవడానికి నాలు గైదు రోజులు. మహా అయితే వారంరోజులుకంటే ఎక్కువపట్టదు. ఒక్క వారంరోజులు దేశంలో వుంటే చాలు, ఈసంగతులను అవగాహన చేసుకోవచ్చును.

ఈ విషయత్రయంలో మొదటిది—

భారతదేశం అతి దారుణమైన దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నది.

ప్రజలు తీవ్రంగా బ్రిటిష్ ప్రతికూలురుగా ఉన్నారు.

బ్రిటిష్‌వారు భారత జనసామాన్యంతో కలిసి ఉండరు. సంపర్కం బహు సకృత్తుగా ఉంటుంది. అదొక ప్రపంచంలో ఉంటారు. భారతీయులను అదో రకంగా చూస్తారు. సాటివారే అనే భావం లేనేలేదు. దేశీయులంటే ఈ పరదేశులకు ఎలాంటి అభిమానమూ లేదనే చెప్పవచ్చు.

నేను భారతదేశ పర్యటనం చేస్తూ బొంబయివెళ్లాను. అక్కడి భారతీయ పత్రికా రచయితలసంఘంవారు ఒకసభ ఏర్పాటుచేసి నన్ను ఆహ్వానించారు. ఉపన్యాసం చేయమన్నారు. కాని వారేవైనా ప్రశ్నలు అడిగితే ఇష్టాగోష్ఠిగా సమాధానాలు చెప్తానన్నాను.

ఈ యుద్ధంలో మిత్రవిజయానికి ఎందుకు సహాయంచేయాలో, ఈయుద్ధంలో ఫాసిజమే జయించడం జరిగితే ప్రపంచపరిస్థితి ఎంత దారుణంగా వుంటుందో వివరించాను. నే నిలా చెప్పేసరికి ఒకరులేచి ఇలా అన్నారు: "మాకు సంబంధించినంతవరకు జపాను ఫాసిజానికీ, బ్రిటిష్‌ఫాసిజానికీ ఏమీ తేడా కన్పించదు."

ఇందుకు సమాధానంగా నే నిలా చెప్పాను: "మీ రీసంగతి గుర్తించాలి. బ్రిటన్ ఫాసిస్టుదేశం కాదు. మంచి, ఉత్తమ ప్రజాస్వామికం బ్రిటన్. కొన్ని రాజకీయ విషయాల్లో మా అమెరికాకంటేకూడా ప్రజాస్వామ్య పద్ధతులను అనుసరిస్తూ వుంటుంది. బ్రిటిష్‌వారు అప్పుడప్పుడు భారతదేశంలో నిర్బంధవిధానాన్ని అమలుచేస్తున్నారు. నిజమే. ఆ విధానాన్ని భారతీయులు నిరసిస్తున్నసంగతీ నాకుతెలుసును. ఈదేశం వచ్చింది లగాయతు చాలామంది భారతీయులను కలుసుకున్నాను. నేను మాట్లాడిన వారిలో ప్రతి అయిదోవాడూ తాను జెయిలుకు వెళ్లివచ్చినట్లు చెప్పేవాడు. నేను జర్మనీలో చాలాకాలం వున్నాను. అక్కడ జెయిలుకుపోయి తిరిగి

వచ్చినవారు అంతగా కనుపించరు. నూటికి కోటికి ఎవరో వుంటారు. కారాగారాల్లోనే చాలామందిని కాల్చివేస్తారు. జెయిలుకు పోయినవారు చాలామంది వుండవచ్చు. కాని జెయిలుకు వెళ్లివచ్చినవారుమాత్రం చాలా తక్కువ."

ఒక రచయిత ఇలా చెప్పాడు: "బ్రిటిష్‌వా రా విధంగా కాల్చి చంపరు. పీల్చి పిప్పిచేసి, జీవచ్ఛవాలనుచేసి వదుల్తారు."

"అంటే మీ అభిప్రాయం ఏమిటి?" అని ప్రశ్నించాను.

మొత్తంజనాభా జీవితకాలపరిమితికి సగటున చూస్తే 27 సంవత్స రాలు మాత్రమే భారతీయుల జీవిత పరిమితి. ఆప్రకారంగానే లెక్కలు చూస్తే ఈ పరిమితి ఇంగ్లండులో 60 సంవత్సరాలు, అమెరికాలో 63 సంవత్సరాలూ వున్నట్లు కన్పిస్తుంది." అని అతను బదులుచెప్పాడు. ఇందుకు సంబంధించి బ్రిటిష్ అధికారులు తయారుచేసిన లెఖ్ఖలను పరిశీలిస్తే ఇది వాస్తవమేనని రూఢి అయింది.

"భారతదేశంలో పుట్టే పిల్లల్లో నూటికి 45 మంది అయిదో సంవత్సరం రాకముందే చనిపోతారు" అని మరొక రచయిత తెలిపాడు. బ్రిటిష్ అధికారులు తయారుచేసిన లెక్కలే దీనికీ ఆధారం.

దేశంలోని నిరక్షరాస్యతనుగురించి సభకువచ్చినవారు చాలామంది మాట్లాడారు. విద్యాశాలల సంఖ్య చాలా తక్కువ కనుక విద్యావంతులు బహు తక్కువ అని చెప్పారు. ఉన్నతవిద్యను, సాంకేతికవిద్యను బోధించే పాఠశాలలు మరీ తక్కువ. కేవలం తమ పరిపాలనను సాగించ డానికి, సాగడానికి అవసరమైన గుమాస్తాలను తయారుచేయడానికే బ్రిటిష్ వారు తమ యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నారు. వైద్యులనూ, వ్యవసాయ శాస్త్రజ్ఞులనూ, అటవీశాస్త్ర నిపుణులనూ, ఇంజనీర్లనూ, ఆర్కిటెక్టులనూ (భవన నిర్మాతలను) తయారుచేయడంలో బ్రిటిష్‌వారు ఎలాంటి వుత్సాహాన్నీ చూపలేదు.

1939 సంవత్సరపు లెఖ్ఖలను గమనిస్తే 40 కోట్ల మందిలోనూ వైద్యవిద్య నభ్యసిస్తూవున్నవారు 3,561 మందే అని తేలింది. అలాగే ఆసంవత్సరం ఇంజనీరింగు చదువుతూవున్నవారు 2,413 మందే. ఇంక ఇతర వృత్తివిద్యల నభ్యసించేవారి సంఖ్య ఇలావుంది. వ్యవసాయశాస్త్రం - 1306;పశువైద్యం - 719; అటవీ శాస్త్రం - 63; టెక్నాలజీ - 150. బ్రిటిష్ వారిని ఖండించడానికి ఈలెఖ్ఖలే చాలును.

భారతదేశం సాంస్కృతికంగా ఇంత వెనకబడివుండటానికీ, ఆర్థికంగా అధోగతిపాలుకావడానికీ పరాయిప్రభుత్వమే కారణం అని విద్యాధికులు విసుక్కుంటున్నారు; చిరాకుపడుతున్నారు. ప్రజాబాహుళ్యం వీరి అడుగుజాడల్లోనే నడుస్తూవుంది. తామనుభవిస్తూన్న బాధలన్నింటికీ సామ్రాజ్యపాలకులే కారణం అనికూడా ప్రజలు గ్రహించారు. సామ్రాజ్య ప్రభుత్వం చేసినవాటికీ, చేయనివాటికీకూడా నిందలపాలవుతూ వుంది. "భారతీయులకు కృతజ్ఞత అనేది ఏకోశానా లేదు." అని ఒక బ్రిటిష్ ఉద్యోగి అన్నాడు. అతను చిన్నవాడే. వైస్రాయిపరివారంలో వుంటున్నాడు, ఆతడు అంత కటువుగా అనటానికి కారణం లేకపోలేదు. బ్రిటిష్ వారు తాముచేసిన ఘనకార్యాలనే జ్ఞాపకం వుంచుకుంటారు. ప్రజల జీవిత ప్రమాణాన్ని వృద్ధిచేయడానికి తాము ఏంచేసిందీ దాఖలాలతో నివేదిస్తారు. కాని భారతీయులుమాత్రం బ్రిటిషువారు చేసిఉండవలసిన పనులను, చేయవలసిన పనులను ఏకరువుపెడుతూ వుంటారు.

"రైళ్ళు వేయించాంకదా" అంటారు బ్రిటిష్‌వారు. ఇందుకు భారతీయులు ఈవిధంగా సమాధానం చెప్తారు : "అమెరికా జనాభాకు మూడు రెట్లుంటుంది భారతదేశపు జనాభా. విస్తీర్ణంలో అమెరికా విస్తీర్ణంకంటే ఒకవంతు తక్కువే భారతదేశపు విస్తీర్ణం. అమెరికాలో 3,95,589 మైళ్ళ రైలుమార్గంవుంటే భారతదేశంలో 41,134 మైళ్ళ రైలుమార్గం మాత్రమే వుంది." 1939 నాటి పరిస్థితి ఇది. ఇంక విద్యుచ్ఛక్తి విషయం

వస్తే భారతదేశం గంటకు 2500 కిలో వాట్ల విద్యుచ్ఛక్తిని మాత్రం తయారుచేయగలిగింది. అమెరికాలో గంటకు 9,846 కోట్ల 40 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి తయారవుతూ వుండేది. ఇవి 1935 వ సంవత్సరపు లెక్కలు. వీటివల్ల భారతదేశంలో మనిషి 1 కి వినియోగించుకోవడానికిగల విద్యుచ్ఛక్తికి అమెరికాలో మనిషి 1 కి వినియోగించుకోగల విద్యుచ్ఛక్తి దాదాపు 120 రెట్లు ఎక్కువగా వుంటుంది. భారతదేశం పారిశ్రామికంగానూ, ఆర్థికంగానూ ఎంత వెనకబడివున్నదో దీన్నిబట్టే తెలుసుకోవచ్చు. ఆసియాలో చైనాదేశమే చాలా వెనకబడి వుందనీ, చాలా బీద దేశమనీ ఒకప్పుడు అనుకుంటూ వుండేవాళ్ళు, కాని చైనా, భారతదేశాల్లోని జీవిత ప్రమాణాన్ని పరిశీలిస్తే చైనావారికంటేకూడా భారతీయులు ఎక్కువ పేదరికాన్ని అనుభవిస్తూన్నట్లు కన్పిస్తుంది. భారతీయుల జీవిత ప్రమాణం చాలా తక్కువగా వున్నట్లు ధ్రువపడింది. ఈ విషయాన్ని అందరూ అంగీకరించారు.

భారతదేశాన్ని ఎదుర్కొంటున్న వివిధ సమస్యల్లో ముఖ్యమైంది జనాభా సమస్య. భారతదేశంలో జనన మరణముల సంఖ్య చాలా ఎక్కువ. ఈరెంటికీ కారణం అజ్ఞానమే. దారిద్ర్యంకూడా కొంతవరకూ కారణం కావచ్చు. వ్యాధిగ్రస్తుల సంఖ్యా చాలా ఎక్కువగానే వుంటుంది. ఏటా షుమారు అయిదు లక్షలమంది క్షయవ్యాధికి బలి అవుతున్నారు. మలేరియాతో బాధపడుతూవున్నవారు 12.5 కోట్లు వుంటారు. వీరిలో బహు కొద్దిమందికి మాత్రమే కైవ్వైనా లభిస్తున్నది. వీరి సంఖ్య సహస్రమానంలోకే వుంటుంది. వీటన్నింటికీ ఆధారం బ్రిటిష్ అధికారులు తయారుచేసిన నివేదికలే. శీతాతపాల్లో ఆటే తేడా ఏమీ లేకపోయినా బ్రిటిష్ పాలనలోవున్న ప్రాంతంలోకంటే భారతీయ సెటిల్మెంటుల్లో మరణ సంఖ్య చాలా ఎక్కువగా వుంటుంది. బ్రిటిష్ ఇండియా సంఖ్యకు దాదాపు అయిదురెట్లు ఎక్కువగా వుంటుంది.

శారీరక దౌర్బల్యం, వ్యాధిగ్రస్తత, విపరీతంగా చనిపోవడం.... ఇన్నివున్నా భారత దేశపు జనాభా సంవత్సరానికి 50 లక్షల వంతున వృద్ధి అవుతూవుంది. 1931 జనాభా లెఖ్ఖల ప్రకారం భారత జనసంఖ్య 33 కోట్ల 80 లక్షలు. 1941 లో తిరిగి తయారుచేసిన లెఖ్ఖల ప్రకారం ఈ జనాభా 38 కోట్ల 80 లక్షలు వున్నట్లు స్పష్టమౌతున్నది. పదిసంవత్సరాల్లో అయిదుకోట్లు పెరిగింది. భారతదేశపు మూలసమస్య, కీలక సమస్య ఇదే.

రష్యాలో పంచవర్షప్రణాళికలను అనుసరించి విపరీత ఆర్థిక విస్తరణ జరుగుతూవున్న రోజుల్లో, బ్రహ్మాండమైన పట్టణాలు, పెద్దపెద్ద పారిశ్రామిక కేంద్రాలూ వెలుస్తూవున్న రోజుల్లో, నేను రష్యాలోనే వున్నాను. అంత పెద్ద ఎత్తున పారిశ్రామిక నిర్మాణం జరుగుతూవున్నా సంవత్సరానికి పదిలక్షలమందికి మాత్రమే క్రొత్త ప్రయోజనకరమైన వుద్యోగాలు దొరుకుతూవచ్చినవి. భారతదేశంలో జనాభా అయితే విపరీతంగా పెరిగిపోతున్నది గాని పరిశ్రమల పెంపుదలమాత్రం ఏమీ తృప్తికరంగా లేదు. పారిశ్రామికాభివృద్ధి చాలా తక్కువగానే జరిగింది. ఏదో ఒకమూల ఒక యంత్రాలయం తలెత్తవచ్చు. మరోమూల పదిళ్ళు పడవచ్చు. కాని దేశం మొత్తంమీద చూస్తే ఏదో గిడసబారిపోయిన కాయ వత్తుగా వుంటుంది. పదిసంవత్సరాల క్రితం 33 కోట్ల 80 లక్షల జనాభా సర్దుకునే ఆహారాన్నే ఇప్పుడు 38 కోట్ల 80 లక్షలమంది సరిపెట్టుకోవలసి వచ్చింది. తిండివిషయంలో ఎలాగో కట్టుకునే బట్టవిషయంలోనూ పరిస్థితి అలాగే వుంది. మిగిలిన ఇతర సౌకర్యాలూ అలాగే వున్నవి. తల దాచుకొనడానికి ఇళ్ళు, చికిత్స పొందడానికి వైద్యశాలలు, చదువుకొనడానికి పాఠశాలలు ఏమీ ఎక్కువకాలేదు. మంది ఎక్కువైనకొద్దీ మజ్జిగ పల్చనయినట్లున్నది. కనుకనే భారతదేశం ఈనాడు పరమ దౌర్భాగ్యస్థితిలోవుంది. ప్రజలు క్షుదార్తులై కుమిలిపోతున్నారు. పల్లెలు,

పట్నవాసాలూకూడా ప్రజలతో క్రిక్కిరిసివున్నాయి. భారతదేశం యావత్తూ కూడా ఆకలి దప్పులకు అలమటించి పోతూవున్నవారితో, నిరాశా నిస్పృహాలతో నీరసించిపోయినవారితో పొంగి పొర్లుతూవుంది. పిన్నలు-పెద్దలు, స్త్రీలు-పురుషులు అంతా ఒకేస్థితిలో వున్నారు.

భారత గ్రామాలకుపోయి అక్కడిపరిస్థితులను స్వయంగాచూచాను. పట్నాల్లో కార్మికులు కాలక్షేపం చేసే ప్రాంతాలకూ పోయి చూచాను. "బ్రిటిష్‌వారిని గురించి మీరేమనుకుంటున్నారు?" అని వారిని అడిగాను. "మాకు అన్నంకావాలి" అని వారు బదులుచెప్పారు. యుద్ధంసంగతి ఏమనుకుంటున్నారని కూడా వారిని అడిగాను. ఆ ప్రశ్నకూ "కడుపుకాలి చస్తున్నాం" అని సమాధానం చెప్పారు.

ఆకలిబాధకు తాళలేక అరుస్తూన్న పేగుల్లో ఉత్పన్నమైనవి భారత రాజకీయాలు.

ప్రాణాన్ని నిలుపుకొనడానికి తిండి, జీవితాన్ని అనుభవించడానికి స్వాతంత్ర్యం—ఈ రెండే భారతప్రజల వాంఛితార్థాలు. దాదాపు అన్నివలసల కోర్కెలూ ఇవే. రోగంవస్తే మందిచ్చేవైద్యుడు కావాలి. మందులు కావాలి; పొట్టపోసుకోడానికి వృత్తికావాలి. కాని స్వాతంత్ర్యం ఉంటేనే ఇవి సాధ్యం. అయితే స్వాతంత్ర్యం భారత సమస్యలను పరిష్కరింపలేదు. స్వాతంత్ర్యం రాగానే ఎక్కడిసమస్య లక్కడ 'పరిష్కారమైపోవు. కాని స్వాతంత్ర్యం ఉంటే ఈ సమస్యల పరిష్కారానికి ప్రారంభించవచ్చును. పరిష్కారమార్గాన్ని బంధించినద్వారం తెరుచుకుపోయినట్లవుతుంది. బానిసత్వంపోయి, స్వాతంత్ర్యం వస్తే, ఆమార్గాన ముందుకుపోవడానికి వీలుంటుంది. అసలు దారిఅనేది కళ్ళకుకన్పిస్తుంది.

భారతదేశపు ఆర్థికసాంఘిక రాజకీయ, విద్యావిషయిక కార్యక్రమాల కీలకం బ్రిటిష్‌వారి హస్తగతమై ఉంది ఈ నాడు. భారతజాతి జీవిత అభివృద్ధికి దారితీయగల సాధన పరాయివారి పరంగాఉంది. ముఖ్యమైన

స్థితిగతులను వేటిని మార్పుచేయడానికీ భారతీయులకు శక్తి అనేది లేకుండాఉంది.

ఆర్థిక సాంఘిక అభివృద్ధికి సాధన స్వాతంత్ర్యం. ఆ స్వాతంత్ర్యం. ఉన్నతస్థితి లేనంత కాలమూ ప్రజల్లో అసంతృప్తి ఉంటూనేఉంటుంది. అసంతృప్తికి సామ్రాజ్యపాలకులూ అలవాటుపడిపోతారు. వారి తత్వం సునిశితస్థితిపోయి పండబారిపోతుంది. అసంతృప్తి ఎంత ప్రబలుతూ ఉన్నా చలనం లేకుండా సమాధిలో ఉన్నట్లు ఉండిపోతారు.

భారతదేశంలోని బ్రిటిష్ ఉద్యోగుల స్థితి చూస్తే వింతగానూ ఉంటుంది; విచారమూవేస్తుంది. తాముచేస్తున్న సేవకు, సత్కార్యాలకు ఎవ్వరూ ఒక్క మంచిమాటైనా అనరుకదా అని వ్యథపడుతున్నారు. చింతాక్రాంతులై ఉన్నారు. ప్రజలను పైకితేవడానికే వీలుగాకుండా అణచి వేస్తూన్న పీటమీద తాము తిష్ఠవేశామనీ, తమ భూమిక ఏ విధంగానూ సమర్థనీయం కాదనీ వీరు గ్రహించరు. కాని ఆ విషయజ్ఞానం వారికి లేక పోలేదు. ఈ జ్ఞానంవల్ల వారి నైతికవిశ్వాసం సన్నగిల్లిపోయింది. భారత దేశాన్ని పాలించాలనే వాంఛఅంటే తాము పాలించినంతకాలమూ అది న్యాయంగానే ఉన్నదికదా అని బ్రిటిష్‌పాలకులకు కలిగే భావమే, భారత దేశంలో బ్రిటిష్‌పాలన ఉండాలనడానికి కారణంగానూ, సాకుగానూ కన్పి స్తున్నది.

భారతదేశంలో ఇంతవరకూ చేసిన పనులు, నిర్వహించిన కార్యాలూ బాగానే ఉన్నవని ఇతరులు మెచ్చుకుంటే ఈ క్షణం భారతదేశంనుండి వైదొలగడానికి బ్రిటిష్ ఉద్యోగులు సిద్ధంగా ఉన్నారనే భావం నాకు భారత దేశంలో ఉంటున్నప్పుడు కలిగింది. భారతదేశం చాలా విచారగ్రస్తమై ఉంది. దేశంలో ఎక్కువగా క్షోభపడుతున్నవారు, విచారమనస్కులై వున్నవారు బ్రిటిష్‌ఉద్యోగులే. భౌతిక అవసరాలను గమనిస్తే వీరికి తక్కువైంది ఏమీలేదు. చాలామందిసుఖంగా జీవిస్తున్నారు. కొందరు

సిరిసంపదలతో తులతూగుతూ ఆడంబరంగా కాలక్షేపం చేస్తున్నారు. కాని వీరు ఏకాకులు, వీరిది అదొకప్రపంచం. ఇతరులతో సంపర్కంగాని, సంబంధంగాని లేదు. తాము కేవలం అజాగళ స్తనాలవలే ఉన్నామని కూడా వీరు గ్రహించారు.

సామ్రాజ్యాలు సామ్రాజ్య వాదులకూ, వలసదేశాలకూ కూడా తగనివి. అంతేగాదు. ప్రపంచానికంతకూ కూడా పనికిరానివి సామ్రాజ్యాలు. మొత్తం ప్రపంచ జనాభాలో దాదాపు ముప్పాతికమంది పశువులవలె జీవించడం చెడుపుకాదా ? అది ఎవరికి మంచిది ?

చైనా త్రిశంకుస్వర్గంలో వుంది. అటు సంపూర్ణస్వాతంత్ర్యం బ దేశమూ కాదు; ఇటు వలసరాజ్యమూ కాదు.

చైనా, ఇండియా, ఆసియా, ఆఫ్రికాలలోవి ఇతర వలసదేశాల్లోని 200 కోట్ల జనాభా స్థితిగతి విచారిస్తే వీరిలో ఇంచుమించు ముప్పాతిక మంది అర్ధాకలితో, చాలీ చాలని బట్ట కట్టుకొని, ఉండేందుకు సరియైన కొంప లేకుండా, సాంస్కృతిక అవసరాలుతీరక దేహయాత్ర అలా సాగిస్తూ ఉన్నారు. ప్రపంచంలో దాదాపు నాల్గింట మూడువంతులమంది డబ్బు ఎలా ఉంటుందో ఎరుగనిస్థితిలో ఉన్నారు: ఆర్థికపు ఎడారుల్లో ఉంటున్నారని చెప్పవచ్చు. వారు తయారుచేసే సరుకూ, వాడుకునేసరుకూ చూస్తే సిగ్గుతో తలవాల్చుకోవలసి వస్తుంది. ఈస్థితి మనందరికీ బాధాకరమైనదే.

అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో ముప్పాతికభాగం ఉన్నట్లుండి హఠాత్తుగా ఎడారై పోయిందనుకోండి. యంత్రాలయాలు లేక, ప్రజలు వుండేందుకు ఇళ్ళులేక, రాకపోకల సౌకర్యాలు మృగ్యమై, టెలిఫోను టెలిగ్రాఫు సౌకర్యాలు వుండీ వుండనట్లుగా వుండి, పొలాలు బీడువేసి పోయినస్థితిలో ఇంత మేర ఉండిపోతే మిగిలిన నాల్గోవంతు అమెరికాకు ఈ ద్రవ్యం సంక్రమింపదు సరికదా, అంతవరకు అది పేదరికాన్ని అనుభ

వింపవలసి వస్తుంది. అలాగే మొత్తం ప్రపంచంలో ముప్పాతికభాగం అర్థికంగా అధోగతిపాలై, అక్కడిప్రజలు రూపాయికి మొఖంవాచివుంటే మిగతా భూభాగంలో వుండే 50 కోట్ల ప్రజలూ దరిద్రులౌతారు. వీరు తరచు అర్థికమాంద్యాలను ఎదుర్కోవలసి రావచ్చు. వీరికి భద్రత అనేది ఉండదు; శాంతి అనేది అలభ్యం. అంతేగాదు. తరుచు యుద్ధాల్లో త ర్కోవలసి వస్తుంది.


హెన్రీ వాలెస్

సామ్రాజ్యాలు తరచు సంగ్రామాలకూ, ఆర్థిక మాంద్యాలకూ దారితీ స్తవని అభిప్రాయపడి నందువల్లనే సమ్నర్ వెల్స్, వెండల్ విల్కీ, హెన్రీవాలెస్, ఇతరులు మరికొందరూ సామ్రాజ్య వ్యతిరేకులైనారు. ఆ కారణంగానే అమెరికా వలసలను అపేక్షించడం లేదు. సామ్రాజ్యదేశం కావాలనే తాపత్రయం అమెరికాకు లేకపోవడానికికూడాఆదేశరాజ్యాంగ వేత్తలు ఈవిషయాన్ని గ్రహించివుండటమె కారణం. అమెరికా ప్రభుత్వలక్ష్యాలను వివరిస్తూ ప్రభుత్వ సమీప ప్రాచ్యశాఖ ఉద్యోగి హెన్రీ యస్. విలార్డ్ 1943 ఆగస్టు 19 వ తేదీన ఇలా ప్రకటిం

చాడు: "ఈ ప్రభుత్వం సంప్రదాయ సిద్ధమైన విధానాన్నే అనుసరిస్తూవుంది. అందుచేతనే అఖిలప్రపంచాన్నీ ఒకే దృష్టితో చూస్తూవుంది. ఇతర దేశాల వలసలపై అమెరికాకు ఎలాంటి అపేక్ష లేదు; లేకపోవడానికి కారణం అమెరికా ప్రభుత్వ సంప్రదాయమే." స్వప్రయోజనంకోసరం ఆఫ్రికాలో కొన్ని ప్రాంతాలను సంపాదించాలని అమెరికా ప్రయత్నిస్తున్నదని ప్రబలిన వదంతులు నిరాధారములనీ, పచ్చి అబద్ధాలనీ ఖండిస్తూ విలార్డ్ అమెరికా ప్రభుత్వ లక్ష్యాలను పైవిధంగా వివరించాడు. అమెరికా ప్రభుత్వాభిప్రాయాలనే ఆనాడాయన విస్పష్టంగా, అసందిగ్ధంగా ప్రకటించాడన డానికి ఎలాంటి సందేహమూ లేదు.

ఇతరదేశాలపై ఆధిపత్యం సంపాదించడానికీ, దౌర్జన్యపద్ధతుల నవలంబించి, దేశాల నాక్రమించడానికీ ఎంత విచారించినా ఒకటేకారణం కనిపిస్తుంది. సామ్రాజ్యదేశాలకు తమ పరిశ్రమలను వృద్ధిచేసుకోవడానికి చౌకగా ముడిపదార్థాలు కావాలి. ఆ ముడిపదార్థాల సంపాదనకు వలసల సంపాదన అవసరం అని వారు భావిస్తారు. కాని ముఖ్యమైన ముడిపదార్థాలు అందరికీ అందు బాటులోవుండాలనీ, దేశంయొక్క ఎక్కువ తక్కువలతో నిమిత్తం వుండరాదనీ విలార్డ్ ఆ సందర్భంలో స్పష్టంచేశాడు. కనుక అమెరికా సూచించిన పద్ధతిని ముడిపదార్థాల పంపకం జరిగితే, ఆ ముడి పదార్థా లన్ని దేశాలకూ సమానంగానే లభిస్తూవుంటే వాటినిమిత్తం యుద్ధంచేయవలసిన, దురాక్రమణ సాగించవలసిన అవసరం వుండదు. అమెరికా ప్రభుత్వలక్ష్యాలు వివరించే సందర్భంలో విలార్డ్ మరొకటి రెండుసూచనలు కూడా చేశారు. కొన్ని వలస లికమీదట వ్యక్తిగతంగా ఒకరాజ్యం ప్రాజాపత్యంకింద వుండటంకంటే అవి అంతర్జాతీయ ధర్మ కర్తృత్వంలో వుండటం మేలని సూచిస్తూ, ఏ ప్రాంతంపైనా అధికారం వహించడానికి గాని, ఏ ప్రాంతానికి ధర్మకర్తగా వుండటానికిగాని అమెరికా ఒంటరిగా బాధ్యతవహించదని విలార్డ్ విస్పష్టంచేశాడు. ఇలా

జరిగితే, ముడిపదార్థాల సముపార్జన దురాక్రమణ సాగించడానికి సాకు కానేరదు.

వలస దేశాలపై బహుజాతుల ఆధిపత్యం వుండాలని అమెరికా కోరుతూవుంది. వలసదేశాలపై ఒకేఒక దేశానికి ఆధిపత్యంవుంటే, ఆ వలసల్లో ఇతరదేశాలకు ప్రవేశంవుండదు. ఈ అన్యదేశాల ప్రవేశ నిషేధాన్ని వుపేక్షించినా, ప్రతిఘటించినా యుద్ధాలకు దారితీస్తూవుంటవి. అంతే గాదు. ఈ నిషేధంవల్ల వలసదేశ ప్రజల స్థితి మరీమరీ అధ్వాన్నమైపోతూ వుంటుంది. ప్రజల్లో అసంతృప్తి ప్రబలిపోతుంది.

అన్యులకు లభ్యంగా వుండేటట్లు అన్నిద్వారాలూ బిగించుకొని వలసలలో పీఠాలు వేసుకుకూర్చునే సామ్రాజ్యాలే మన ప్రపంచంలో దాదాపు ముప్పాతికభాగం బీదగా వుండటానికీ, ప్రజలు ఈతిబాధలకు లోనవుతూ సౌఖ్యంఅనేది ఎరుగని జీవితం గడపడానికీ, ఇంతప్రాంతం ఆర్థిక ఎడారి కావడానికీ కారణం.

ఇది వైమానికయుగం. దూరాలు దురాక్రమణకు అడ్డురావు. ఆప లేవు. అమెరికా సువిశాలదేశం. బాగా డబ్బున్నదేశం. రోజు రోజుకూ వృద్ధిఅవుతూవున్న దేశంకూడా. ఈ కారణంగా అమెరికా అగ్రరాజ్యాల్లో అగ్రరాజ్యంగా, ప్రపంచరాజ్యాల్లో ప్రథమరాజ్యంగా తయారైనది. కనుక అమెరికాకు నిర్లిప్తత పనికిరాదు. అంతర్జాతీయత అవసరం, పరాధీన ప్రజల సర్వతోముఖాభివృద్ధి చాలాముఖ్యం. అమెరికా సామ్రాజ్యవ్యతిరేక దేశం కావడానికి నాయకుల ఆదర్శవాదం కొంత హేతువే అయినా, హెచ్చుగా పారిశ్రామిక అమెరికా స్వప్రయోజనాకాంక్షే కారణం. స్వేచ్ఛ అన్నింటికీ మంచిదే. ఇహానికీ పరానికీకూడా ప్రయోజనకరమైంది, శాంతికీ వ్యాపారానికీ కూడా లాభదాయకమైంది స్వాతంత్ర్యం. ఈ అర్థికబయళ్లు, ఎడారులు ఏ దేశానికీ, ఏ ఉద్యమానికీకూడా ఉపయోగపడవు. రవాణా సౌకర్యాల వృద్ధివల్ల, శాస్త్ర పరిశోధనకాలాన్నీ, దూరాన్నీకూడా జయించి

వేసినందువల్ల ప్రపంచం చాలా చిన్నదై పోయింది. దూరంభారం కానందు వల్ల ప్రపంచంఅంతా ఒకేదేశంవలె తయారైంది. ఈ విధంగా చిన్నదై పోయిన ప్రపంచవిస్తీర్ణం ఈ ఆర్థిక ఎడారులవల్ల మరింత తక్కువై పో తున్నది. చివరికి సుఖంగా కాలక్షేపం చేయడానికీ, సౌఖ్యజీవనానికీ తావే లేకుండాపోయింది.

సాంఘికఅభివృద్ధి లేనిది శాంతిసాధన సాధ్యంగాదని బ్రిటిష్ విదేశాంగమంత్రి ఆంథోనీ ఈడెన్ ప్రకటించాడు. అతి మామూలు ధోరణిలో ప్రకటితమైన ఉదాత్తభావం ఇది. కాని ఈ సత్యాన్ని జావా, మొరాకో, భారతదేశాలకు వర్తింప జేయకపోతే ఇంతటి ఉదాత్తభావం నిరర్థకమై పోతుంది. సాంఘికాభివృద్ధి ఎంత విస్తృతమైతే శాంతిని స్థాపించడం, రక్షించడం అంత తేలికపని అవుతుంది

భారత, సామ్రాజ్య సమస్యల కీలకం ఇదే.

బ్రిటన్ భారతదేశ సంబంధాలు కొంతవరకు వ్యాపారబంధాలు. తమ వ్యాపారాభివృద్ధికి గాని, తమ లాభానికిగాని భారతదేశం తమకు అవసరంలేదని బ్రిటిష్‌వారు ఎడతెగకుండా ఎలుగెత్తి చాటుతూ వుంటారు. ఆ విధంగా వారు వాదింపవచ్చు. తమ వాదాన్ని బలపరచుకోవడానికీ, సమర్థించుకోవడానికీ ఏవో లెక్కలూ పేర్కొనవచ్చు. కాని విన్‌స్టన్ చర్చిల్ ఇంద్రజాల మహేంద్రజాలంలాంటి పదజాలంముందు ఈ "మంచు" ఇట్టే కరిగి ఊరుకుంటుంది. ఈ వాదం గాలిపోయిన బెలూనువలె చప్పబడి పోతుంది. "ఈ చిన్నదీవిలో 4 కోట్ల 50 లక్షల ప్రజలువున్నారు. మన ప్రజల జీవితప్రమాణం వున్నంత హెచ్చుగా యూరపు దేశాల్లో ఏ దేశపు ప్రజజీవితప్రమాణమూ లేదు. మనం ఇంతసామ్రాజ్యంగా వుండగా, ప్రపంచవ్యాప్త సంబంధాలూ, వ్యాపారమూ లేక వుంటే వీరిలో దాదాపు మూడవవంతు జనం అధఃపతనాన్నిపొంది అధోగతినైనా చేరుతుంది. లేక పూర్తిగా అంతరించనైనా అంతరిస్తుంది." అని 1935.వ సంవ

త్సరం జనవరి 29 వ తేదీన ఒక బ్రాడ్ కాస్ట్ ప్రసంగంలో విన్‌స్టన్ చర్చిల్ ఉద్ఘాటించాడు.

బాధాభరితమైన, పురాతనమైన చర్చిల్ ప్రపంచంవిషయంలో చర్చిల్ అన్న మాటలు అక్షరాలా నిజం. కాని ఆ సత్యం అమరంకాదు. భిన్నప్రపంచంలో పరిస్థితులు భిన్నంగా ఉండవచ్చును. ముప్పాతికభాగం బీడువారి సహారాఎడారిలాగా వుండి, పాతికభాగం సస్యశ్యామలంగావున్న ప్రపంచం గురించి చర్చిల్ ఆలోచిస్తున్నాడు. కాని నలభై కోట్ల భారతీయులు కాళ్ళకు జోడువేయడం ప్రారంభిస్తే, నలభై అయిదుకోట్ల చైనా వారు బూడ్సులువేసుకొని షరాయిలుతొడగడం ప్రారంభిస్తే, ఈ 85 కోట్ల ప్రజల అవసరాలను తీర్చగల యంత్రాలయాలు భూనభోంతరాల మధ్య ఎక్కడా కనిపించవు. అథవా యంత్రాలయా లున్నా, వాటిలో పని చేయడానికి కూలీలు దొరకరు.

నేడు దుర్భిక్షంగా, ఎడారుల్లాగా వున్న భూభాగాన్ని సేద్యంచేస్తే, ఆ ప్రాంతానికి నీరుపెట్టి సాగుచేస్తే, సామ్రాజ్యం విచ్ఛిన్నమైపోతే నిర్వ్యాపారత ఎక్కువైపోతుందని కలవరపడి, అట్టి విచ్ఛిత్తిని నివారించడానికి ఆందోళనచేసే చర్చిల్ ప్రభృతులు భారతదేశం స్వతంత్రమైతే కంగారుపడవలసిన అగత్యమేవుండదు. ఇప్పటి ఎడారులను సాగుకు లాయికీగా చేయడానికీ, సాగుచేయడానికీ పూనుకుంటే బ్రిటన్ అమెరికాలకు చేతినిండా పనివుంటుంది. నిరుద్యోగసమస్య అనేది ఆ దేశీయులను బాధించదు.

ఎదుగూబొదుగూలేక ప్రపంచం నిలకడగావుంటే, ప్రజల కొనుగోలు శక్తి చాలా పరిమితంగావుంటే, భారతదేశం అప్పుడు స్వతంత్రమైతే బ్రిటిష్ ఆర్థికవ్యవస్థ దెబ్బతినేమాట వాస్తవమే. కాని స్వాతంత్ర్యాన్ని పొందడంవల్ల కోట్లకొద్దిప్రజలు తమ కొనుగోలుశక్తిని వృద్ధిచేసుకుంటే, చేసుకోగలిగితే ప్రపంచం అచలనంగా వుండదు. సామ్రాజ్యాల భస్మాసుర

హస్తం పోతుంది. భారతదేశమూ, ఇతర వలసలూ అభివృద్ధిపొందడానికి ఇప్పుడున్న కృత్రిమ అవరోధాలు పోతవి. సామ్రాజ్యం విచ్ఛిన్నం కావడంతో ఇప్పటి ధనాభావం, దుర్భిక్షం, ఎడారులు అంతరించిపోతవి. చైనా భాగ్యవంతమౌతుంది. సామ్రాజ్యం విచ్ఛిన్నమైన మర్నాటికి కాక పోయినా క్రమంగా భారతదేశంకూడా ధనికదేశం అవుతుంది. కాని ఇలాంటి పరిణామానికి ఇతరదేశాల పెట్టుబడి, సహకారం, ఆర్థిక సహాయం చాలా అవసరం. క్రమంగా ఈదేశాలు ఎక్కువగా కొన గలుగుతవి; ఎక్కువగా అమ్మగలుగుతవి. ఈ వ్యాపార లావాదేవీలవల్ల అన్ని దేశాలూ లాభిస్తవి. ముఖ్యంగా బ్రిటన్ బాగా లాభాన్ని పొందుతుంది.

ప్రజల జీవితప్రమాణం అభివృద్ధిమార్గాన ప్రయాణంచేస్తుంటే, అదీ అతివేగంగా జరుగుతూవుంటే నిర్వ్యాపారత అనేది వుండదు. ఆత్మ వినాశకరమైన పోటీలు, ఆర్థికపు గోడలనుకట్టే అధికసుంకాలు అవసరం వుండదు. వలసదేశాలు ఉండ పనిలేదు. అస్థిరత్వం అనేదే అంత రిస్తుంది.

అమెరికాఖండంలోని పదమూడు వలసలు స్వతంత్రమైనందువల్ల బ్రిటన్ లాభాన్ని పొందింది. అలాగే రేపు భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందితే బ్రిటనే లాభంపొందుతుంది. సత్యాన్ని తెలుసుకోలేక, అసలు విషయాన్ని అర్థంచేసుకోలేక బ్రిటిష్‌వారు కొందరు అమెరికా బ్రిటిష్ సామ్రాజ్యంనుండి విడిపోవడాన్ని ప్రతిఘటించారు. అలాగే ఇప్పుడు భారతదేశం విషయంలోనూ వ్యవహరిస్తున్నారు. స్వల్ప వ్యాపార ప్రయోజనాలకోసరం, సామ్రాజ్యంవల్ల సంక్రమించే రాజకీయాధికారం కోసరం వీరు ఈవిధంగా ప్రవర్తిస్తున్నారు. కాని ఇది 18 వ శతాబ్దపు 'టోరీ' తత్వం. వాస్తవ విషయాలను విచారిస్తే భారతదేశం సామ్రాజ్యం నుండి విడిపోవడంవల్ల బ్రిటన్ ఎంతో లాభాన్ని పొందుతుంది. అస్థిర మైన ప్రయోజనాలు గణనీయమే అయినా వీటన్నింటినీ మించిన గొప్ప

నైతికబలాన్ని పొందుతుంది బ్రిటన్. రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందడానికి అఖిల ఆసియా నిరంతర, తీవ్రకృషి చేస్తూవుంటే సామ్రాజ్యాలు దండుగమారి సంస్థలు అవుతవికూడా, మర్యాదగా, సమరసభావంతో, సరసంగా సామ్రాజ్యవాదులు వలసలనుండి వైదొలగితే సామ్రాజ్యాలు కూడా బాగుపడతవి.

అనేకమంది బ్రిటిష్‌వారు, డచ్‌వారు, ఫ్రెంచివారూ ఈ సత్యాన్ని గ్రహించారు. కాని ఇలాంటివారి అభిప్రాయాలకు వారివారి దేశాల్లో గల అధికారం, ప్రాబల్యం అత్యల్పం. ముందుముందు వారి అభిప్రాయాలకు ఎక్కువ విలువ ఏర్పడవచ్చును. వర్తమానకాలంలోమాత్రం బ్రిటన్, హాలెండ్, ఫ్రాన్స్, పోర్చుగల్ మొదలైన దేశాల్లో చర్చిల్ వర్గీయుల మాటే చెల్లుతూవుంది. వారికే ఎక్కువ అధికారం, బలం, ప్రాపకం వుంది. వీరు ఈస్థితిని రక్షించడానికి, ఈస్థితికి భంగం కలగకుండా ఉండటానికి పోరాడుతూవున్నారు. సామ్రాజ్యంవుంటే వీరికి ఈపోరాటంలో ఉపయోగకరంగా వుంటుంది. భారతదేశం సామ్రాజ్యంనుండి విడిపోతే బ్రిటన్ మొత్తంమీద ధనవంతమౌతుంది; కాని కొందరు బ్రిటిష్‌వారి ఆర్జన తగ్గిపోతుంది; వారి రాజకీయాధికారం తగ్గిపోతుంది. వీరి అభిప్రాయాలను అనుసరించే ప్రభుత్వవిధానాలు నిర్ణయమౌతూ వుంటవి. వీరి మాటప్రకారమే ప్రభుత్వ వ్యవహారాలు జరుగుతూవుంటవి. వీరి అభీష్టానుసారం, వీరి మాటప్రకారం బ్రిటిష్‌ప్రభుత్వం భారతదేశాన్ని తనకిందనే వుంచుకుంటుంది. ప్రతీపశక్తులకు వర్గఅభిమానమేగాని దేశాభిమానం వుండదు. కనుకనే బ్రిటన్‌లోని సంకుచిత సామ్రాజ్యవాదులు, భారతదేశంలో ప్రతీఘాతశక్తులుగావున్న ధనవంతులూ, భూస్వాములూ చేరి యథాస్థాయిని కాపాడేందుకు, తమపట్టును నిలుపుకోడానికి, ఈ ఆర్థిక ఎడారులు సస్యశ్యామలం కాకుండావుండటానికి కృషిచేస్తూవుంటారు. ఈ విధంగా వీరు ముందుచూపు అనేది లేక, కేవలం గతాన్నే తలపోసు

కుంటూ ప్రపంచాభివృద్ధిని అరికట్టడానికీ, దాదాపు ముప్పాతికమంది ప్రజలు దరిద్రులుగా ఉండేటట్లు చేయడానికీ ప్రయత్నిస్తూవుంటారు.

ప్రధానంగా బ్రిటిష్ సేనల పుణ్యాన, కొద్దిగా అమెరికన్ సేనల సహాయఫలితంగా ఆఫ్రికాలో ఇటలీ సామ్రాజ్యం పతనమందింది. ఈ సంఘటన ఆసియాలోని వలస సమస్యాపరిష్కారానికి నూతనమార్గాన్ని సూచించింది. 1943 వ సంవత్సరం సెప్టెంబరు 21 వ తేదీన బ్రిటిష్ కామన్సుసభలో మాట్లాడుతూ ఇటాలియనులనుగురించి చర్చిల్ ఇలా ప్రకటించాడు: "వారి (ఇటాలియనుల) సామ్రాజ్యం అస్తమించింది" అని బల్లగుద్ది చెప్పి "తిరిగి సంపాదించడానికి సాధ్యంగాకుండా పోయింది." అని విచ్ఛిన్నమైపోయిన ఇటాలియను సామ్రాజ్యాన్ని పునఃస్థాపించడం ఎవరితరమూ కాదన్నట్లు స్పష్టంచేశాడు. కామన్సుసభ హర్షించింది. సభ్యులు యావన్మందీ ఆమోదసూచకంగా హర్షధ్వానాలు చేశారు. ఇందువల్ల ఏంతేలుతుంది? ప్రస్తుతం బ్రిటిష్‌వారి రక్షణలో వున్న అబిసీనియా తిరిగి ఇటలీవశం కాదన్నవిషయం స్పష్టమైంది. ఉత్తరఆఫ్రికావిషయమూ అంతే.

లోగడ శత్రురాజ్యాల వలసలుగావున్న దేశాలపై తాను ఒంటరిగా ఆధిపత్యం వహించనవి అమెరికా అసందిగ్ధంగా ప్రకటించింది. అలాంటప్పుడు వెనుకబడివున్న వలసదేశాలకు అంతర్జాతీయ ధర్మకర్తృత్వమే వాంఛనీయం, అవసరం అని తోచడంలేదా? స్పష్టంకావడంలేదా?

వెనుకబడి, ఇంకా స్వపరిపాలనకు పక్వంగాని, స్వాతంత్ర్యాన్ని సమర్థించుకొన శక్తిలేని వలసలకు అంతర్జాతీయ ప్రాజాపత్యం, స్వపరిపాలనకు, సంపూర్ణస్వాతంత్ర్యానికి తగివున్న దేశాలు సర్వతోముఖంగా, సమగ్రంగా అభివృద్ధికావడానికి సమిష్టిసహాయం ఈరెండూ జరిగేటట్టు చూడటమే ఈ వైమానికయుగంలో, అంతర్జాతీయత ప్రపంచదృక్పథం వృద్ధిఅవుతున్న ఈరోజుల్లో వలససమస్యాపరిష్కారానికి ఏకైకమార్గం.

ఆయుధబలాన్ని స్వాతంత్ర్య రాజకీయాలతో మేళవిస్తే సంగ్రామాల్లో సత్వరం, సుళువుగా విజయాన్ని సాధింపవచ్చును. వలసదేశముల వారికి స్వాతంత్ర్యాన్ని ఇచ్చివేయండి; భవిష్యత్తు బాగుంటుంది అని వారికి హామీ ఇవ్వండి. అప్పుడు ఈ వలసప్రజ యావత్తూ ఫాసిజాన్ని నిర్మూలించడానికి ప్రాణాలకు తెగించి మరీ పోరాడుతారు. మిత్రరాజ్యాలతో అక్షరాజ్యాలను హతమార్చడానికి సహకారంచేస్తారు. అలా చేయకపోతే తాము తిరిగి ఫాసిజానికి బానిసలు అవుతారు. ఆసంగతిని వారుగ్రహించారు కూడా.

సామ్రాజ్యవాదం సమసిపోవడంతో, సామ్రాజ్యాలు విచ్ఛిన్నం కావడంతో నవ్యప్రపంచం ఆరంభమౌతుంది. మరోప్రపంచం ఉత్పన్నమౌతుంది. కనుకనే పాతకాలపు ప్రముఖులు, పూర్వాచార పరాయణులు సామ్రాజ్య యుగాంతాన్ని. సామ్రాజ్యవిచ్ఛిన్నాన్ని తీవ్రంగా సర్వశక్తులా ప్రతిఘటిస్తున్నారు. వారలా ప్రతిఘటించడంలో ఆశ్చర్యం లేదు. వారి కది సహజమే. నవ్యప్రపంచ నిర్మాణానికి నూతన వ్యవస్థా ప్రతిష్ఠాపనకూ జరిగే యీ యుద్ధం సాగుతూవుండగానే యీసంఘర్షణ ప్రారంభంకావడంలో అస్వాభావికం ఏమీలేదు.

ఈయుద్ధం సరికొత్త ప్రపంచ నిర్మాణానికైనా దారితీస్తుంది; లేదా మరొక భయంకరయుద్ధానికైనా దారితీస్తుంది.

బ్రిటన్ యుద్ధంలోకి దిగితే, యుద్ధక్రమంలో తన బ్రిటన్, ధనికుల ప్రభువులబ్రిటన్ నామరూపాలులేకుండా పోతుందనీ, తనవర్గానికి శాశ్వతగ్రహణం పడుతుందనీ చేంబర్లీన్. పాపం, భయపడిపోయాడు.

ఎలాగైనా యుద్ధాన్ని నివారించాలని నిశ్చయించుకున్నాడు. ఆప్రకారం నాజీలను తృప్తిపరచడానికి పూనుకున్నాడు.

ఇద్దరూ ఒకే పక్షానికి, వర్గానికి చెందినవారే. అయినా నెవిల్లీ చేంబర్లీన్‌కూ, విన్‌స్టన్ చర్చిల్‌కూ చాలా తేడావుంది. యుద్ధంలో దిగి యుద్ధాన్ని జయించి వెనుకటిమాదిరిగానే ఉండటం ఎలాంటి బ్రిటన్‌కూ సాధ్యంగాదని చర్చిల్ గుర్తించాడు. ఆసంగతిని స్పష్టంగా ప్రకటించాడు. చర్చిల్ సంగ్రామప్రియుడు. సంఘర్షణ అంటే అతనికి చాలా ఇష్టం. మంచి యోధుడు. వెనక్కు తిరగడాన్నిగాని, పరాజయాన్నిగాని ఆమోదించడు. అంగీకరింపడు. పూర్వాశ్రమ బ్రిటన్‌కొరకే చర్చిల్‌కూడా పోరాడుతూవున్నాడు. అయితే అతను కొన్ని సంస్కారాలను అంగీకరిస్తాడు; అతను వాంఛించేది, స్థాపింప సంకల్పించేది అవసరమైన కనీససంస్కారాన్ని పొందిన పూర్వాశ్రమ బ్రిటన్. ఆబ్రిటన్‌లో భారత దేశంకూడా చేరేవుంది.

చర్చిల్ భారతదేశాన్ని నిలుపుకోవడానికే పోరాడుతూ ఉన్నాడంటే అతనూ వెనుకటి బ్రిటన్‌ను, పూర్వప్రపంచాన్ని నిలపడానికే నిశ్చయుడై ఉన్నాడని విదితమౌతున్నది. పూర్వాశ్రమాన్ని కాపాడేందుకే అతను పోరాటం సాగిస్తూవున్నాడు. ఈ పోరాటంలో విజయుడైతే చర్చిల్ భారత దేశాన్ని తనవశంలోనే ఉంచుకోగలుగుతాడు. ఈవిధంగా భారతసమస్య దేశపు ఎల్లలను అధిగమించిపోతున్నది. భారతసమస్య ఒక్క భారత దేశానికి మాత్రమే సంబంధించినదికాదని స్పష్టమౌతున్నది. వీటన్నిటి విచారణవల్లా తేలే పర్యవసానం ఏమిటి? అసలు ప్రశ్న ఏమిటి?

శాంతియుత నవ్యప్రపంచంలో బ్రిటన్ కొత్తరూపాన్ని, నవ్యతను పొందివుండటమా? లేక పాతప్రపంచంలో పాత బ్రిటన్‌లో వుండటమా? ఇదే అసలు ప్రశ్న.

భారతదేశంలో నలభైకోట్ల ప్రజలున్నారు. ఆ జనాభాసంఖ్య చాలు

భారతసమస్యను ప్రధానసమస్యగా చేయడానికి. కాని భారత దేశం కేవలం అటు హిమాలయాలనుంచి ఇటు కన్యాకుమారివరకూ, అటు బర్మానుంచి ఇటు ఇరాన్‌వరకూవున్న భూభాగంమాత్రమే కాదు. ఎల్లలను దాటింది భారతదేశం, అదేవిధంగా సామ్రాజ్యంకూడా సామ్రాజ్య సరిహద్దులను దాటింది. ప్రపంచ నాగరికత, సర్వమానవకోటి భవిష్యత్తు ఈ రెండు సమస్యలమీదా ఆధారపడివుంది. శాంతి సమస్యాంశలలో భారతసమస్య ఒక అంశం. అంతేగాదు; శాంతిసమస్య ఆద్యంతం భారతసమస్య. అందువల్ల శాంతిసమస్యనుండి భారతసమస్యను వేరుచేయడానికి వీలులేదు.

అంతర్జాతీయత. సామ్రాజ్యవాదం పరస్పరవిరుద్ధమైనవి. రెంటికీ పొత్తుకుదరదు. సామ్రాజ్య సంరక్షణకూ, సామ్రాజ్య సంపాదనకూ జరిగిన పోరాటంవల్లనే నానాజాతిసమితి నిర్జీవమై, నిరుపయోగమై చివరికి విచ్ఛిన్నమైపోయింది. నూతనమైన, న్యాయ్యమైన అంతర్జాతీయసమితి స్థాపనకు అవరోధాలను కలిగించీ, స్థాపనానంతరం కార్యక్రమానికి విఘ్నాలు కలిగించీ, నాశనంచేసివేస్తుంది. సామ్రాజ్యతత్వం, రానున్న యుగానికి సన్నద్ధమౌతూ గతించినకాలపు పరికరాలను ఉపయోగింప బూనుకోవడం అవివేకంకాదా? 1975 వ సంవత్సరం నిమిత్తం ఒక సౌధాన్ని నిర్మింపదలచి, 1775 వ సంవత్సరపు పరికరాలను, ఇటుకలను వాడడం వివేకవంతుల లక్షణంకాదు. భూతకాలం భవిష్యత్తుకు సహాయకారిగా వుండాలిగాని ప్రతిబంధకాలను కలిగించేదిగా ఉండరాదు.

వర్తమానస్థితికి భిన్నమైన భవిష్యత్తు కావాలనే గాఢవాంఛే శాంతి కాలంలో ఫాసిజం వ్యాపించడానికి కారణమైంది. ఈ ఫాసిజం జర్మనీ, ఇటలీ, జపాన్ దేశాలను జయించింది. ప్రాకృతావస్థకు భిన్నమైనట్టిది. ఇంతకంటే మెరుగైనట్టిది నవ్యవ్యవస్థ కావాలనే వాంఛ, యావ ఈ ఆధునికయుగంలో చాలా శక్తివంతమైనదిగా వుంది. శక్తివంతమైనదే

గాదు; అత్యంతప్రధానమైంది: అలక్ష్యంచేయ వీలుగానిదీకూడా. ఆవాంఛ, ఆ యావ సవ్యమైనది, సమంజసమైనది; న్యాయ ధర్మములకు బద్ధమైనది. దురాక్రమణదారులు, సామ్రాజ్యప్రియులు ఈ తృష్ణ, యీ యావ వక్ర మార్గాలను అనుసరించునట్లు చేయవచ్చు, అందుకు తగినట్టుగా వాటిని పోషించి ప్రోత్సహింపవచ్చును. కాని వివేకంగల రాజ్యాంగవేత్తలు ఈ తృష్ణను, యావను స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సౌఖ్యం, శాంతి గల స్వర్ణ యుగాన్ని ప్రారంభించుటకు వినియోగింపవచ్చును. శాంతిసౌభాగ్యాలు, సౌఖ్య స్వాతంత్ర్యాలు గల ప్రపంచమే శాంతియుతంగా ఉండగలదు. అలాంటి ప్రపంచంలోనే శాంతి మనగలదు.

ఇంతవరకూ సాగిన సంగ్రామాలన్నీ ఒక ఎత్తు: ఇప్పుడు జరుగుతూన్న సంగ్రామం ఒకఎత్తు. వెనుకటి యుద్ధలక్ష్యాలకూ, ఇప్పటి యుద్ధలక్ష్యాలకూ చాలా తేడావుంది. వెనుకటిరోజుల్లో కేవలం యుద్ధాన్ని జయించడమే కక్షదారుల లక్ష్యంగావుండేది. ఇప్పుడు అది మారి పోయింది. యుద్ధాన్నీ, యుద్ధానంతరాన్నీ జయించాలని ప్రజలూ, ప్రభుత్వాలూ కూడా భావిస్తున్నారు. రాజకీయ రణరంగాలలో రెంటిలోనూ విజయాన్ని సాధించడానికి వీలైనట్టి సైనికవ్యూహం తయారుకావచ్చును. "రాచకీయాలను చర్చించడం మానివేసి విజయాంతం యుద్ధంసాగిద్దాం" అని ఘోషించేవారు తమమాటల ఆలకించేవారు ఎవ్వరూ లేరు అనే భయాన్ని ప్రదర్శిస్తున్నారు. కాని నేటి సంగ్రామమూ, ఈ సంగ్రామ భూత భవిష్యత్తులూకూడా రాజకీయాల ఫలితమే. అసలు ఆమాటకు వస్తే సంగ్రామమే రాజకీయం.

కొన్నాళ్ళపాటు శాసనానుమతిని జీవం అనేది లేకుండాచేయడం ఎంత అసంభవమో, అలాంటిది ఎంతటి విపరీతభావనో కొన్నాళ్ళపాటు రాజకీయాలు అనేది లేకుండాచేయడం అనేదికూడా అంతే. ఈ యుద్ధం ముగిసినతరువాత ప్రధాన, ప్రముఖ కీలకస్థానాలు సంపాదించుకోవాలని

వివిధజాతులు ఇప్పట్నుంచి ఒకదాంతో మరొకటి పోటీపడుతూవున్నవి. ఈ ధోరణిలోనే శాంతినిర్మాణం అనుదినం జరుగుతూవుంది. ఉత్తర అఫ్రికాలోని ఫ్రెంచివారు, ఇటలీ కార్మికోద్యమం, బొడోలియోరాజు, జర్మనీవిషయం ఏంచేయాలి అన్న సమస్య, రష్యాతో సంబంధాలు, భారత దేశము, చైనా - ఇత్యాది విషయాలయెడల వివిధరాజ్యాలవైఖరులు భవిష్యత్పరిణామాకారపు అంగములే. కాని ఈ వైఖరులు నవ్య వికసిత ప్రపంచ నిర్మాణానికి తగిన మూసలు మాత్రం కావు. వాస్తవానికి యీనాడు శాంతిఆకారం విషాదచ్ఛాయను పోలివుంది.

రూపొందుతూవున్న శాంతిరేఖలు ఇప్పటికి యీవిధంగావున్నవి:

(i) సామ్రాజ్యాలు విచ్ఛిన్నంకావని అధికారప్రకటనలు వెలువడినవి. ఇందుకు సంబంధించి నిర్దుష్టమైన సూచనలూ గోచరిస్తున్నవి, అంటే యుద్ధం అన్నమాటే.

(ii) ప్రత్యేక ఒడంబడికలు చేసుకోవడానికీ, అధికారసంపాదనకు తంత్రాలు పన్నడానికీ ప్రభుత్వములు ప్రయత్నిస్తున్న సూచనలు కనిపిస్తున్నవి. కొన్ని పత్రికలూ, కొందరు ప్రచారకులూ ఈ పద్ధతిని ప్రోత్సహిస్తున్నట్లుకూడా కనిపిస్తుంది. గతంలో ఈపద్ధతులు యుద్ధాలకు దారితీసినవి.

(iii) జాతీయనౌకా వ్యాపారానికీ, వైమానిక రవాణా వాణిజ్యానికీ ముందు ముందు రాగల పోటీనిగురించిన సణుగుడు, వివిధదేశాల తహతహలు వినవస్తున్నవి. అంతర్జాతీయ సఖ్యతలకు ఈ భావాలు దోహదం చేయవు.

(iv) తమకు ఎక్కువ భూభాగం కావాలని కొన్నిదేశాలు బాహాటంగానే గాక అధికారపూర్వకంగాకూడా కోరుతూవున్నవి. ప్రాంతీయ పంపకాలవిషయమై ప్రభుత్వ స్థాయిలో బేరసారాలు ప్రారంభమైనవి. కొన్ని సరిహద్దులను సరిచేయాలని, సరిదిద్దాలని అధికారులు ఒత్తిడిచేస్తు

న్నారుకూడా, చరిత్రజ్ఞానం గలవారు ఈ కోరికల్లో, ఈ బేరసారాల్లో, ఈ ఒత్తిడిలో సాయుధ సంఘర్షణాబీజాలున్నవని గ్రహిస్తారు.

(v) తమకు ఇష్టమైన, సమ్మతమైన రాజ్యాంగ విధానాలను యూరపులో ఏర్పాటుచేయాలని మిత్రరాజ్యాలకు చెందిన ప్రధానదేశాలు సంకల్పించినవి. ఈ సంకల్పం స్పష్టంగా గోచరిస్తూనేవుంది. చాలా ప్రబలంగాకూడా కనిపిస్తున్నది. రష్యాకు తన ప్రత్యేక పథకం వుంది. బ్రిటన్ అమెరికాదేశాలు తాము ఒకవిధమైన రాజ్యాంగాన్ని అయితేనే అంగీకరిస్తామనీ, అందుకు భిన్నమైన రాజ్యాంగాలన్నింటినీ తిరస్కరిస్తామనీ విస్పష్టంగా ప్రకటించినవి. అన్యుల ఏర్పాటులను అంగీకరించే, ఆమోదించే స్థితిలో ఆసియావలెనే యూరపుకూడా లేదు. అసలు ఈసందర్భంలో మనం గుర్తించవలసిన విషయం ఒకటివుంది. ఇతరదేశాల నిమిత్తం రష్యా తయారుచేసిన పథకం బ్రిటన్ అమెరికాలు సంయుక్తంగా తయారుచేసిన పథకానికి పూర్తిగా భిన్నంగా వుంది. ఐక్యరాజ్యాల్లో శాంతినిర్మాణానికి అత్యంతావశ్యకమైన ఐక్యత మృగ్యమైంది.

పదికాలాలపాటు వుండగల శాంతి, న్యాయంధర్మంపై ఆధారపడిన శాంతి దుర్లభం అనే నిరాశాభావం ప్రపంచమంతటా ఏర్పడింది. ఇది చాలా ఎక్కువగాకూడావుంది. ఇలాంటి ప్రపంచ పరివ్యాప్త నిరాశాభావం కలగడానికి పైన పేర్కొన్నవే కారణాలు. ఈ యుద్ధం ముగిసిపోకముందే, అందరూ తృతీయ ప్రపంచ సంగ్రామంగురించి ముచ్చటించడానికి, తీవ్రంగా చర్చించడానికికూడా హేతువులు పైన ఉదహరించినవే.

శాంతిని భగ్నంచేయగల ఈ శక్తిపంచకం ఇలా వున్నప్పటికీ భవిష్యత్ శాంతి విషయంలో కాస్త ఆశకలిగిఉండటానికి ఆధారాలు లేకపోలేదు. చైనా పూర్తిగా సామ్రాజ్య వ్యతిరేకదేశంఅయింది. ఆ వ్యతిరేకభావాన్ని నిర్భయంగా, బాహాటంగా చాటుతూఉంది కూడా. తీవ్రనిర్బంధాలకూ, దారుణమైన నిరంకుశ చర్యలకూ గురిఅయినా, అన్నిదెబ్బలనూ

తట్టుకొని, భారత స్వాతంత్ర్యోద్యమం బలపడుతూవుంది. ఫ్రాన్స్ తిరిగి తల ఎత్తగలదనే ఆశను అందరూ వదులుకున్నారు. అయినా ఫ్రాన్స్ మళ్ళీ శక్తివంతమైన రాజ్యంగా ఏర్పడడం, రెండు దశాబ్దాలు ముసోలినీ ఫాసిజం తాకిడితో నలిగి నీరైపోయిన ఇటాలియను కార్మికులు ముసోలినీ పతనానంతరం తమ పూర్వపు శక్తిని ప్రదర్శింపగలగడం జరిగింది. నాజీ ఆక్రమణలో హిట్లర్ సైన్యాల అదుపులోవున్న దేశాల్లో హిట్లర్ ప్రాతికూల్యం అచలంగా వుంది. ఆర్థిక మాంద్యాన్నీ, యుద్ధాలనూ నివారించడానికి యుద్ధానంతరం అంతర్జాతీయార్థిక సహకారం అవసరం. ఆ సహకారాన్ని సాధించడానికి కొత్త అంతర్జాతీయ సంస్థలు ఏర్పాటవుతున్నవి. సంగ్రామ ఫలితంగా దాదాపు జీవచ్ఛవంలాగా తయారైన యూరపు పునరుజ్జీవనకు, పునరుద్ధరణకు సర్వసహాయం చేయడానికి అమెరికా సిద్ధంగా వున్నది. ఇవిగాక ప్రధానంగా ఎంచవలసిన విషయం మరొకటి వుంది. ప్రథమ ప్రపంచసంగ్రామం ముగిసిన కొద్దికాలానికే ద్వితీయ ప్రపంచసంగ్రామం రావడంవల్ల మనకు మనలోపాలు కళ్ళకు కట్టినట్లు కన్పించినవి. స్థిరమైన శాంతి ఏర్పడేందుకు ఈ లోపాలన్నీ సవరణ కావాలని ప్రపంచ ప్రజలు యావన్మందీ గ్రహించారు. రాజకీయ వేత్తల, రాజ్యాంగ విధానాల ఆరోగ్యప్రదమైన సంశయాత్మాదృక్పథం ప్రపంచాన్ని చక్కగా ఊడ్చివేసి విషయసంగ్రహణానికి వీలుచేసింది. ఇకముందు ప్రభుత్వాల స్వభావం, వాటి సద్గుణ — దుర్గుణాలు శాంతిని స్థాపించడంలో, అశాంతిని సంరక్షించడంలో అవి చూపే సామర్థ్యంబట్టి నిర్ణయమౌతూవుంటుంది. దృఢతర విశ్వాసాలు రెండు ఒకదాన్ని మరొకటి వెన్నంటుతున్నవి: యుద్ధాలు నివార్యములే. కాని ఇందుకు సంబంధించి మనం ఏమీ చేయకపోతే యుద్ధం అనివార్యమే ఔతుంది. కనుకనే సమిష్టి భద్రతకు అమెరికాలోనూ, ఇతర దేశాల్లోనూ అనుకూలత ఏర్పడింది. యుద్ధానంతర ప్రపంచం విషయంలో ప్రజల ఆసక్తి, శ్రద్ధ

తీవ్రంగా వున్నవి. వాస్తవమైనవేకూడా. నాయకులు ఈ ప్రజాభిప్రాయాన్ని పాలిస్తే, పాటిస్తే ప్రజలు నిస్సందేహంగా నాయకులను అనుసరించి ప్రపంచశాంతిరక్షణకు అంతర్జాతీయ పద్ధతిని అనుగమిస్తారు.

ప్రభుత్వం అంటూ వేరే ఒకటి లేదు. భిన్నాభిప్రాయాలుగల వ్యక్తులు కొందరి కూటమే ప్రభుత్వం. వివిధవర్గాల, వ్యక్తుల అపేక్షలూ అభిప్రాయాల ప్రవాహాల సంగమమే ప్రభుత్వ విధానాలు. కాని ప్రజలు ఉద్యమిస్తే ప్రభుత్వ విధానాలను సంస్కరింపవచ్చును. తల్చుకుంటే పూర్తిగా మార్చి వేయనూవచ్చు. ప్రజల ఉదాసీనత, నిర్లిప్తత, నిర్లక్ష్యం కొందరు అధికారులను బలపరుస్తవి. ప్రజాభిప్రాయం సువ్యక్తమైతే, ప్రజాభీష్టం గాఢంగా ప్రకటితమైతే కొందరు నాయకులు శక్తిగలవారవుతారు. వారే చాలా ముఖ్యులౌతారు రాజకీయ రంగంలో.

ఎన్నికలసమయంలోనే గాదు, మామూలు పరిస్థితుల్లోకూడా ప్రభుత్వవిధానాన్ని నిర్ణయించగల శక్తి, హక్కు, అధికారం ప్రజలకు వుంది. ఎన్నికల సంరంభంలో వివిధ పక్షాలు ఏర్పాటుచేసే వ్యూహాల్లోనుంచి తప్పించుకొని బయటపడగలిగితే ఓటరులు సర్వాధికారులే. ఈనాడు మనం ఎన్నుకునే అధికారులు, ఈనాడు మనం సృష్టించే రాజకీయ పరిస్థితులు, ఈనాటి మన ఆలోచనలు - ఇవే రేపు శాంతినిర్మాణానికి తోడవుతవి.

ఈవిధంగా ప్రజాస్వామికంలోనూ ప్రతిఓటరూ శాంతిపరిష్కారాన్ని రచిస్తూ వున్నాడు. శాంతినిర్మాణం ఈదఫా ఏ లండన్‌లోనో, ఏ పారిస్‌లోనో, ఏ వాషింగ్‌టన్‌లోనో జరుగదు. ప్రపంచకార్మికావాసాల్లోనూ, పారిశ్రామిక కేంద్రాల్లోనూ, అసంఖ్యాకంగా వున్న వ్యావసాయిక ప్రాంతాల్లోనూ శాంతినిర్మాణం జరుగుతుంది.

ప్రజాస్వామికాలన్నింటిలోని అత్యధిక సంఖ్యాకులేగాక, నియంతృత్వ దేశాల్లోని అత్యధిక సంఖ్యాకులుకూడా స్థిరమైన శాంతిని కాంక్షిస్తున్నారు.

8

అలాంటి శాంతికోసరం ఎంతటి త్యాగాన్ని చేయడానికైనాకూడా వారు సిద్ధంగా వున్నారు. అన్ని ప్రాంతాల ప్రజలకూ ఉత్తమ ఆదర్శాలు, ఉన్నత లక్ష్యాలూ వున్నవి. శాంతినిర్మాణంసందర్భంలో ఉత్పన్నమయ్యే వివిధ ఆర్థిక సాంఘిక సమస్యలనూ తన దృక్పథంతో పరిష్కారం చేయడానికి పూనుకొనేవారికి ఊతమివ్వడానికి ఈ పరిస్థితులను బాగా ఉపయోగించుకొనవచ్చు. అధికారవర్గాల్లో వుండి ఈ నూతన దృక్పథాన్ని అనుసరించేవారిని బలపరచవచ్చును.

నిరాశావాదులు, 'వాస్తవిక వాదుల'ను రక్షించేవారూ, యథాస్థాయిని కాపాడేవారూ శాంతిపరిష్కారాన్ని అంతర్జాతీయత, సంఘ సంస్కారం, సామ్రాజ్య వ్యతిరేకతద్వారా సాధింప ప్రయత్నించేవారిని హేళన చేస్తారు. అపహాస్యం చేస్తారు. వారిని హేళనచేసే ఆదర్శవాదం ఇది. ఇది చాలా చిక్కులతోకూడుకొన్న దంటారుకూడా. వీలైనంత తక్కువ ప్రతిఘటన కవకాశం ఇచ్చే "వాస్తవిక" పద్ధతిని వీరు అభిమానిస్తారు. ఉన్నదే మంచిదనుకొంటారు. అదే వుండాలి అని అంటారు.

ఈ వాస్తవికవాదులు ఎవరో చూడండి: నెవిల్లీ చేంబర్లీన్, ఎడ్వర్డ్ డెలాడియర్, హిట్లర్, ముసోలినీ, టోజో. వీరందరూకూడా సర్వనాశనానికి దారితీశారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి స్పెయిన్ అంతర్యుద్ధం అంకురార్పణ అని ఆదర్శవాదులు అంటే, "హిట్లర్ ముసోలినీలకు ఆగ్రహకారణం కాగల పనులను వేటినీ మనం చేయరా"దని వాస్తవిక వాదులు ఎదురువాదించారు.

మధ్యయూరపు అంతలోనూ ఎంకోనాణ్యమైన ప్రజాస్వామికం చకస్లవేకియా. అలాంటి దేశాన్ని అన్యాయంగా, అక్రమంగా ఆక్రమించడానికి హిట్లర్ తయారైనాడు. అప్పుడు మ్యూనిచ్‌లో అగ్రనాయకులు సమావేశమైనారు. ఇప్పుడిక్కడ మనం హిట్లర్‌ను తృప్తిపరిస్తే మన హయాం శాంతంగానే వెళ్ళిపోతుందనీ, మన పురుషాంతరంలో శాంతికి

భంగం కలగదనీ ఈ మ్యూనిచ్‌లో సమావేశమైన వాస్తవికవాదులు భావించారు. అలాగని ప్రకటించారుకూడా. చైనాపై దురాక్రమణ సాగించిన జపానుకు వీరే సంగ్రామ నిర్వహణానికి అవసరమయిన ఇనుము, చమురు విక్రయించారు. వీరుచేసిన దారుణాలు ఇంకా వున్నాయి. 1939 లో నాజీ సేనలు బ్రిటన్ ముట్టడిని సాగిస్తున్నవి అప్పుడు ఆ దేశానికి సహాయం చేయడానికి ఉద్యమిస్తే అట్టి ఉద్యమానికి వీరు అడ్డుతగిలారు. 1940 వ సంవత్సరంలో సమర సన్నాహాలు చేసుకుంటూ వుంటే ఆ యుద్ధ సన్నద్ధ కార్యాలకు విఘాతాలు కల్పించారు. "సాధ్యాసాధ్యాలు గ్రహించని ఆదర్శవాదులు" ఇంతకంటే కాస్త మంచిపనే చేశారు. వీరికి అధికారమే



ఫిలిప్పీన్సు అధ్యక్షుడు క్విజాన్

ఉంటేఫాసిజం ప్రమాదకరం కాకపూర్వమే, ఎంతో ముందుగా ఆ ఫాసిజాన్ని ప్రతిఘటించివుండేవారు. దురాక్రమణదారులను దూరంగావుంచి నియంతల దండయాత్రలను ప్రతిఘటించడానికి బలం సమకూర్చుకొని ఉండేవారు.

'వాస్తవిక' వాదులే ఈ యుద్ధాన్ని ప్రారంభించారు. ఈ 'వాస్త

వికత' పేర వీరు శాంతినికూడా నాశనంచేయగలరు. వాస్తవిక, ఆదర్శ వాదాల సమ్మేళన ఫలితంగా ఏర్పడ్డదే నిజమైన వాస్తవికవాదం. కఠిన మైన మార్గాలను కాదనక, పరదేశాల్లోని శత్రువులను జయించడానికీ, మిత్రులను సంఘటిత పరచడానికీ, మార్పులకూ, అవసరమైతే ప్రాథమిక మార్పులకూ, శాంతికి త్యాగాలు చేయడానికి దారిచూపగలదే నిజమైన వాస్తవికవాదం. తిరిగి రణరంగాల్లో ప్రాణాలను అర్పించి రక్తాన్ని ధార వోసి విపరీతమైన త్యాగం చేయవలసిన పరిస్థితులు ఏర్పడకుండా వుండ గలందులకు సుస్థిరశాంతి అవసరం. అందునిమిత్తం త్యాగంచేయాలి. శాంతిని సాధించడం అంత తేలికైనపనిగాదు. అయినా ఎన్ని కష్టాలనైనా సహించి శాంతిని సాధిస్తే ఆతరువాత జీవితం సుఖప్రదంగా వుంటుంది.

ఈ యుద్ధంలో దస్సిపోయిన కారణంగా, తిరిగి వెంటనే సంగ్రామం సాగించేశక్తి లేనికారణంగా మరొక అయిదేళ్ళో, పదేళ్ళో శాంతి అనేది వుండవచ్చు. వెంటనే మరొక సంగ్రామాన్ని ప్రారంభించడానికి ఏదేశానికీ దైహిక దారుఢ్యంగాని, నైతిక శక్తిగాని వుండదు. అందుచేత ఈ సంధ్యాసమయంలో సంగ్రామహేతువులను సమూలంగా నిర్మూలనం చేయడానికి మానవకోటికి ఒక అపూర్వ అవకాశం లభిస్తుంది.

పరాజిత శత్రువులను శిక్షించినంతమాత్రాన మనకు శాంతి లభిం చదు. విజయాన్ని పొందిన దేశాలమధ్య పోటీ ఎక్కువైంది. వలస దేశాల్లో అసంతృప్తి ఎక్కువవుతూవుంది. అన్నిదేశాలూ వర్తమానం కంటే ఉత్తమమైన భవిష్యత్తుకోసరం తారట్లాడుతూవున్నవి. ప్రపంచ ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమస్యలు సంగ్రామవిజయంవల్ల పరిష్కారం

కాజాలవు. యుద్ధ విజయం చేయగలిగేదల్లా ఈ సమస్యాత్రయంపై ప్రపంచ దృష్టిని కేంద్రీకృతం అయ్యేటట్లు చేయడమే. వీటిని అంధకారంనుండి వెలుతురులోకి తీసుకొచ్చి పరిష్కారంకావలసిన సమస్యలు ఇవి వున్నవని తెలిపింది విజయం.

1943 వ సంవత్సరం అక్టోబరు 16 వ తేదీన సమ్నర్ వెల్స్ న్యూయార్క్‌లోని వైదేశిక వ్యవహారాల సంఘంలో ఒక ఉపన్యాసం చేశాడు. ఆయన ఏ అధికారహోదా లేక సామాన్య అమెరికను పౌరుడుగా ఉపన్యాసం అంటూ చేసి చాలాకాలం అయింది. థామస్‌కార్లయిల్ రచనలనుండి ఉల్లేఖిస్తూ సమ్నర్ వెల్స్ ఇలా చెప్పాడు: "మీరుగాని కాస్త బలంగా, గట్టిగా ఊపివేయకపోతే, కుళ్ళి కూలిపోవడానికి సిద్ధంగా వున్నప్పటికీ ఆ వ్యవస్థ అలా పొందికగానే ఎంతకాలం వుంటుందో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. సోమరితనాన్ని, స్తబ్ధతనూ జయించడానికి, పాతపంథాలు వదులుకొని కొత్త దారులు తొక్కడానికి ప్రజలు ఎంతో కష్టపడతారు" అని థామస్ కార్లయిల్ అన్నాడు. తరువాత సమ్నర్ వెల్స్ తనభావాలను వ్యక్తం చేస్తూ ఇలా చెప్పాడు: "ఇదివరలోనూ, ఇప్పుడూ మనం క్రుళ్లి కృశించిన ప్రపంచంలో జీవిస్తున్నాం. వెనుక ధైర్యం, సాహసం, వివేకం లేకపోయినందుకు ఫలితాలను ఇప్పుడు మనం అనుభవిస్తున్నాం. ఇందుకు మనమూ, మనతోబాటున్న ఇతరదేశాలూ బాధ్యత వహింపవలసిఉంటుంది మనం మన పొరపాట్లను, తప్పులను ఒప్పుకోవాలి. పాతకట్టడాలను గట్టిగా ఊపివేయడంద్వారానూ, మన స్తబ్ధతను జయించడంద్వారానూ, నవ్యమార్గాల సాహసించడంద్వారానూ మాత్రమే శుభప్రదమైన రోజులను చూడాలనీ, చూడగలమనీ ఆశించగలం."

శాంతికీలకం ఇదే.

మన నాగరికతలో ఏర్పడిన ద్వివిధ క్లిష్టస్థితిని ఈ యుద్ధం ప్రతిబింబింపజేసింది. యుద్ధం సాగుతూవుంటేనే తప్ప మనం నిర్వ్యాపా

రతను నిర్మూలింపలేమనీ, శాంతిని కాపాడలేమనీ ఈ యుద్ధం ఋజువు చేసింది. కుళ్ళిపోయిన ప్రపంచంలోని ఈ రెండు లక్షణాలూ అసలు భవిష్యత్తునే సవాలుచేస్తూ ఉన్నవి. ఓడిపోయిన శత్రురాజ్యాలను శస్త్ర చికిత్సకు గురిచేయడంద్వారా మనం ఈ సవాలును ఎదుర్కోలేము." "సాంఘికాభివృద్ధిలేంది శాంతి సాధ్యంకాదు" అన్న ఈడెన్ ప్రకటనలో దేశపటాల మార్పు పొలిమేరల పునర్నిర్ణయం చాలదనే భావంకూడా గర్భితమై ఉంది. శాంతిని స్థాపించడానికి పురాణ కట్టడాలను గట్టిగా కదల్చాలి. ఒక ఊపు ఊపాలి. పనికి వచ్చేదీ, ప్రయోజనకరమైందీ మాత్రమే నిలుస్తుంది.

కనుకనే యూరపులోని ప్రతీపశక్తులకు అమెరికా ఇచ్చే ప్రోత్సాహమూ, "మాకున్నదాన్ని మేం నిలుపుకుంటాం" అనే చర్చిల్ విధానమూ శాంతిస్థాపనకు అవసరమైన ఉపకరించగల నవ్య ప్రపంచ నిర్మాణానికి దోహదం చేయవు.

భారత స్వాతంత్ర్యాన్ని చర్చిల్ ఒక్కడే ప్రతిఘటిస్తున్నాడంటే, మిగతా టోరీలందరూ నవ్య ప్రపంచాన్ని వాంఛిస్తున్నారనే భావం స్ఫురింపవచ్చు. అలాంటి అభిప్రాయానికి రావచ్చు. కాని అది చాలా తొందరపాటు అభిప్రాయం. బ్రిటిష్‌ప్రభుత్వ ఉత్పత్తిశాఖా మంత్రి ఆలివర్ లిటిల్టన్ 1943 వ సంవత్సరం నవంబరు 26 వ తేదీన బ్రిటిష్ కన్సర్వేటివ్ పక్షం తరపున ఆక్స్‌ఫర్డ్‌లో ఇలా ప్రసంగించాడు: "ఈనాడు కాన్సర్వేటివ్ పక్ష విధానాన్ని చర్చించడంలో గుర్తించవలసిన తుది విషయం, అయినా అత్యంత ప్రధానమైన విషయం ఒకటుంది. కాన్సర్వేటివులమైన మాకు సామ్రాజ్యబంధాలను బిగింపు చేసుకోవడంలోనే నమ్మకం ఉంది. ఈ విషయంలో కాన్సర్వేటివ్ పక్ష వైఖరి విధానం ఖచ్చితంగా ఉంది. మాపక్షం పట్టుదలగాకూడా ఉంది. బ్రిటిష్‌వారు భారతదేశాన్ని పాలించడానికి ఏవో సాకులు చూచుకోవలసిన అవసరం మా పక్షానికి ఏమీ కన్పిం

చడంలేదు. కారణాలు చూచుకోవలసిన అగత్యంకూడా ఏమీ కన్పించడం లేదు. తన్ను తాను రక్షించుకోలేని దేశానికి, మనం రక్షింపలేని దేశానికి స్వపరిపాలన కావాలనడం నిజంగా హాస్యాస్పదమే."

సామ్రాజ్య విచ్ఛిత్తిని ప్రతిఘటిస్తూ ఉన్నది చర్చిల్ ఒక్కడేకాదని ఇందువల్ల విస్పష్టమైంది. కుర్రకారు టోరీలు చర్చిల్ అడుగు జాడలవే అనుసరిస్తున్నారు. గడియారాలు వాటికవి ఎటూ తిరక్కుండా నిలిచి ఉండటం ఎరుగుదుం; లేదూ కొందరు వాటిని వెనక్కు తిప్పడంకూడా మనం ఎరుగుదుం. గతం కొందరికి చాలా ప్రియంగా ఉండవచ్చు. గతానికి భిన్నమైన భవిష్యత్తు అంటే ఎంత భయమో అంతగా వీరు భూత కాలాన్ని ప్రేమిస్తారు. ఆ భయం, ఈ ప్రేమ ఈ రెండే మార్పును, అభ్యుదయాన్ని అడ్డుతూ ఉన్నవి.

తమ దేశాన్నీ, తమ సర్వాధికారాన్నీ రక్షించుకోవడానికే మిత్ర రాజ్యాలు ఈ యుద్ధాన్ని సాగించినవి గాని నూతన ప్రపంచాన్ని నిర్మించడానికి కానేకాదు. ఒక్క బ్రిటన్, ఫ్రాన్సు దేశాలు తప్ప మిగిలిన మిత్ర రాజ్యాలు అన్నీకూడా దురాక్రమణకు గురి అయిన తరువాతనే కక్షిదారులైనవి. యుద్ధంలో పాల్గొన్నవి. ఈ దేశాల్లో చాలా దేశాల అభిమానం అక్షరాజ్య ప్రత్యర్థులపైనే ఉంది. అయినా ఈ ప్రవాహం తమ కాళ్ల క్రిందకు వచ్చేవరకూ కార్యరంగంలోకి దిగలేదు. అసలు ముందు, అందరికంటే ముందు, అక్షరాజ్యాలపై బ్రిటనే యుద్ధం ప్రకటించింది. బ్రిటన్ అలా చేసిన తరువాత తాను చేయకపోతే బాగుండదనే భావంతో, నలుగురూ నవ్విపోతారనే భయంతో ఫ్రాన్సుకూడా 1939 వ సంవత్సరం సెప్టెంబరు 3 వ తేదీ మధ్యాహ్నం యుద్ధం ప్రకటించింది. జాతీయత, అంతర్జాతీయతల విషయం ఒక్క బ్రిటిష్ ప్రజలకే బాగా తెలుసును. కనుకనే, బ్రిటిష్ ప్రజలు తీవ్ర ఫాసిస్టువ్యతిరేకులు కనుకనే అటా ఇటా అని తటపటాయించే చేంబర్లీన్ ప్రభుత్వం అక్షరాజ్యాలు బ్రిటిష్‌వారిపై

గాని బ్రిటన్‌పైగాని దెబ్బ వేయకపూర్వమే వాటిపై యుద్ధం ప్రకటించే టట్లు చేయగలిగారు.

వికృతమైన తమ నిజాకృతిని అక్షరాజ్యాలు ప్రదర్శించిన తరువాత చాలాకాలంవరకూ నేడు ఐక్యరాజ్య సమితి సభ్యత్వాన్ని పొందిన దేశాలు అనేకం ప్రచ్ఛన్నంగానూ, ప్రత్యక్షంగానూ అక్షరాజ్యాలకు సహాయంచేస్తూ ఉండేవి. కనుక ఈనాడు విధివశాత్తూ అక్షరాజ్యాల ప్రతికక్షులుగా ఉన్న రాజ్యాలు ఉత్తమ ప్రపంచ విధానాన్ని అనుసరిస్తారని ఆశించటం భావ్యం కాదు. పూర్వాశ్రమాన్ని రక్షించాలనీ, దాన్ని తిరిగి నెలకొల్పాలనీ వారు చేసే ప్రయత్నాలను విమర్శించటంకూడా భావ్యంకాదు. కాని ఇలా నేను విమర్శించడానికి గల కారణం ఏమంటే—

సరికొత్త సంకల్పం కలిగి అంతర్జాతీయత, ప్రజాస్వామ్యం, రెండు వందల కోట్ల ప్రజలకు శాంతి సౌభాగ్యాలను సమకూర్చగల నవ్య ప్రపంచ నిర్మాణం మొదలైన ఉన్నత లక్ష్యాలు కలిగి వాటిని సాధించడానికి దీక్షా బద్ధులైనవారే శాంతిని సాధిస్తారని నాకు ఆశ ఒకటి ఉంది. ఆ ఆశే ఈ నా విమర్శలకు హేతువు.

పాసిజంనిర్మూలనం నవ్య ప్రపంచద్వారాలను మనకు తెరిచి వేస్తుంది. కనుక ఈ నా ఆశ శాసనసమ్మతమైనదే; శాస్త్రబద్ధమైనదే.

బూజుపట్టి, కుళ్లిపోయిన పూర్వాశ్రమ యథాస్థాయిని కాపాడాలని కొందరు ఎంతో పట్టుదలగా, బలంగా పనిచేస్తున్నారు. నవ్య ప్రపంచాన్ని కోరేవారుకూడా అంతపట్టుదలగా, బలయుతంగా కృషిచేస్తేనేగాని నూతన జీవితానికి అవకాశం ఉండదు; కొత్త జీవితం అనేదే ఉండదు.

దుర్బల రాజ్యాల, వలసదేశాలపై అగ్రరాజ్యాల ఆధిపత్యాన్ని నెలకొల

కొల్పడంమూలంగా గల శాంతి పరిష్కారం అమెరికాను సామ్రాజ్య, సైనికతత్వాల్లోకి ఈడుస్తుంది. ప్రస్తుతం శాంతిపరిష్కారం ఆవిధంగానే ఉండేలాగా కల్పిస్తున్నది. అగ్రరాజ్యత్రయంలోని రెండురాజ్యాలు సామ్రాజ్య విధానాన్ని అనుసరిస్తే మూడవ రాజ్యం ఆ ద్వయాన్ని అనుసరిస్తుంది. వాయుసామ్రాజ్యం, వాణిజ్య సామ్రాజ్యం. చమురు సామ్రాజ్యవాదం, ఆర్థిక సామ్రాజ్యవాదం. సైనిక సామ్రాజ్యవాదం, (నౌకావైమానిక కేంద్రాలు) అప్పుడే అమెరికాలో గోచరిస్తూ ఉన్నవి. వెనుకటి నిర్లిప్తవాదం అస్తమించింది. రెండు బ్రహ్మాండమైన సముద్రాలు అమెరికాను కాపాడుతూ ఉన్నవి కనుక అమెరికా, యూరపు, ఏషియా గొడవల్లో జోక్యం కలిగించుకోనవసరం లేదని 1941 వ సంవత్సరం పూర్వపు నిర్లిప్త వాదులు విశ్వసించారు. ప్రచండసంగ్రామానికి సన్నద్ధం కావాల్సిన ఆగత్యం కూడా లేదని వీరు భావించారు. అమెరికా భూభాగంపై దండయాత్ర సాగింపవీలున్నదని "పెరల్ హార్బర్ సంఘటన" ఋజువుచేసింది. నిర్లిప్త వాద శవపేటిక మూతవేసింది పెరల్ హార్బర్ దాడి. నిర్లిప్త వాదానికది చరమశ్లోకం చదివింది. ఫ్రాన్స్ సైన్యమూ, బ్రిటన్ నౌకాదళమూ, యూరపులో దురాక్రమణ సాగించేవారిని ప్రతిఘటించగలవనే నమ్మకంపైన అమెరికను నిర్లిప్తవాదం ఆధారపడిఉంది. ఈ విషయం నిర్లిప్తవాదులు గుర్తించి ఉండకపోవచ్చును. 1940 వ సంవత్సరములో దురాక్రమణను ప్రతిఘటింపవలసి వచ్చినప్పుడు ఫ్రెన్స్ విఫలమైంది. ఈ యుద్ధంలో అమోఘంగా పనిచేసిన బ్రిటిష్‌నౌకాదళానికీ అమెరికాసహాయంలేకుంటే అదేగతి పట్టేది.

ఫ్రాన్స్, బ్రిటన్, చైనాల దౌర్బల్యంవల్ల అమెరికా ఇంక మీదట యూరపు, ఏషియా రాజకీయ వ్యవహారాల్లో ఎక్కువగా జోక్యం కలిగించుకోవలసి ఉంటుంది. ఆఫ్రికాలోనూ ప్రవేశింపవలసి రావచ్చు. బ్రిటన్ ఫ్రాన్స్, చైనా దేశాల బలహీనత అమెరికా నిర్లిప్తవాదానికి చావుదెబ్బగా పరిణమించింది. రానున్న సూపర్ ఫోర్ట్రెసెస్ విమానాల అభివృద్ధి

సముద్రాలను దాటిపోగల రాకెట్ బాంబులూ ఇలాంటివనే చేసినవి.

ప్రతి అమెరికన్ పౌరుని జీవితంలోనూ ఇవి కొత్తవిషయాలైనవి. అందుచేత ప్రధానమైన సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయిక యుద్ధహేతువులను పూర్తిగా తొలగించివేయమని అంతర్జాతీయవాది కోరుతూ ఉన్నాడు. అంతర్జాతీయ సంఘనిర్మాణ మార్గంలో అవరోధాలను, ప్రతిబంధకాలను కలిగించే ఆ క్లిష్ట ప్రపంచప్రతిబంధకాలను తొలగించవలసిందని కోరుతూ ఉన్నాడు. ఘోరసంఘటనలవల్ల నిర్లిప్తవాదులుగా ఉంటున్న వారు దిగ్భ్రాంతులై ఆ కూపస్థమండూకదశనుంచి బయటపడ్డారు. ప్రపంచమంతటిలోనూ అమెరికా బాగా బలమైన సైనికరాజ్యం కావాలంటున్నారు. సముద్రాంతర నౌకాకేంద్రాలిమ్మని కోరుతున్నారు. ఏషియా భూభాగంలోనూ, ఆఫ్రికాలోనూ, అవసరమైతే లాటిన్ అమెరికాలోనూ మనం స్థావరాలు ఏర్పరచుకుందాం. నిన్నటి నిర్లిప్తవాది రేపటి సామ్రాజ్యవాది కావచ్చు. నిర్లిప్తవాదంనుండి సామ్రాజ్యవాదానికి మార్చుకోవడం కొంతమంది నిర్లిప్తవాదులకు చాలాకష్టమైన పని. నిర్లిప్తవాదంలాగా సామ్రాజ్యవాదం కూడా అమెరికా ఒంటరిగా సమిష్టి, అంతర్జాతీయ శాంతిరక్షణ చర్యలపైగాక కేవలం స్వశక్తిపై ఆధారపడి ఉండాలని కోరుతుంది. కనుక సామ్రాజ్యవాదానికీ, నిర్లిప్తవాదానికీ సహజమైన సన్నిహితత్వంఉంది.

పాతసామ్రాజ్యాలను కొనసాగించే చెడ్డశాంతి కొత్తసామ్రాజ్యవాదులను సృష్టిస్తుంది.

అమెరికా కొరకు, ఇంగ్లండ్ కొరకు, రష్యాకొరకు, చిన్నరాజ్యాల కొరకు, వలసప్రజల కొరకు, శాంతికొరకు సామ్రాజ్యాలు పోవాలి.




[అన్ని హక్కులూ ప్రకాశకులవే]

# మా ప్రచురణలు దొరుకు చోట్లు

| | | |
|---|---|---|
| మద్రాసు | .... | వెంకట్రామా అండ్ కో. |
| | | వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్. |
| | | యువ బుక్ డిపో. |
| కోట | .... | గాలి శ్రీనివాసరావుగారు. |
| వెంకటగిరి | .... | బి. రమణరావుగారు. |
| నెల్లూరు | .... | మెట్రొపాలిస్ న్యూస్ హౌస్, |
| | | వి. వి. నాయుడు అండ్ సన్స్. |
| | | వెంకట్రామాఅండ్ కో. |
| ఒంగోలు | .... | వెంకట్రామా అండ్ కో. |
| బాపట్ల | .... | వి. వి సుబ్బారావుగారు. |
| తెనాలి | .... | ది న్యూ వెరైటీ ఏజన్సీస్. |
| | | ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెని. |
| | | ది ఆంధ్రా బుక్ హౌస్. |
| | | వెంకట్రామా అండ్ కో. |
| | | గ్రంథాలయ పుస్తకశాల. |
| బెజవాడ | .... | శ్రీ దుర్గా మాడరన్ బుక్ డిపో. |
| | | భారత్ న్యూస్ ఏజన్సీ. |
| | | ది వెరైటీ ఏజన్సీస్. |
| | | పీపిల్స్ బుక్ డిపో. |
| | | లాల్ బుక్ డిపో. |
| | | సెంట్రల్ బుక్ షాప్, |
| | | యువ బుక్ డిపో. |
| | | మాడరన్ న్యూస్ ఏజన్సీ. |
| | | సరస్వతీ బుక్ డిపో. |

| | | |
|---|---|---|
| బెజవాడ | .... | వెంకట్రామా అండ్ కో. |
| | | ది లీలా బుక్ డిపో. |
| పటమట | .... | గ్రంథాలయ పుస్తకశాల. |
| మచిలీపట్టణము | .... | మినర్వా బుక్ డిపో. |
| | | త్రివేణీ పబ్లిషర్స్. |
| నందిగామ | .... | పీపిల్స్ బుక్ హౌస్. |
| గుంటూరు | .... | వెంకట్రామా అండ్ కో. |
| | | శ్రీ దుర్గా మాడరన్ బుక్ డిపో. |
| ఏలూరు | .... | నేషనల్ బుక్ డిపో. |
| | | గోపాల్ అండ్ కో. |
| | | ప్రజాశక్తి బుక్ డిపో. |
| | | వెంకట్రామా అండ్ కో. |
| తాడేపల్లిగూడెం | .... | వెంకట్రామా అండ్ కో. |
| పాలకొల్లు | .... | వెంకట్రామా అండ్ కో. |
| రాజోలు | .... | సున్నా అండ్ సన్స్. |
| మారుటేరు | .... | వి. వి. రాజు అండ్ బ్రదర్స్. |
| రాజమండ్రి | .... | ఈశ్వర బుక్ డిపో. |
| | | రైతు బుక్ డిపో. |
| | | ఆర్యన్ బుక్ డిపో. |
| | | పీపిల్స్ బుక్ హౌస్. |
| | | ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ. |
| | | వెంకట్రామా అండ్ కో. |
| కాకినాడ | .... | వెచ్చా తిరుపతయ్య. |
| వరంగల్ | .... | జైహింద్ బుక్ హౌస్. |

| | | |
|---|---|---|
| వరంగల్ | .... | చందా నారాయణశెట్టిగారు. |
| | | జైహింద్ న్యూస్ ఏజన్సీ. |
| | | శ్రీరామా అండ్ కో. |
| | | వెంకట్రామా అండ్ కో. |
| ఖమ్మంమెట్టు | .... | కారంశెట్టి సరసయ్య. |
| | | ప్రభాత్ బుక్ డిపో. |
| సికంద్రాబాద్ | .... | అజాద్ బుక్ డిపో. |
| | | చందా నారాయణశెట్టిగారు. |
| | | వెంకట్రామా అండ్ కో. |
| హైదరాబాద్ | .... | ది ఆంధ్రా బుక్ హౌస్. |
| | | చందా నారాయణ శెట్టిగారు. |
| | | వెంకట్రామా అండ్ కో. |
| కంభం | .... | వెంకట్రామా అండ్ కో. |
| కర్నూలు | .... | వెంకట్రామా అండ్ కో. |
| | | బాలసరస్వతీ బుక్ డిపో. |
| కడప | .... | వెంకట్రామా అండ్ కో. |
| చిత్తూరు | .... | వెంకట్రామా అండ్ కో. |
| అనంతపూర్ | ... | పద్మ బుక్ స్టాల్. |
| హిందుపూర్ | .... | వాణీ బుక్ డిపో. |

(హిగిన్‌బాథమ్స్ రైల్వే పుస్తకశాల లన్నింటిలోనూ
మా ప్రచురణలు దొరకును)

# అపూర్వ గ్రంథములు

'అపూర్వ గ్రంథములు' అను పేర ముద్రితాముద్రిత గ్రంథములను, సామాన్యముగ లభింపని కొన్ని రచనలను ప్రచురింప నున్నాము. ఈ ప్రచురణలు సభ్యులకు మాత్రమే అమ్మబడును. ఈ శీర్షికయందు కామశాస్త్రము. శృంగారము. బూతు. నీతి. సామ్యవాదము. కమ్యూనిజము. వైద్యము. జ్యోతిషము మొదలైన విషయములకు చెందిన గ్రంథరాజములను కొలది ప్రతులను మాత్రమే ముద్రింపించి, ప్రచురింప నుద్దేశించియున్నాము. సభ్యత్వపు రుసుము రూ. 2/-. మేమెట్టి గ్రంథమును ఈ శీర్షికన ప్రచురించినను సభ్యులు కొనితీరవలయును. వి. పి. లు నిరాకరించినవారు సభ్యత్వమునుండి తొలగించబడుదురు. సభ్యత్వ రుసుము వాపసు యివ్వబడదు.

లాభములేమియు పెట్టుకోక. పుస్తకముల ముద్రణాదులకయ్యే అసలు ఖర్చుల ప్రకారమే పుస్తకములధరలు నిర్ణయింపబడును. సభ్యులలో బహుసంఖ్యాకులు కోరినట్టి ఏ గ్రంథమునైనను 6 నెలల వ్యవధితో ప్రకటించుటకు యత్నింతుము.

సభ్యులు కాదలచినవారు తమ పూర్తి విలాసములను వెంటనే వ్రాయవలెను. సభ్యత్వరుసుము వెంటనే పంప నవరసరములేదు. 1948 జనవరిలో ప్రథమ 'అపూర్వ గ్రంథము' వెలువడును.

—: వి వ ర ము ల కు :—

## కల్చరల్ బుక్స్ లిమిటెడ్

పెరంబూరు : : మద్రాసు 11.

# మా ఏజన్సీ షరతులు

1. ప్రతి ఆర్డరుకు కమీషనుపోగా కనీసం రూ 25/- కు తగ్గకుండా మా ప్రచురణలను తెప్పించుకున్నవారిని గ్రంథవిక్రేతలుగా పరిగణింతుము.
2. మా ఏజంట్లుగానుండదలచినవారు రూ 10/- డిపాజిట్ కట్టవలెను. సంవత్సరం పూర్తిగానిది యీ డిపాజిట్ వాపసు యివ్వబడదు.
3. ఏవూరిలోగాని మా కెంతమంది ఏజంట్లయినా వుండవచ్చును.
4. మా ఏజంట్లకు మా సాధారణ ప్రచురణలకు 25% కమీషను యివ్వగలము. మా ప్రత్యేక ప్రచురణలకు (Specials) 15% కమీషను మాత్రమే. గ్రంథ విక్రేతలకు మా సాధారణ ప్రచురణలకు 20%, ప్రత్యేకప్రచురణలకు 12½% కమీషనుమాత్రమే యివ్వగలము. గ్రంథవిక్రేతలు తడవకు, కమీషనుపోగా, కనీసం రూ 10/- కు ఆర్డరివ్వాలి.
5. తపాలా, పాకింగ్ఖర్చులు మేమే భరింతుము. పార్సెలు ఖర్చులు ఏజంట్లూ, గ్రంథ విక్రేతలూ భరించవలెను.
6. మా ప్రచురణలను ఒకేమారు ప్రతిరకానికి 12 ప్రతులకు తగ్గకుండా 25 ప్రతులకు మించకుండా కొన్నవారికి 30% కమీషను యివ్వగలము. ఒకేమారు ప్రతిరకానికి 25 ప్రతులకు తగ్గకుండా 50 కి మించకుండా కొన్నవారికి 33⅓% కమీషను యివ్వగలము.
7. మా ప్రచురణలు వెలువడేముందు మా ఏజంట్లకు తెలియజేతుము. ఏజంట్లు కోరిన వారిలెక్కన నూతన ప్రచురణ ప్రతిది ఒకటిచొప్పున మా ఖర్చులతో పంపగలము.
8. అప్పులివ్వము. గ్రంథ విక్రేతలు ముందుగా డబ్బుపంపాలి. ఏజంట్లకు వి. పి. లు పంపుదుము. చెక్కులుగాని, డ్రాఫ్టులుగాని క్రాస్‌చేసి పంపాలి. మద్రాసు బ్యాంకులలో మార్చను అయ్యే ఖర్చు కొనుగోలుదారులే భరించాలి.
9. మా కేటలాగులో, అడపదడప మా ప్రచురణలలో మా ఏజంట్లపేర్లు ప్రకటింతుము.
10. ఉత్తరప్రత్యుత్తరాలన్నీ కల్చరల్ బుక్స్ లిమిటెడ్‌పేర జరపాలి. వ్యక్తుల పేర జరపరాదు.

**CULTURAL BOOKS LIMITED.**

PERAMBUR : : MADRAS 11.

# ఏజంట్లు కావాలి



ఆంధ్రదేశమంతటా, నిజాంరాష్ట్రమున

సంస్కృతి ప్రచురణలు,

అపూర్వ గ్రంథములు

అమ్ముటకు ఏజంట్లు కావాలి.

షరతులకు వెంటనే వ్రాయండి.



కల్చరల్ బుక్స్
లిమిటెడ్
: :
పెరంబూరు
మద్రాసు 11.

PRINTED AT THE B. N. K. PRESS, G. T. MADRAS.